

పీ ద ప ట్టు న

ఫోటో: కుటుంబరావు (మద్రాసు

# గ్రైమిక్స్ పోటీలో పాల్గొనండి

Grymix
FOR BABIES AND YOUNG CHILDREN
GRYMIX

# రు. 8,000 నగదు బహుమానములు గెలవండి

మీ బిడ్డను ఆరోగ్యముగా మరియు ఆనందముగా ఉండేలా చూచుకొంటూ, ఈ విలువైన నగదు బహుమానములుకూడా పొందండి.

మీ బిడ్డకు అత్యుత్తమ గ్రైప్ మిక్చర్ ఇవ్వండి. అంచేతనే వివేకవంతులైన తల్లులు గ్రైమిక్స్ తప్ప మరేదీ వాడరు. పొట్టనొప్పి, వాయువు, విరోచనాలు మొదలైన బాధలనుంచి బిడ్డలను వెంటనే కాపాడి బిడ్డలకు పళ్ళు వచ్చేటప్పుడూ, వారికి తల్లిపాలు మాన్పించేటప్పుడూ, వారిని గ్రైమిక్స్ సంతోషంగా వుంచుతుంది. బూట్స్ కంపెనీ వారి శ్రేష్ఠమైన ఉత్పత్తి గ్రైమిక్స్‌ను మీ బిడ్డకు యివ్వండి.

## నియమములు మరియు నిబంధనలు

1) ఈ క్రింద ఉదహరించిన శిశు సంరక్షణకు సంబంధించిన ఆరు సూచనలను మీరు నిర్ణయించిన విధముగా, ప్రాధాన్యత క్రమములో గుర్తు పెట్టండి. ఉదాహరణకు 4వ సూచన మీకు ఎంతో ముఖ్యమైనదిగా తోస్తే, 4వ సూచన ఎదురుగావున్నగదిలో "1" అంకె వేయండి. 2వ సూచన తరువాత వచ్చే ప్రధానమైన సూచన అనుకొంటే, 2వ సూచన ఎదురుగావున్న గదిలో "2" అంకె వేయండి. అలాగే పూర్తిచేస్తూ వెళ్లండి.

2) మీరు నింపిన ఎంట్రీ కూపన్ను, ఒక గ్రైమిక్స్ అట్టపెట్టె మూతతో "గ్రైమిక్స్ కంటెస్ట్", పో. బా. బాక్స్ నెం. 680, బొంబాయి-1 ఎడ్రసుకు, మే 31, 1962 తేదీలోగా పంపండి.

3) ఎంట్రీ రుసుము లేదు. మీ ఇష్టమువచ్చినన్ని ఎంట్రీలు పంపవచ్చును. అయితే ప్రతి ఎంట్రీతో ఒక గ్రైమిక్స్ అట్టపెట్టె మూతను జతచేసి పంపాలి.

4) ఏ పోటీదారునికైనా ఒకటికంటె ఎక్కువ బహుమతులు ప్రదానం చేయబడవు.

5) ఈ పోటీలో భారతదేశములో నివసిస్తున్న వారే పాల్గొనాలి. బూట్స్ ప్యూర్ డ్రగ్ కంపెని (ఇ) ప్రై. లిమిటెడ్ మరియు ది నేషనల్ ఎడ్వర్టయిజింగ్ సర్వీసెస్ ప్రై. లి. కంపెనీల ఉద్యోగులు మరియు వారి కుటుంబీకులు ఈ పోటీలో పాల్గొనకూడదు.

6) జడ్జీల నిర్ణయమే తుది నిర్ణయము; ఏ పరిస్థితిలోనూ ఉత్తర ప్రత్యుత్తరములు జరుపబడవు.

7) మొదటి మూడు బహుమతులు గెలిచిన వారిపేర్లు ప్రధాన దిన పత్రికలలో ప్రకటించబడతాయి. ఇతర బహుమతులు గెలుపొందినవారికి ఉత్తరాలు పంపబడతాయి.

**ముగింపు తేదీ: మే 31, 1962**

1వ బహుమానము
రు. 3,500

2వ బహుమానము
రు. 1,000

3వ బహుమానము
రు. 500

మరియు
30 బహుమానములు
బహుమానము
ఒక్కొక్కింటికి రు. 100

ప్రతి ఎంట్రీతో గ్రైమిక్స్ అట్టపెట్టె మూతను తప్పకుండా పంపాలి

Boots బూట్స్ కంపెనీవారి శ్రేష్ఠమైన ఉత్పత్తి గ్రైమిక్స్

Grymix

ఎంట్రీ కూపను

"గ్రైమిక్స్ కంటెస్ట్"
పోస్ట్ బాక్స్ నెం. 680, బొంబాయి-1.

బిడ్డ ఆరోగ్యంగానూ ఆనందంగానూ ఉండాలంటే...

1. తగినంత గాలీ వెలుతురూ కావాలి.
2. క్రమబద్ధంగా గ్రైమిక్స్ పట్టాలి.
3. ఆహారంలో కావలసినన్ని పాలు వుండాలి.
4. బాలామంది పిల్లల మధ్య పెంచాలి.
5. తల్లిదండ్రులు ప్రేమ వాత్సల్యాలు చూపాలి.
6. క్రమం తప్పకుండా స్నానం చేయించాలి

| నేను నిశ్చయించిన ప్రాధాన్యత క్రమము | | |
|---|---|---|
| | | |
| | | |
| | | |
| | | |
| | | |
| | | |

పేరు మరియు చిరునామా (అక్షరములు విడివిడిగా వ్రాయాలి) ____________

____________

____________

పోటీయొక్క నియమములను నిబంధనలను సమ్మతిస్తున్నాను. జడ్జీల తీర్పు తుదిదియనియు దానిని తప్పక సరిగా వర్తించేదని పూర్తిగా తెలుసుకొని ఈ పోటీలో నేను పాల్గొంటున్నాను.

____________ సంతకము

NATIONAL BG 11762

# తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!


## కిలోలలో కొనండి

1962 ఏప్రిల్ 1వ తేదీనుండి మెట్రిక్ తూనికలను విధిగా ఉపయోగించాలి.

పాత తూనికలను ఉపయోగించడం చట్ట విరుద్ధముగా పరిగణింపబడుతుంది.

ధరల మారకపు పట్టీ (సేరునుండి కిలోగ్రాముకు)

సేరు ధర నయాపైసల నుండి కిలోగ్రాము ధర నయాపైసలలో

| న.పై. సేరుకి | న.పై. కిలోకి | న.పై. సేరుకి | న.పై. కిలోకి | న.పై. సేరుకి | న.పై. కిలోకి | న.పై. సేరుకి | న.పై. కిలోకి | న.పై. సేరుకి | న.పై. కిలోకి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 1 | 21 | 23 | 41 | 44 | 61 | 65 | 81 | 87 |
| 2 | 2 | 22 | 24 | 42 | 45 | 62 | 66 | 82 | 88 |
| 3 | 3 | 23 | 25 | 43 | 46 | 63 | 68 | 83 | 89 |
| 4 | 4 | 24 | 26 | 44 | 47 | 64 | 69 | 84 | 90 |
| 5 | 5 | 25 | 27 | 45 | 48 | 65 | 70 | 85 | 91 |
| 6 | 6 | 26 | 28 | 46 | 49 | 66 | 71 | 86 | 92 |
| 7 | 8 | 27 | 29 | 47 | 50 | 67 | 72 | 87 | 93 |
| 8 | 9 | 28 | 30 | 48 | 51 | 68 | 73 | 88 | 94 |
| 9 | 10 | 29 | 31 | 49 | 53 | 69 | 74 | 89 | 95 |
| 10 | 11 | 30 | 32 | 50 | 54 | 70 | 75 | 90 | 96 |
| 11 | 12 | 31 | 33 | 51 | 55 | 71 | 76 | 91 | 98 |
| 12 | 13 | 32 | 34 | 52 | 56 | 72 | 77 | 92 | 99 |
| 13 | 14 | 33 | 35 | 53 | 57 | 73 | 78 | 93 | 100 |
| 14 | 15 | 34 | 36 | 54 | 58 | 74 | 79 | 94 | 101 |
| 15 | 16 | 35 | 38 | 55 | 59 | 75 | 80 | 95 | 102 |
| 16 | 17 | 36 | 39 | 56 | 60 | 76 | 81 | 96 | 103 |
| 17 | 18 | 37 | 40 | 57 | 61 | 77 | 83 | 97 | 104 |
| 18 | 19 | 38 | 41 | 58 | 62 | 78 | 84 | 98 | 105 |
| 19 | 20 | 39 | 42 | 59 | 63 | 79 | 85 | 99 | 106 |
| 20 | 21 | 40 | 43 | 60 | 64 | 80 | 86 | 100 | 107 |

సేరు ధర రూపాయల నుండి కిలోగ్రాము ధర రూపాయలలో

| రూ. సేరుకి | రూ. కిలోకి | రూ. సేరుకి | రూ. కిలోకి | రూ. సేరుకి | రూ. కిలోకి | రూ. సేరుకి | రూ. కిలోకి | రూ. సేరుకి | రూ. కిలోకి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 1·07 | 11 | 11·79 | 21 | 22·51 | 31 | 33·22 | 41 | 43·94 |
| 2 | 2·14 | 12 | 12 86 | 22 | 23 58 | 32 | 34·29 | 42 | 45 01 |
| 3 | 3·22 | 13 | 13·93 | 23 | 24·65 | 33 | 35·37 | 43 | 46 08 |
| 4 | 4·29 | 14 | 15·00 | 24 | 25 72 | 34 | 36 44 | 44 | 47·15 |
| 5 | 5·36 | 15 | 16 08 | 25 | 26 79 | 35 | 37·51 | 45 | 48·23 |
| 6 | 6 43 | 16 | 17·15 | 26 | 27·86 | 36 | 38·58 | 46 | 49·30 |
| 7 | 7·50 | 17 | 18 22 | 27 | 28 94 | 37 | 39 65 | 47 | 50 37 |
| 8 | 8·57 | 18 | 19·29 | 28 | 30 01 | 38 | 40·72 | 48 | 51 44 |
| 9 | 9·65 | 19 | 20·36 | 29 | 31·08 | 39 | 41·80 | 49 | 52 51 |
| 10 | 10·72 | 20 | 21 43 | 30 | 32·15 | 40 | 42·87 | 50 | 53 58 |

**1 కిలోగ్రాం (1000 గ్రాములు) = 86 తులాలు**

భారత ప్రభుత్వము చేత జారీచేయబడినది. DA 61/801

# ఉత్తరాలు

## స రా గ మా ల

శ్రీ వి. ఎ. కె. రంగారావు వ్రాసిన "సరగమాల" చదువుతుంటే ఆయా సినిమాలలో డ్యాన్సులు కన్నులకు కట్టినట్లు ఉన్నది. ముఖ్యముగా "పిలిచిన బిగువటరా", "ఏమెంత నెరజాణవేరా" అను వాక్యములు చదువుతుంటే ఆ నాట్యములు కన్నులకు కట్టి అలాగే 10, 15 నిముషములు మూన్పడి ఉంటిని.

ఎం. వి. ఎస్. ప్రకాశరావు (ఆళ్లగడ్డ)

* * *

13—4—62 తేది పత్రికలో రంగారావు గారు 'రికార్డులలో కొన్ని తప్పులు' ఎంచి వ్రాశారు. అటువంటిదే ఇది ఒకటి. 'బాప్‌రేబాప్' హిందీ చిత్రంలో కిషోర్‌కుమార్, చాంద్ ఉస్మానీ కలసి టాంగా ఎక్కి ఒక పాట పాడతారు. ఆ పాటపేరు 'పియా పియా పియా మేరీ' .... ఈ పాటలో చాంద్ ఉస్మానీ (స్నేహితురాలి ఆశా భాన్స్లే అనుకుంటా) పొరబాటుగా, కిషోర్ కుమార్, తన చరణం పూర్తిచేయకుండానే, 'ఆ' అని ఆలాపన ప్రారంభిస్తుంది. కాని కిషోర్ కుమార్ 'ఆపమన్నట్లు' చేతితో సైగచేసి తన చరణం పూర్తిచేస్తాడు. ఆ సమయంలో కిషోర్ కుమార్ ఆ తప్పును అతి సహజంగా సరి దిద్దాడు. అసలు వినేవారికి అది తప్పులాగా ఉండనే ఉండదు.

పులవర్తి సోమ నాగేశ్వరరావు (కాకినాడ)

**పాఠకుడు శ్రీ సోమ నాగేశ్వరరావు గారనుకున్నట్లు అది పొరబాటు కాదు కావలసి చేసినది.**

* * *

"రికార్డు తప్పులు—పొరపాట్లు"లో ఇది కూడా ఒకటి.

"భార్యాభర్తలు"లో "జోరుగా హుషారుగా" అనే మొదటిపాటయందు సినిమాలో మ్యూజిక్ వేరు, రికార్డులో మ్యూజిక్ వేరు.

జి. ఎస్. ఎల్. ఎస్. రావ్ (ధవళేశ్వరం)

* * *

13—4—1962 సంచికలో రికార్డులలోని పొరపాట్లు తెలియచేయుమని కోరినారు. నాకు తెలిసిన పొరపాటు ఒకటి తెలియచేయుచున్నాను.

టాక్సీరాముడు అను తెలుగు చిత్రములో (రచన: కొసరాజు, పాడినవారు — పిఠాపురం. నాగేశ్వరరావు, జానకిగార్లు) "ఏంపిల్లో ఎల్దేవు జాగర్త, కంటె జాగర్త, నాను జాగర్త, నగలు జాగర్త, ఆ నగలు జాగర్త" అనే పాట ఉంది. మున్నది. కాని బయట మనము విను రికార్డులలో రెండూ జాగర్త, ఆరెండూ జాగర్త అనునట్లుగా ఉంటుంది. చిత్రములోలేని ఈ ముక్కలు రికార్డులో చేరినవి.

పాలెపు భిక్షాలు (చీరాల)

## బా ల సా హి తి

మరి, మీలు మా బాలసాహితి పూర్తిగా బందు చేసేసారేమి ? అలాగైతే మరి మీ జట్టుండను లెండి. మా నాన్నగారు తెచ్చిన బిచకత్తులు పంచదార బిళ్లలు మీకియ్యనులెండి.

సంచాలి వెంకట ఈశ్వరప్రసాద్ (భిలై)

**'హయవాతా' అద్భుతగాథ చదివు!**

* * *

## కా ర్టూ న్

కె. జవహరుగారు హిందీ పరీక్షలు (దక్షిణ భారత హిందీ ప్రచారసభ), ఆదివారంనాడే జరుగునని గుర్తించవలెనన్నారు. అది నిజమే. కాని, ఆ హిందీ పరీక్షలు, ఫిబ్రవరి, ఆగస్టు నెలలలో జరుగునని ఏప్రిల్ నెలలో జరుగవని గుర్తించవలెను.

మంచుకొండ చినసీతారామస్వామి (విజయనగరం)

* * *

## సీరియల్ కథ

రచయిత పిరాజీగారు విడీ విడని చిక్కులు కథ వ్రాస్తూ "శిరస్త్రానం వాలకం" అన్నారు. చాలా శోచనీయమైన విషయం. భారతదేశ రాజ్యాంగ చట్టము, మత స్వాతంత్ర్యము కూడ ప్రజలకు కల్గించి ఉన్నదని వారికి తెలీదు కాబోలు !

విజయ (వుయ్యూరు)

* * *

"విడీవిడని చిక్కులు" అనే సీరియల్ నవల ప్రారంభంలోనే పాఠకుల మనస్సుల నాకట్టుకొని రసవత్తరంగా సాగిపోయింది. రచయిత "పిరాజీ" గారికి నా హృదయపూర్వకాభినందనలు.

కొండపి మల్యాద్రి లక్ష్మీనరసింహమూర్తి (సింగరాయకొండ)

## స ం దే హ ం

ఓ చిన్న సందేహం. మీ వ్యంగ్య చిత్రకారుడు "శ్రీ ఊమెన్" గారి పూర్తిపేరు తెలిపిస్తారా.

బి. వి. ఆర్. జోగారావ్ (బొబ్బిలి)

వి. జి. ఊమెన్

## క థ లు

'వచ్చిన భాగం' ఉత్తరార్థంలో రేఖ, మోహన్‌లు ఎం. బి. బి. ఎస్. చేసినట్లు రచయిత వ్రాశారు. అదీ తిరుపతిలో ! వాతావరణరీత్యా కథ ఈ తప్పు వల్ల కాస్త దెబ్బతింటుంది.

పి. వెంకటసుబ్బయ్య (పుదిపట్ల)

* * *

అన్ని కథలూ, ఎప్పుడూ ఒక్కటే. ప్రేమించటం స్నేహితుని సలహాలు వగైరా .... వగైరా !

"లిల్లీ — మల్లీ" కథలో మాతృత్వం లేకపోగా సొంత గొప్పకోసం రాసినట్లుంది. లేకపోతే తెనుగు కథలో జర్మన్ ఏమిటి ? మెర్క్యూరీ రెసానెన్స్ లైన్ (2537 ఆంగ్ స్ట్రామ్) ఇవన్నీ ఎవరిక్కావాలి ?

చంద్రశ్రీ (మద్రాసు)

* * *

"లిల్లీ—మల్లీ" బాగానే ఉంది. కాని ప్రతి విషయానికి 'సైంటిఫిక్ టరమ్స్' వాడకుండా వుంటే కథ ఇంకా రసవంతంగా ఉండేదేమో ?

మానేపల్లి శత్రుఘ్న (హైదరాబాదు)

* * *

లిల్లీ—మల్లీ రాసిన రావుగారు సంతులా ? లేకపోతే డి. పి. ఐ. ఆఫీసు యమకూపం అని ఎట్లా తెలిసింది ?

నాగేశ్వర్ (హైదరాబాదు) ★

---

**'కాబోయే కథకులకు పనికొచ్చే చిట్కాలు'**

పై 'పుస్తకం' కోసం కొన్ని వేలమంది వ్రాశారు. ఇంతమంది వ్రాస్తారని మేము ఎదురుచూడలేదు! వీలైనంత త్వరలో వీటిని కోరినవారందరికీ పంపే ఏర్పాట్లు చేస్తున్నాము. కాబోయే కథకులందరూ ఇది గమనించ ప్రార్థన.

—సంపాదకుడు.

---

# మెక్లీన్స్

## పళ్లను అతితెల్లగాజేయును అని ఋజువు చూచుకోండి

**1 దానిని తడమండి:**

బిగటగా అంటుచున్న పొర తగులు చున్నదా? సహజ తెలుపును అది దాచివేయుచున్నది. ఇప్పుడు బ్రష్‌తో తోమండి. మెక్లీన్స్ ఆపొరను ఎట్లు పూర్తిగా తొలిగించి వేయుచున్నదో చూడండి.



**2 దానిని రుచి చూడండి:**

మీరు సరిగ్గా చవిచూచునట్టి జలదరించే పరిశుభ్రత గల రుచి, మెక్లీన్స్‌లో వున్న మూడు చురుకైన పదార్థములు పని చేయుచున్న పనుటకు నిదర్శనం ... మీ పళ్లను భద్ర పరచుచున్నవి, కాపాడుచున్నవి, తెల్లగా జేయుచున్నవి.





**3 దానిని చూడండి:**

మీ చిరునవ్వుం తెలుపును చూచుటలో మీ కళ్లే మిరిమిట్లు గొలుపును! మెక్లీన్స్ టూత్‌పేస్టు మీ పళ్లను ఇంతకు ముందుకంటె ఎక్కువ అతి తెల్లగా జేయును. దీనిని మీరే ఋజువు చూచుకోండి!




తెల్లదైనా లేక క్లోరోఫిల్‌తో గూడినదైనా నేడే మెక్లీన్స్‌ను వాడనారంభించండి, ఇప్పుడు ధారాళంగా లభించుచున్నది

MTP 1/P/4/61-TEL

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

## విషయానుక్రమణిక

శుక్రవారం : *11-5-62*
శుభ॥ సం॥ వైశాఖమా॥ శు॥ అష్టమి

సంపుటము : 54 సంచిక : 36

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీథి, మద్రాసు-1

★




ముఖచిత్రం :
శ్రీ వి. వి. సత్యమూర్తి

## లోకంపోకడ



"ఇంత మంది మంత్రులు రావటం కాదుగాని, ఈ కాస్త జాగాలో ఇరుక్కుని కూర్చోలేక చస్తున్నాం?"



భారత–జపాన్ దేశాలమధ్య ఇటీవల రెండు ఒప్పందాలు కుదిరాయి. వీటిననుసరించి జపాన్ నిపుణుల సహకారంతో మనదేశంలో నాలుగు వ్యవసాయప్రదర్శన క్షేత్రాలు, ఒక మత్స్యపారిశ్రామిక శిక్షణకేంద్రం ఏర్పాటవుతాయి.

# పదవుల వేటలో మానవత్వానికి తిలోదకాలు : కాంగ్రెస్ అభ్యర్థికి ఢిల్లీ ముస్లిం ఓటర్ల గుణపాఠం

## శ్రీకృష్ణ

ఈవారం ఆర్థికమంత్రి ప్రతిపాదించిన అధిక పన్నులు మిగతా విషయాలను మరుగుపరచినా, ప్రధానమంత్రి పూర్తిగా కోలుకోవటంతో సర్వత్రా ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. చాలాకాలంగా ఆయనకు అవసరమైన విశ్రాంతి వచ్చేవారం లభిస్తున్నది.

పదవులకోసం ప్రాకులాడేవారు మంత్రులకు జబ్బుచేసినప్పుడు ఏవిధంగా వ్యవహరించేది ఈ వారంలో నిరూపితమైంది. శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి గారు ప్రమాదానికి గురియైన సంగతి తెలిసిందే. ఆయనకు చికిత్స జరుగుతున్నది. కోలుకుంటున్నారు కూడాను. ఈలోగా మంత్రిపదవిని ఆశిస్తున్న ఒక అభ్యర్థి ఏదోవిధంగా దాన్ని సాధించుకోవాలనే భావంతో లక్నోలో ఉన్న తన బంధువుకు టెలిఫోన్‌చేసి రప్పించాడు. ఆ బంధువు శస్త్రవైద్యుడు. మర్నాడు ఇద్దరూ కలిసి శ్రీ లాల్‌బహదూర్‌ను చూడటానికి వెళ్లారు. శస్త్రవైద్యుడు శ్రీ లాల్‌బహదూర్‌ను పరీక్షించడానికి అనుమతి కోరాడు. కాని అంతకుముందునుంచీ పొందుతున్న చికిత్స సంతృప్తికరంగా ఉండటంచేత, మరొకరు పరీక్షించవలసిన అవసరం దేశీయ వ్యవహారాలమంత్రికి కనిపించలేదు. అయినా ఏదోవిధంగా ఆయన్ను ఒప్పించారు. లక్నో శస్త్రవైద్యుడు ఎక్స్–రే ఫొటోగ్రాఫ్‌ను పరీక్షించి శ్రీ లాల్‌బహదూర్‌కు 'ప్లాస్టర్' కట్టు కట్టాలన్నాడు. భారతదేశానికి, శ్రీ లాల్‌బహదూర్‌కు రోజులు బావుండి, ఆ సమయంలో ఢిల్లీలో ప్రముఖ విదేశీ శస్త్రవైద్యుడు ఒకరు ఉన్నారు. ఈయన కూడా మంత్రిని పరీక్షించారు. శ్రీ లాల్‌బహదూర్‌ను వికలాంగుణ్ణి చేయటానికి అంతా ఉబలాట పడుతున్నారని విదేశీ నిపుణుడు లక్నో శస్త్రవైద్యుడికి స్పష్టంచేశాడు. మొహం వెల్లక లక్నో పెద్దమనిషి వచ్చిన త్రోవను వెళ్లిపోయాడు. ఈయన్ను వెంటబెట్టుకొచ్చిన అభ్యర్థి సహాయ మంత్రిగా నియుక్తుడు కావటంతో శ్రీ శాస్త్రి ఆరోగ్యం సంగతి మరి పట్టించుకోలేదు. అదృష్టవశాత్తు శ్రీ శాస్త్రి త్వరలోనే కోలుకున్నారు.

* * *

నేపాల్ మహారాజా మనదేశానికి వచ్చి వెళ్లినప్పటికీ ఉభయదేశాలమధ్య సంబంధాలు అంతగా అభివృద్ధి చెందలేదు. మహారాజా ఇంగ్లీషు బాగానే మాట్లాడగలిగినా, ఢిల్లీనుంచి బయలుదేరి వెళ్లేముందు ఏర్పాటైన పత్రికా విలేఖరుల సమావేశంలో నేపాలీ భాషలోనే మాట్లాడారు. ఆయన రెండు అంశాలను పునరుద్ఘాటించారు. నేపాల్‌లో జరుగుతున్న గొడవలకు భారత నేపాల్ సంబంధాలు దెబ్బతినిపోవడానికి కారణం స్వదేశం విడిచి వచ్చిన నేపాలీల అండే అనే వని ఆయన ఆరోపించారు. మహారాజా ఉద్ఘాటించిన మరొక అంశం నేపాల్ సార్వభౌమాధికారం. ఉదాహరణకు ఖట్మాండు — పెకింగ్‌ల మధ్య రోడ్డు నిర్మించుకోవడం కేవలం నేపాల్ అంతరంగిక వ్యవహార మన్నారు. నేపాల్ ఆర్థిక అభ్యుదయం కోసమే దీన్ని నిర్మిస్తున్నారని, సైనిక వ్యూహాలతో దీనికి సంబంధం లేదని చెప్పారు.

నేపాల్‌లో ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించే విషయం ప్రస్తావించగా తమ దేశప్రజలకు ఎలాంటి ప్రభుత్వ వ్యవస్థ మంచిదో తమకు తెలుసునన్నారు.

* * *

కొందరు పార్లమెంటు సభ్యులు శ్రద్ధగా పని చేస్తారు. చాలామందికి పార్లమెంటు సభ్యత్వమంటే మంత్రిపదవిని సంపాదించడానికి కాకపోయినా, విదేశీ పర్యటనలకు అవకాశం కల్పించే సాధనమంటిది. పార్లమెంటుసభ్యుడు కానీ ఖర్చులేకుండా దేశంలో ఈ మూలనుంచి ఆ మూలకు మొదటితరగతిలో తిరిగి రావచ్చు.

అయితే మహారాణి గాయత్రీదేవిమాత్రం ఈ జాబితాలో చేరరు. పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ, ఆమె ఇలా అన్నారు: "ఇక్కడకు వచ్చిన వారిలో తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నవా రెవరైనా

—62వ పేజీ చూడండి

# పి. ఎస్. పి. స్వరూపం

మొదటితడవా సార్వత్రిక ఎన్నికల తరువాత

రెండవతడవా ఎన్నికల తరువాత

మూడవతడవా ఎన్నికల తరువాత

నాలుగవ తడవా ఎన్నికల తరువాత








ఖాట్మండూకు తిరిగి వెళ్లిన నేపాల్‌రాజు మహేంద్రను ఢిల్లీ గమనిస్తోంది.



# అందుకోలేని ఆతిథ్యం

రైలొచ్చి ఆ చిన్న స్టేషన్‌లో ఆగింది. అయిదు నిమిషాలకు తిరిగి బయల్దేరింది. తలమీది టోపీ సరిచేసుకుంటూ బయల్దేరుతున్న రైల్లోకి ఎక్కాడు టి. సి. అదే క్షణంలో, ఆ పెట్టెలోనుంచే బయటికి దూకా డొక యువకుడు.

కొందరు టిక్కెట్లిచ్చి బయటకు పోతున్నారు. మరికొందరు సామాన్లు లెక్కించుకుంటున్నారు. హఠాత్తుగా రైల్లోనుంచి దూకిన వ్యక్తి లాగూ జేబుల్లో చేతులు పెట్టుకుని, ప్లాట్‌ఫారం ఒక చివరినుంచి మరొక చివరికి రెండుసార్లు పచార్లు చేసి, ఒకచోట టక్కున ఆగాడు. అక్కడ రైల్వే వారు స్టేషన్ కాంపౌండుకని వేసిన కటకటాలలో రెండు చువ్వలు లేక మనిషి పట్టేటంత మార్గమేర్పడిఉంది. అతను అక్కడ నిలబడి చుట్టూ చూచి తన నెవరూ గమనించటంలేదని నిర్ధారణ చేసుకుని ఆమార్గంగుండా బయటకు నడిచాడు.

"ఒరే సుబ్బన్నా! పోయి బండికట్టు. ఒరే, వెంకటేసు! సామాన్లు జాగ్రత్తగా బండిలో కెక్కించు. అమ్మా రాధా! రా, అందరూ బండి దిగినట్టేనా? మొత్తం పదమూడున్నర టిక్కట్లు. ఒరే, వెంకటేసూ! సామాన్లు జాగ్రత్త" అని హెచ్చరించి గేటువైపుకు నడిచారు రంగనాథంగారు. పరాకుగా నిలబడ్డ రాధ అప్రయత్నంగా వారిని అనుసరించింది.

*　　*　　*

పచ్చని తోరణాలతో, పట్టుకుచ్చులు జీరాడే వివాహవేదికతో, ముత్యాలు పేర్చినట్టున్న ముగ్గులతో, ముసిముసినవ్వులు ముఖాన చిందులాడే ముదితలతో ఆనందం వెల్లివిరిసింది ఆ ఇంట్లో. ఆరోజు రాత్రికి సత్యనారాయణ కుమారుడు రాజబాబుకు వివాహం. సత్యనారాయణ వీధిగుమ్మం ముందు రెండెడ్లబండి నిలబడటంచూచి, అక్కడికి నడిచాడు. బండిలో రంగనాథం, వారి కుటుంబం పగైరాలను చూచి, ఆనందంతో, "వారంరోజుల ముందు రమ్మంటే ఇప్పుడా రావటం" అన్నాడు.

"ఏం చెయ్యన్రా! మీ వదినగారు నన్ను కదల్నిస్తేనా?"

"మరే పాపం, అందుకే గావాల్ను వారంరోజుల్నించీ పోరుతుంటే ఈ రోజా బయల్దేరారుకదూ?" అంది రంగనాథంగారి భార్య సావిత్రమ్మ. క్షణకాలం నవ్వులు దొర్లాయి ఆ ప్రాంతమంతా. రంగనాథంగారు, సత్యనారాయణ పెదతండ్రి పినతండ్రి బిడ్డలు.

పెళ్ళియిల్లు రకరకాల మనుష్యులతో, అల్లరి చేసే పిల్లలతో, కమ్మని వాసనలు వెదజల్లుతున్న అత్తరు, పన్నీర్లతో నిండిపోయింది. రండోళ్ళు, సన్నాయి మేళాలు చెవుల్ని చిల్లులుపరుస్తున్నాయి. వాటికి పెళ్ళిపెద్దల హెచ్చరికలతో కూడిన అరుపులు, చిన్నపిల్ల ఏడుపులు మిశ్రమమయ్యాయి.

రాజబాబును, "ఇక్కడకూర్చో" అని ఒకరు, "నువ్విక్కడున్నావా? నీకోసం అక్కడ చూస్తుంటే" అని ఇంకొకరు. "అరె, నువ్వింకా అట్లాగే ఉన్నావేం? అవతల పీటలమీద కూర్చునే వేళౌతుంటే" అని మరొకరు ఖంగారుపెడుతున్నారు.

వసారామెట్లు దిగి, పందిట్లోకి వస్తుండగా ఒక యువకుడు వీధిగుమ్మం దాటివస్తూ, రాజబాబు నుద్దేశించి, "ఏమండీ!" అన్నాడు నెమ్మదిగా. రాజబాబు తలెత్తి అతన్నిచూచి. "నువ్వా....." అంటూ ఆగిపోయాడు. పల్చని శరీరం, లోతుకు పోయినకళ్ళు, మాసిన బట్టలు, అరిగిన చెప్పులూ గల ఆ వ్యక్తి "మురళి" అన్నాడు.

"మురళి......మురళి" ఆ మాటనే అంటూ చుట్టూ చూస్తూ, "మీది......" అన్నాడు.

"విశాఖపట్టణం"

"ఇప్పుడు అక్కణ్ణుంచేనా రావటం?"

అతను తలూపాడు, ఏదో చెప్దామనుకున్నంతలో. వివాహమండపం దగ్గరకు పోతోంది రాధ. రాజబాబు పిల్చాడు. రాధ వచ్చింది. "ఇతను మురళి, విశాఖపట్టణం, ఇప్పుడే రైలుదిగి వస్తున్నట్టున్నాడు. కాసేపు ఈ మురళిని వాయి(గి)స్తూఉండు ఇప్పుడే వస్తా" అని నవ్వుతూ తప్పుకున్నాడు.

రాధ క్షణం అతన్ని చూచింది. మరుక్షణంలో ఆమె కనుబొమ్మలు ముడిపడ్డాయి. "ఉండండి! ఇప్పుడే వస్తా" అని వెళ్ళిపోయింది.

తిరిగి వచ్చేసరికి మురళి కొత్తగా చుట్టూ చూస్తున్నాడు. "పదండి!" అందిరాధ ముందు నడుస్తూ, మురళి ఆమె వెనుకగా నడిచాడు.

వెళ్ళి సామాన్లకని కేటాయించిన చిన్న 'స్టోర్' రూంలో కుంటికుర్చీలో కూర్చుని దీర్ఘంగా కళ్ళు మూసుకు ఆలోచిస్తున్నాడు మురళి. "మీరు విశాఖపట్టణంనుంచీ యిదేనా రావటం?" టిఫిన్ ప్లేటు బల్లమీద పెడూ, ప్రశ్నించింది రాధ.

మురళి ఒక్క ఉదుటున కళ్ళు తెర్చి, "జా..... వం......డీ!" అన్నాడు తడబడుతూ.

"రాజబాబు మీకు...."

"స్నేహితుడు."

"మీకు నెల్లూరు తెల్సా?"

ఆ ప్రశ్నతో మురళి ఉలిక్కిపడ్డాడు. తలెత్తి ఆమెను చూచాడు, అతనినే గుచ్చిచూస్తోంది. ఖంగారుగా "ఒక గ్లాసు మంచినీళ్ళిస్తారా? అన్నాడు. "అతని ముఖాన చిరుచెమట్లు పోశాయి. గ్లాసులో నీళ్ళు తెచ్చిస్తూ, "నా ప్రశ్నకు జవాబు చెప్పారు కాదు" అంది. కొద్దిగా తేరుకుని, "ఎప్పుడో నా చిన్నవాడు నెల్లూరు వెళ్ళినట్టు గుర్తు" అని ముఖం మరోవేపుకు తిప్పుకున్నాడు. "స్నానం చేదురుగాని లెండి!" అని వెళ్ళిపోయింది రాధ.

మరో పావుగంటకు తిరిగివస్తే అతను అక్కడే నిలబడున్నాడు. రాధ ప్రశ్నార్థకంగా చూచింది. "బట్టలు......" అంటూ గొణిగాడతను. రెండు తువ్వాళ్ళు తీసిచ్చింది. అతను స్నానానికి కదిలాడు.

స్నానంచేసి వచ్చేసరికి అతని బట్టలు పెట్టిన స్థానంలో అవి లేవుకానీ, ఒక గ్లాస్కోపంచ, లాల్చీ కనిపించాయి. అతను చుట్టూ కలయచూచాడు. "అవి వాటిని ఆశ్రయించుకున్న మురికిని వదిలించుకుంటానికి వెళ్ళాయి. ప్రస్తుతానికి ఆ పంచ, లాల్చీ కట్టుకోండి" అంది గుమ్మంప్రక్కగా నిలబడి రాధ. మురళి మౌనంగా వాటిని ధరించి పెళ్ళిపందిట్లో ఒకమూలగా వెళ్ళి నిలబడ్డాడు.

దీపాలు వెలిగించారు. మురళికి కొద్దిదూరంలో నిలబడ్డ రంగనాథంగారు ప్రక్కవాళ్ళతో, "అతనే నండీ! మా రాజబాబు స్నేహితుడు. పేరు మురళి, విశాఖపట్టణం" అని చెప్పుకుపోతున్నారు. మురళి ఉలిక్కిపడ్డాడు. "ఆయ నెవరు? తననిగురించి ఆయనకు అంత బాగా ఎట్లా తెల్సింది? తను వచ్చిన రెండుగంటల్లో పరిచయమైంది యిద్దరే. కనీసం ఆయన్ని చూచినట్లుగూడా లేదే?" అనుకుంటూ ఓరకంట వారిని చూడసాగాడు.

వసారాలో నిలబడి, పందిట్లో మూలగా నిలబడి తండ్రివంక ఓరకంట చూస్తున్న మురళిని పరీక్షగా చూస్తోంది రాధ. ఆసమయంలో అనేకమైన ప్రశ్నలు ఆమెలో తలెత్తాయి. రాజబాబు లోపలికి పోతూ రాధనిచూచి, "నువ్విక్కడున్నావా? తొందరగా బీరువాలోని ఒక కొత్త పంచ, ఉత్తరీయం తియ్, కట్టుకోవాలి" అన్నాడు.

పంచకట్టుకుని, ఉత్తరీయం భుజాన వేసుకున్నాడు. రాధ తిలకం తెచ్చి, కల్యాణంబొట్టు దిద్దుతూ, "అన్నయ్యా! ఆయ నెవరు?" అని అడిగింది. "ఎవరాయన?" అంటూ, "ఓ..... ఆయనా! ఇందాక నేను పరిచయం చేసినాయనేనా?" అన్నాడు. "ఊ" అంది రాధ. "ఏమో నాకు తెలియదు" అంటూ ఉత్తరీయం మెడచుట్టూ తిప్పుకోసాగాడు. రాధ ఆశ్చర్యంతో, "ఆయన నీ స్నేహితుడుకాదా?" అంది.

"అట్లాగని ఆయన చెప్పాడా?"

"కాదు. నేనే అడుగుతున్నా."

"నిజంగారాధా! అతనెవరో నాకు తెలియదు. మనిషి చూస్తే, గౌరవ మర్యాద లివ్వతగ్గవాడుగా కనిపించాడు. అలాంటివాణ్ణి నువ్వెవరు? అని ఎలా అడిగేది. ఏం తోచక నీ కప్పగించాను. అతను మన



పొద్దైనా, కాకపోయినా మనింటికొచ్చాడు కాబట్టి అతనికి ఆతిథ్యమివ్వటం మన ధర్మం'' అన్నాడు.

''అలాగని అర్హతలేనివారికి ఆతిథ్యమిస్తామా?''

''పోనీ రాధా! ఒక్కరోజు మనం అతని కాతిథ్య మిచ్చినందువల్ల అతను ఆకాశాని కంటేదీలేదు, మనం అధోగతికి పోయేదీలేదు. ఈ శుభసమ యంలో రాద్ధాంతం చెయ్యకు. అందరితోపాటు అతనికీ అన్నీ సమకూరేట్లు చూడు.''

''అతనూ మన మంచితనం గుర్తించాలిగా....'' అని ఏదో చెప్తుండగానే, ఎవరో రాజబాబును పిల్చారు. అతను వెళ్ళిపోయాడు. రాధ ఆలోచిస్తూ నిల బడింది.

రాత్రి తొమ్మిదిగంటలకు రాజబాబు వివాహం ఘనంగా జరుగుతోంది. మురళి యథాస్థానంలో నిలబడి పెళ్ళి చూస్తున్నాడు. రంగనాథంగారు ఉండుండి మురళినిచూస్తూ, చిరునవ్వు నవ్వు తున్నారు. ఆయన ఒక్కొక్క నవ్వు మురళికి కత్తిపోటులాగా తగుల్తోంది.

''ఏమండోయ్! నెల్లూరునుం చెప్పుడు రావటం?'' అంటూ ఒక వ్యక్తి రంగనాథంగార్ని ప్రశ్నించాడు.

''ఇవాళేనండి! మధ్యాహ్నం వచ్చాం.''

''అమ్మాయీ, వదినగారూ కులాసా?''

''మీ వదిన వంటింట్లో పెత్తనం చేస్తోంది. అమ్మాయి అదిగో'' అంటూ పందిరి స్తంభాన్ని ఆనుకు నిలబడ్డ రాధను చూపించారు. మురళి అటుతిరిగి చూచి, అదిరిపోయాడు. అతని శరీరంలో రక్తం గడ్డకట్టుకుపోసాగింది. వెళ్ళిపోదామని చుట్టూ చూచాడు. కానీ చాలామందికళ్ళు అతనిమీదే కేంద్రీక రించబడున్నాయి.

''మాంగల్యధారణ ముహూర్తే, సుముహూర్తే'' అని పురోహితుడు మంత్రం ఉచ్చరిస్తుండగా, మేళాలన్నీ ఒక్కపెట్టున మోగాయి. చేతుల్లో అక్షింతల్ని వధూవరులమీదకు విసిరి ఆశీర్వదించారు పెద్దలు. మురళి కూడా విసిరి, రాధవంక చూచాడు.

''అయితే మీది విశాఖపట్నమా అబ్బాయ్!'' అన్నారు అతని ప్రక్కగావచ్చి నిలబడ్డ రంగనాథం గారు.

''ఔ......నండి!''

''పెళ్ళయిందా?''

''లేదు.''

''అమ్మా, నాన్నా?''

ఎవరో వచ్చి రంగనాథంగార్ని పిల్చారు. ఆయన చిరాకుగా కదిలి వెళ్ళారు.

రాత్రి భోజనాలు పూర్తయ్యాయి. ''ఫ్లోర్'' రూంలో అతనికి పక్క అమర్చింది రాధ. పక్కమీద కూర్చున్నాడు మురళి. రాధ చెంబుతో మంచినీళ్ళు తెచ్చి, బల్లమీదపెట్టి వెనుతిరిగింది.

''రాధాదేవిగారూ!'' పిల్చా డతను. ఆమె నిల బడింది.

''ఇలా ఒకసారి వస్తారా? మీతో ఒక విషయం చెప్పాలి.''

రాధ తలవంచుకుని రెండడుగులువేసి నిల బడింది.

''చూడండి! ఇందాక నేను చెప్పింది అబద్ధం. రాజబాబు నాకు స్నేహితులుకారు. నిజం చెప్పాలంటే ఆయనెవ్వరో నాకు తెలియనే తెలియదు'' అన్నాడు.

''అవును. మీరు మా రాజన్నయ్యకు ఏమీకారు. మీరు వచ్చిందికూడా విశాఖనుంచీకాదు, నెల్లూరు

—58వ పేజీ చూడండి

"ట్రాజెడీ" — రెండు "కామెడీ"—వి"డీ" అయినా ముక్కోణంమార్కు కథా, లంక రేడియోలో "అప్ కా ఫర్మాయిష్" కొరకు పాటలిా యివి నిత్యం 'కథ' లో (అదే ఉంటే), ఔచిత్యం వైకల్పికం. అపైన ప్రేమా, సంఘం గట్రా కేవలం కల్పితం. ఈ హిట్ సూత్రాలకేంగాని అసలు హీరో లక్షణాలు చూద్దాం. (ధీరోదాత్త ధీర లలిత .... రామరామ ! ఇదేం నాటకాల రోజులా ? సర్కారామా రోజులు .... బేవకూఫ్ జంగ్లీ ఝుమ్రూ మిస్టర్ ఇండియా అన్లాం చెప్లాం (యివి పాడుపు కథలూ, తెనుగు తిట్లూ కావు. హిందీ బయిస్కోపులు.) హీరోలలో ఒకటి "హీరో" యిన్ను బలవంతంగా ప్రేమించు వాడు. రెండు హీరోయినుచాత చివాట్లు (చెప్పు) దెబ్బలు తిని (చూడుడు. "జాతా పోలీస్ కరేగా!" "వైతో తుమ్‌పర్ మరే గా) ప్రేమభిక్షకై "వేడి వేడి" పాటలు పాడిపాడి ఇంటర్‌వెల్ తర్వాతనైనా ఆమె 'దిల్' (యిది హిందీ సినిమా ప్రాణం) లో "ప్యార్" (యిది హిందీ సినీ భాషలో సదా డ్యాను లేదా డ్యూయెట్‌తో వచ్చే సెన్సార్ కళ్ళకప్పే హైలైట్) సంపాయించే రకం. మూడు స్త్రీలను ద్వేషించుతూ "హీరోయిన్" ను దర్శకుని ఆజ్ఞపై ప్రేమించు రకం. (ఇవన్నీ క్లుప్తంగా రకాలు మాత్రమే) హీరోయినే యీ నాయకుని వెంటాడును.

సాధారణంగా హీరోకి ఉద్యోగం నిషిద్ధం. (అందుకు వలసిన తీరిక 12 రీళ్లల్లో ఎలా దొరుకుతుంది ? ఇదేం దక్షిణాదిబొమ్మ కాదు గదా—పోనీ 20 రీళ్లల్లో సర్దుకుందికి) చదువు వీలైతే కొంటాడు లాపోతే ఆనక చూసుకోవచ్చని మానేస్తాడు. అదీ దండగే. (డబ్బుండాలి)

గాబర్డీను ఫ్యాంటు (రాజ్ కపూర్ కాపీరైట్‌ను కాదంటే ఒక కాలు నాలుగుమడతలు పెట్టుకోవచ్చును.) టెరిలీను షర్టు (లేటెస్టు వన్నీ ప్రేక్షకుల కిష్టంగనక రాములవారికి రివాల్వరు ఇవ్వడం కాదు గనక ఎంత లేనివాడికేనా హీరోయిను ఉన్నవాడుగనుక సదరు వేషం ఉండాలి మరి !) ఉంటాయి. (దేవానంద్ పెర్మిషనంటే చొక్కా కాలర్ చెవులు కనిపించకుండా పైకి ఎత్తుకోవచ్చును.) లేదా కిషోర్‌కుమార్ మార్కు కావాలంటే అమెరికను 'జాకట్' పువ్వులు (అవి వళ్లే ఐతే మరీ బాగు) పువ్వులది తొడుక్కోడం మంచిది. (డ్యాన్సంటే ఆసనములు, మొగ్గలు, గెంతులు— ఇవన్నీ అందులో కొన్ని రకములే కదా ?) ఎందుకంటే పాడుతూ హీరోయిన్‌ను హైరానపెడుతూ డ్యానులాంటిదిచెయ్యాలి గనక జాకెట్టే మంచిది.

ఒక్కొసారి హీరోయిను నమ్మకపోతే వెర్రి వేషాలు వేసి (ఆడవేషాలు కూడా వేయొచ్చును.) గడ్డివరకలు గట్రా తిని (చూ :—గర్ల్ ఫ్రెండ్ లేదా బోయ్ ఫ్రెండ్ మొ॥) నిరూపించుకోవాలి. ఆనక ఎప్పుడూ హీరో అనేవాడు తల దువ్వుకోడం, నుదురు అగుపించేలా జుట్టు తీసి తల మీద పెట్టుకోడం చేయకూడదు. సదా సగం మాటులోనే (కోటూ, బూటూ మినహా అన్న మాట) ఉండటం అవసరం. సాధార్ణంగా సిమ్లాలో రిక్షాలు లాగే బలం ఉండాలి లేదా డార్జిలింగ్ రైలుపెట్టెలమీద పరిగెత్తే ధైర్యం (నిజంగా

—55వ పేజీ చూడండి



"సిరిసంపదలు"లో
"చూచి చూచీ కళ్ళు కాయలై కాసేను!"
చక్కని చుక్కని చూడకపోతే
సావిత్రి, నాగేశ్వరరావు.



ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి ఇటీవల హైదరాబాదులో వార్తాపత్రికా సంపాదకుల స్థాయీసంఘ సమావేశానికి ప్రారంభోత్సవం జరిపారు.

# ప్రాజెక్టుల రెండవదశలంతరించే విపద్దశ: ప్రమాదం ఏమీ లేదని నాయకుల భరోసా!

**కౌండిన్య**

గుల్జారీసంఘం క్రితంనెల రెండవవారంలో ఊటీలో సమావేశమై, వివిధ రాష్ట్రాల ఇంజనీర్లతో కృష్ణా – గోదావరి నదిజలాల సమస్య చర్చించిన సందర్భంలో, నాగార్జునసాగర్, తుంగభద్ర ఎగువ కాల్వల రెండో దశలను, ప్రణాళికలో చేరని కొత్త స్కీములుగా పరిగణించ నిశ్చయించుకున్నట్లు, ఆంధ్ర ఇంజనీర్లతో నిష్కర్షగా చెప్పారని వెల్లడి అయింది అది మొదలు గుల్జారీ సంఘం ధోరణి గమనిస్తున్న వారికి ఇదేమీ ఆశ్చర్యం కల్గించదు. మైసూరు మహారాష్ట్రాల కోసం, ఆంధ్ర ప్రాజక్టుల నెల మొత్తం చుట్టించాలనే ఆ సంఘం ఆలోచన, అందులో గోప్యం, గూఢార్థం ఏమీ లేదు అందుకే వచ్చి రావడంతోనే, పక్షపాతానికి పేరు పొందింది. ఏదో ఒక ఉద్దేశ్యాన్ని ముందుగా పెట్టుకుని, దాన్ని సాధించడమే వారి పని గనుక తమకు తోచినదే న్యాయము. ప్రభుత్వ నిరసన, ప్రజల ఆందోళన వారికి పట్టవు.

నాగార్జునసాగర్ ప్రథమ, ద్వితీయ దశలలో చేర్చబడిన ప్రాంతాలన్నిటినీ సాగుచేయడానికి అనుకూలైన సన్నాహాలను తయారుచేసి. ప్రణాళికా సంఘానికి సమర్పించడం, ప్రణాళికాసంఘం, కేంద్ర, జలవిద్యుత్ సంఘం, కేంద్రప్రభుత్వం ఆమోదించడము జరిగాయి. ఈ పథకం క్రింద వినియోగమయ్యే నీటి పరిమాణాన్ని ఆమోదించడం ఖరీదుకు వ్యయమయ్యే ధనంతోకూడా కొంత మంజూరుచేయడం కూడా జరిగింది. ఇంతా అయిన తరువాత నాగార్జునసాగర్ రెండవదశను కొత్త స్కీముగా పరిగణించడంలో అర్థమేమిటి? ఒకసారి ఆమోదింపబడి, ప్రణాళికలలో స్థానం సంపాదించుకున్న స్కీములుగా తప్పించి, కొత్త స్కీముల జాబితాలో చేర్చే అధికారం గుల్జారీసంఘానికి ఎవరు ఇచ్చారు? అసలు నాగార్జునసాగర్ అంతా ఒకే సమగ్రమైన ప్రాజెక్టు అని, దీనికి రెండు దశలనే లేవని, మన ప్రభుత్వం మొదటినుంచీ చెబుతోంది అయితే ఆర్థిక కారణాలవల్ల మాత్రమే ప్రాజెక్టు కార్యక్రమాన్ని రెండుదశలుగా విభాగించామని ప్రణాళికా సంఘ సాంకేతిక సలహామండలి హామీ ఇచ్చింది కాగా, డబ్బు వెసులుబాటుకోసం, పనిసౌలభ్యంకోసం రెండు ఘట్టాలుగా సంకల్పించిన ప్రాజెక్టులో రెండవ ఘట్టానికి సున్నచుట్టాలనడం, చూస్తే గుల్జారీ సంఘం తమ పరిశీలనాంశాలకు మించిపోతున్నట్లు స్పష్టమౌతోంది. అందు కేం చేస్తున్నారు అన్నదే ప్రశ్న.

నాగార్జునసాగర్ ప్రాజెక్టు రెండవదశ అవసరం లేదనడం కేంద్రానికి, ప్రణాళికాసంఘానికికూడా ఇష్టంలేనిసంగతి తెలిసినదే. దీన్ని దేశమంతటికీ అవసరమైన ప్రాజెక్టుగాకాక, కేవలం ఒక్క ఆంధ్రకు లాభించే ప్రాజెక్టుగామాత్రమే పరిగణిస్తున్నారు అందుకే, ధర్మా సంగతి ఎలా ఉన్నా, నాగార్జునసాగర్‌కు ద్వితీయ ప్రాజెక్టుగా స్వీకరించ, నిర్మించవలసి, ఒకసారి కాదు, పదిసార్లు మన రాష్ట్రప్రభుత్వం అర్థించినా కేంద్రం తిరస్కరించింది. గుల్జారీ సంఘాన్ని వేసివేయడంతోనే, నాగార్జునసాగర్ కుడికాల్వను 57వ మైలు వరకే త్రవ్వి ఆపాలని ఆదేశించారు. కేంద్ర ప్లానింగ్ కమిషన్ సభ్యుడు శ్రీ త్రివేది వచ్చి, నాగార్జునసాగర్ ద్వితీయదశలో చేరిన విద్యుదుత్పత్తి స్కీము అనవసరమని, శ్రీశైలం ప్రాజెక్టుతో

53-వ పేజీ చూడండి



# సరిగమలు

**వి ఎ కె రంగారావు**

శ్యాంప్రసాద్ మువినివారి తెలుగు కన్నడ ద్విభాషా చిత్రం "స్వర్ణగౌరి" కోసం కొద్దిరోజుల క్రిందట ఒక అపురూపమైన రికార్డింగ్ జరిగింది. ఇది చిత్రంలో బ్రహ్మసమక్షంలో నారద తుంబురుల సంగీతపరీక్ష సన్నివేశంలో ఉంటుంది. దీనికి రెండు వీణలు మాత్రమే ఉపయోగించారు. సంగీతదర్శకులైన ఎం. వెంకట్రాజుగారు నారదుని పాత్రకు వాయించిన చిట్టిబాబు తుంబురుని పాత్రకు వాయించిన రాఘవన్నకు కన్నడలో వాయించమని చూచాయగా సూచనలను మాత్ర మిచ్చి ఆపైన సంపూర్ణ స్వేచ్ఛ నిచ్చారు. కాబట్టి వైణికు లిద్దరు సమశ్రుతి నెన్నుకొని చక్కగా నలభై సెకండ్ల కాలములోనే "అవలీలగా జగమేలగా" రాగం తానం వాయించారు. దీని చిత్రీకరణ పూర్తయిన తరువాత మరి కొంచెంసేపు ఉంటే బాగుండునే అని విన్నవారంతా అన్నారట. వింటానికి అంతా బాగుంది. వే నడగగా వెంకట్రాజుగారు వీలైతే వీనైవా పద్యాలతోబాటు వీణావాదనంకూడా రికార్డులో విడుదల చేయించేందుకు ప్రయత్నిస్తామని అన్నారు.

ఈ చిత్రంలో మొత్తం పది పాటలు, మూడు పద్యాలు ఉంటాయి. పాడినవారు బాలమురళీకృష్ణ, జానకి, శ్రీనివాస్, సుశీల, చిత్తరంజన్ సినిమాలలో బాల మురళీకృష్ణ పాట వినటం కొత్త కాకపోయినా అరుదైన విషయమే. ఇంతకుముందు "సతీసావిత్రి" లో "నమ్మితినే జననీ" అనే వీణపాట, తక్కువ కొన్ని పాటలు పాడారని తెలిసిన విషయమే. చిత్తరంజన్‌ది మరికొంచెం కొత్త కంఠం. సినిమాలో మొదట వినిపించినది సారథి వారి "కులదైవం" లో. అందులో వీరు పాడినవి, ఒకటి "మనసులో ఒకటుంచి" అనే ఖవాలి మాదిరి పాట. మరొకటి సుశీలతో కలిసి పాడిన వగలు, వయ్యారాలు ఒలికించే ద్వైతగీతం. "రావే రావే వయ్యారి నా చెలీ" అన్నది. నంబరు జి ఇ. 35013. రెండూ తేలికగా మానసములో కాంచనకోరకము వలె తేలియాడే పాటలు. వీరి గాత్రం అప్పుడప్పుడు హైద్రాబాదు ఆకాశవాణి కేంద్రంనుంచి ప్రసారమయే లలిత సంగీత కార్యక్రమాల్లో వినవస్తూ ఉంటుంది.

స్వర్ణగౌరి తెలుగు జి ఇ 35263, కన్నడం జి. ఇ 36581.

పై చిత్రంలో చిత్తరంజన్ పాడినది జానకితో కలిసి "జయమీవే జగదీశ్వరి" అన్న భజన. వరస హిందూస్థానీ శైలిలో జైజైవంతి రాగంలో (కర్నాటపరంగా చెప్పుకోవాలంటే శహన అనవచ్చునుకుంటాను) ధ్వనింపించేటట్లు వెంకట్రాజు చేశారు "కావ్యగాన కళావాగరీ" అంటూ జానకి వెన్నెల వన్నెల తీగలు సాగే సారంగులతో శ్రుతి కలిపి పాట మొదలుపెడుతుంది. ఇందులో చిత్తరంజన్ పాడినది చాల తక్కువ అయినా వేసిన స్వరాల మాధుర్యాన్నిబట్టి కొలిస్తే తక్కువేం కాదని తెలుస్తుంది. "గమగమ దనిదని రిగరిగ మపమప దనిదని సమగపమ గపమ గపమ గమ జయమీవే జగదీశ్వరి" అని చిత్తరంజన్ అంటే జానకి "దనిపమగమ రిగరిస నిసనిస దనిదని గమగమ రిగరిస నిసనిరిగా సరి నిస రిరిరి గమగ మమామ దపదమపగమ సాగప మాగమరి (3) జగదీశ్వరీ" అని స్వరం వేసి తారస్థాయిలో సుతారంగా సితారులా సంగతులు వేశారు.

రెండవప్రక్కనున్న జానకి పాడిన పాటలో పడుచుదనపు ఊపు, గడుసుదనపు మురిపెంపు "పరవశాన శ్రోతల మేనులు తూలింప" జేస్తాయి. పాటతోబాటు వినవచ్చేది బొంబాయి మార్కు ఆర్కెస్ట్రేషనే. కాని యిటువంటి వాద్యరచన మంచి మతీ శ్రుతీ ఉన్న మ్యూజిక్ డైరెక్టరు చేతిలో అనుకరణగా లేక అలంకరణగా రూపొందటం తథ్యమనే సత్యాన్ని నిరూపిస్తున్నది. రచనలో రెండవ పాటదే పైమెట్టు. కొత్త ఊహలతో, కొంగ్రొత్త పదసమూహాలతో రసికమనోరంజనంగా ఉం దీ పాట. "గాలిసోలే విరిబాలవోలే పరవశాన నామేను తూలే", "సొగసులోన వెలరాజుసిరు సోయగాన రాయంచ సౌరు" అన్నవి కవి వీటూరి వినూత్న పోకడలకు మచ్చుతునకలు.

ఈనాడు రికార్డింగ్ కంపెనీ అధినేతల ఆదేశానుసారం అవలీలగా హాస్యగీతాల పేరిట అశ్లీలాలు దొర్లిస్తున్న హాస్యరత్న ములుకుట్ల సుబ్రహ్మణ్యం ఒకప్పుడు కలకాలం ఉండే రెండు పాటలను వ్రాశారన్న సంగతి మీలో ఎందరికి తెలుసు ? ఆ రెండు పాటలు గోపికా మనోగతాలను క్షుణ్ణంగా అవగతం జేసుకొని రచించిన మధురగీతాలు. కమ్మని తేనియలూరే పూతలు. చక్కని పాటలు వ్రాయటంలోకూడ ములుకుట్ల నేర్పరి అని రుజువుచేసే రాతలు. ఈ పాటలను చూచి ఎస్. రాజేశ్వరరావు తమంత తామే కోరి వరసలు కూర్చారు.

రెండిటిలో వరసతో మనసును మురిపించేది "నీమీద మనసాయెరా" అన్నది. "అందాలు చిందేటి ఈ సీమలో ఆనంద మందించే ఊరేయి" లాగ హాయిగా హొయలు కురిపిస్తూ పాడింది స్వర్ణలత. దీని వెనుక "విరిసెను వెన్నెల కలిసెను కన్నులు వేణువు మాదరా గోపాల, హాయిగ పాడెద ఓ బాల" ఉంది. ఈ పాట దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు రాధ హృదయాన్ని మధించి, "కృష్ణా నీవు వెన్నెలవేళల్లోనే మురళి నూదెదవా లేక నీ వేణువు విన్నంతనే నేను వెన్నెలనుభవించుదునా" అని వేసిన ప్రశ్నను గుర్తుకు తెస్తున్నది.

రాజేశ్వరరావు సంగీతానుసరణ యమున చిరుగాలి చెలరేగే చిరుకెరటాలన్ను వేణువువిన్న రాధ హృదిలో ఉప్పొంగే ఆనందపు టలలను లీలగా అనుసరించింది. ఈ రికార్డు నంబరు జి.ఇ. 22400

కొన్ని సంవత్సరాల క్రిందట జమునారాణి పాడిన గోపికాగీతం "యమునాతీరము సంధ్యా సమయము యెవ్వరు లేరిట కృష్ణా" అన్నది జ్ఞాపకం ఉందా ! ఇలను నిలిచిన తీయని కలగా, మూర్తీభవించిన మోహనభావనగా, దూరాన వినవచ్చే మురళీరవళిగా ఆపాట విన్నవారి హృదంతరాళాల్లో స్థిరపడిపోయి ఉంటుంది. అటువంటి పాటలు ఇప్పుడు రావడంలేదు కదా !

గాలిమేడలు యన్. 69713.

"ఈ మూగ చూపేల బావా మాటాడగా నేరవా" అన్నది పాటగా రేణుక వేసిన ప్రశ్న. దానికి ఘంటసాల జవాబు "ఓహో మాటాడవే బొమ్మా, నీదరి నే జేరి మాటాడనా" జూనియర్ సముద్రాల సాహిత్యంలో అక్కడక్కడ పల్లెవాతావరణం కనపడుతున్నది గాని వరసలో గాని, వాద్యగోష్ఠిలోగాని ఆ వాసన లేదు. కాని పాటగా ఆనందించటానికి. అవి ప్రతిబంధకం కాదు. పైగా ఆ కొత్త పోకడలు స్వరసుధాలహరికి అనుబంధాలుగానే ఉన్నాయి. సంగీతం లింగప్పదే. చల్లని సంగీతం వినిపించటం వారి కలవాటైనదే. దీని కవతలనున్న ఘంటసాలపాట సాధారణంగా ఉంది

గుండమ్మకథ జి. ఇ 35269.

ఈ చిత్రంలో అప్పుడే మూడు రికార్డులు విడుదలైనవి. వాటన్నిటికీ బాగున్నది "ఎంత హాయి" అన్న సుశీల ఘంటసాల యుగళగీతం ఘంటసాల సంగీతంలోను, గాయకుల స్వర సమ్మేళనంలోను "చందమామ ముత్యమంత వన్నిటి జల్లులా చల్లగా" చల్లినట్లుంది. పింగళి సాహిత్యం కొత్తవిధంగా ఉంది ఘంటసాల పాడిన చరణాన్ని కొంచెం మార్చి సుశీల పాడుతుంది ఇదే దీని ప్రత్యేకత.

"నన్నగ వీచే చల్ల గాలికి" రెండవ ప్రక్క పాట. సాహిత్యం ఎత్తుగడలో ఉన్న సుశీల పాడితే అంత హాయిగా ఉంది. పాపం "కనులు తెరచినా మూసినా నీవే నాయె" అంటూ కథానాయికి తనకు తానే గతాన్నిగురించి స్వగతాలు చెప్పుకుంటున్నది. వరస పాతదైనా బాగానే ఉంది.

## క్షిప్త స్వరం

"రాజనందిని" లో "చిక్కావు లేరా చక్కని రాజా" అన్న పాట, జిక్కి పాడినది ఉంది. సినిమాలో అది అంజలీదేవి నాట్యం. ప్రక్కనే ఉన్న కీర్తిశేషులైన ఆర్. నాగేశ్వరరావు మధ్య మధ్య 'పైతస్సలరవల' అంటూ ఉంటాడు. అది రికార్డులో చెప్పిన దెవరో తెలుసా ? ఆచార్యులు, నాట్యాచార్యులు, ప్రముఖ దర్శకాచార్యులు అయిన వేదాంతం రాఘవయ్యగారిది. ★

# హరివంశము

హారీత శివశర్మ

## సాందీపనిపర్వం - 58

మహానందుని భార్యకు సుదక్షిణ స్వయముగా ఉపచారములు చేసినది. ఆమె తేరుకొనుదాక, తన ఉత్తరీయముతో విసరినది. ఆమె తేరుకొనగా, మరికొంత మంచితీర్థము త్రాగించినది. ఆ తేరుకొనుట యేమి తేరుకొనుట! కన్నులలో ఉన్మాదముగా, భయముగా, బిడియముగా, సిగ్గుగా నామె పౌండ్రకుని చూచినది; సుదక్షిణను చూచినది; వాచాలుని చూచినది. ఆమె ఆ బాలకుని చూచి, సుదక్షిణ నిజముగా భయపడినది.

"తల్లీ! సేదతీరుడు. ఇప్పుడు ఆచార్య మహానందులకు వచ్చిన భయమేమియును లేదు. భయము ఉన్నదందురా! ఆ విషయమును ఆచార్య సాందీపనియు, శ్రీ కృష్ణ వాసుదేవుడును చూచుకొందురు. మరియు నిది పౌండ్రకులైన వాసుదేవులు తేల్చునట్టి విషయముకాదు. ధర్మపరిషత్తు తేల్చవలయు విషయము" అన్నది. అని పౌండ్రకుని దిక్కు చూచినది.

"స్వామీ! తమరు ఏమని యందురు?" అన్నది.

పౌండ్రకు డేమియు ననలేదు. సుదక్షిణదిక్కు తీక్షణముగా చూచినాడు. చూచినవాడు అంతలో మందహాసము చేసినాడు.

"సుదక్షిణ! అంతయు నీవనినట్లు జరుగవచ్చును. జరుగకపోవచ్చును. ధర్మ పరిషత్తునకు నేన అధ్యక్షుడనుగుమక, నా ఇష్టమువచ్చినట్లును జరుగవచ్చును. మరి అది యంతయు నీవనినట్లు వేరు విషయము. ఇప్పుడు ఈ బంగారు మృగమున్నది. అది ఎట్టి విషయమందువు. దానినిగూడ ధర్మపరిషత్తులే విచారింతురందువా! లేక శ్రీ కృష్ణవాసుదేవుడు విచారింతునందువా! ఆ మృగము నిచ్చినది నేను! ఆచార్యులు దాని నేల దానము చేయవలె! ఇచ్చినదానిని దానముచేయు అధికారము ఆయనకు లేదా అందువు? లేదని అనను. కాని నేను ఆయనకు ఇచ్చితినా! వామాక్షి కిచ్చితిని. వామాక్షికి నే నన్యాయము చేసినాను. వామాక్షి యాడుకొను ఆశ్రమ మృగమును చంపినంతపని చేసినాను. దానిని వైద్యము చేత బ్రతికించినానందువు. అదియును నిజమే కాని, ఇప్పుడామృగము పూర్వమువలె లేదు. జీవితములో దెబ్బతినిన జీవి విధమున అగడై చరించుచున్నది. ఆ కష్టమును నేను తెచ్చిపెట్టితిని. వామాక్షి అందుల కెంతగా శోకించియుండును. ఆ బుణము తీర్చుటకే మృగము నిచ్చితిని. మరి అట్టిదానిని ఆచార్య మహానందు లేల దానముచేయవలయును. ఆ దానముచేయు అధికార మాయన కున్నదా! నేను అంగీకరించను" అని పౌండ్రకుడు మహానందుని భార్య దిక్కు ఇట్లు ప్రశ్నించినాడు:

"తల్లీ! ఆచార్యు లీ దానమున తమకు చెప్పి చేసిరా! వామాక్షికి చెప్పిచేసిరా?"

మహానందుని భార్య మాటలాడలేకపోయినది. ఆమెకు పౌండ్రకుని ఈ మెత్తని తనములోని వజ్రకాఠిన్యము మనస్సును తాడించుచున్నట్లయినది. ఆమె పేద చూపులతో సుదక్షిణను తిలకించినది. ఆ కన్నుల ప్రార్థనమున్నది. బ్రతిమాలుట యున్నది. "తల్లీ! ఆయన పిచ్చివాడు. తల తిక్కవాడు. తనకేది తోచిన, యది చేయువాడు. ఆయనను నీవు కాపాడవలయును, అన్న అభిప్రార్థన మున్నది. సుదక్షిణకు ఆమెను చూడగా పరమమైన అను క్రోశము కల్గినది. ఆమె పౌండ్రకునితో నన్నది.

"స్వామీ! ఈ తర్క వాకచక్యము సేవు ధర్మపరిషత్తులలో చూపుదురుగాని; ఇచ్చట ప్రదర్శించిన ఏమి లాభము. వీరు మనకు గురువుల భార్యలు. తల్లివంటివారు. వారు మనల నేదియో అర్థించుటకు వచ్చినారు. ఇంతకు వాచాలుని మాటను పట్టుకొనియేకదా తాము ఇట్లు మాటాడుచున్నారు. ఆ వాచాలు డది చూచెనా! ఎవ్వరో చెప్పగా వినెను. ఆ విన్నదానిని కొండెముగా చేరవేయుట కిచ్చటకు వచ్చెను. మరి ఈ వాచాలు డెట్టివాడు! రాజుల సేవలో విదూషకుడైనవాడు. ఆత్మప్రత్యయము నెరుగని బానిస. తాను సేవించుచున్న రాజుల విపరీత చిత్తవృత్తులకు సంతోషమును కూర్చుగా నెంచువాడు. మరియు బ్రాహ్మణుడు. ఏమి బ్రాహ్మణుడు!"

అని సుదక్షిణ నవ్వినది. "విదూషకులు సగము బ్రాహ్మణులు. సగము కారు. వటుకులవలె పంక్తిబాహ్యులు" అన్నది. మరల నవ్వినది.

మహానందునిభార్య కిదియే విచిత్రమనిపించినది. ఈ సుదక్షిణ యేమి స్త్రీ. ఆమె భర్తకు భయపడదు. ఉన్న విషయము దాయదు. మరి ఆ మాటాడుటలో నెవ్వరికిని కోపము రానీయదు. ఆమె ఆ మాటలనగా పౌండ్రకునకు కోపము వచ్చినదేమోనని ఆమె యాతని ముఖమును పరిశీలించెను. వాచాలుని పరిశీలించెను. వాచాలుడు విచిత్రముగ మందహాసము చేసెనేగాని, కోపము తెచ్చుకొనలేదు. రాజులును, రాచస్త్రీలును అనుటయు, అతడు పడుటయు పరిపాటి. మరియు వారు అట్లులన్నచో అదియును వొక్క ఘనతగనే భావించును. పౌండ్రకుడు సుదక్షిణవైపునకే చూచుటలేదు. తన్నే చూచుచుండెను. ఆ చూపులలో పట్టుదల యున్నది. గౌరవమున్నది. జాలియున్నది. ఆలోచనయున్నది. అతడేమియో మాట్లాడునని యామె యనుకొనగా, నాతడు మాటాడలేదు. మందహాసముమాత్రమే చేసెను. తనపైనుండి దృష్టిని మరల్చి వాచాలుని చూచెను. వాచాలునినుండి దృష్టి మరల్చి సుదక్షిణను చూచెను. సుదక్షిణనుచూచి మందహాసము చేసెను. సుదక్షిణయు నాతడు మాటాలాడుననుకొన్నది. అతడు మాటాడలేదు. గవాక్షము సమీపమునకు నడచిపోయెను. గవాక్షరంధ్రములోనుండి బయటికి చూచెను.

"వాచాల!"

"వాసుదేవ!"

"ఆ రథముతో వాడు దారుకుడు కదా!"

"అవును."

"వాని పోషణములో నశ్వములు బాగుగా నున్నవి."

"వాడు అశ్వహృదయమును పూర్తిగా నెరిగినవాడని గ్రామములోని సూతులందరు అనుచున్నారు"

"వాని సారథికమ్మైన రథము నధిరోహించవలెను."

"వాడు యాదవుని సారథి. వాని యనుజ్ఞలేక నెవ్వరిని రథము నధిరోహింపనీయడు."

"మేము వాసుదేవులము!"

సుదక్షిణ గల్లున నవ్వినది.

"స్వామి! ఆయన అసలు వాసుదేవుడు"

"నేను పౌండ్రక వాసుదేవుడను!"

"ఆ మాట నేను అంటినా!"

పౌండ్రకు డప్పుడు గవాక్షమునుండి దృష్టిని మరల్చి మహానందునిభార్యను తిలకించినాడు.

"తల్లీ!" అని సంబోధించినాడు. ఆమె అతని దిక్కు చూచినది.

"తల్లీ! నేను ఒక్కటి చెప్పెదను వినుడా! ఆచార్య మహానందులు కడజాతివాని దానమును పట్టుటనుగూర్చిన యభియోగము విషయమున నే నేమియు చేయలేను. అది ధర్మపరిషత్తు విచారింపవలయు విషయము. అయినను నీవు రాజువుకదా అని మీరు అందురు. నిజమే! కాని పరిషత్తు నిర్ణయ మెట్టులుండునో ఎవరు చెప్పగలరు! మరియు ఆచార్య సాందీపనియు, మరి ఆ యాదవుడును ఏమియో చేయగలరన్న ధైర్యము, సుదక్షిణకువలెనే, తమకును ఉండవచ్చును. తల్లీ! ఇది మీరు ఆలోచించిచూడుడు. నేను భర్తను. నాయందు ఈ నాభార్యకు విశ్వాసములేదు. నాకు గురువులైన ఆచార్య మహానందు లొక నేరమును చేయగా, ఈ నా భార్య నే నాయనకు వ్యతిరేకము చేయుదుననియు, ఎవ్వడో యాదవుడు రక్షించు

—52వ పేజీ చూడండి

# కథ కాని కథ

## కాఫీ తీసుకురా
### (మొదటి బహుమతి)

అవి మేము స్కూల్లో చదివే రోజులు. ఒకనాడు స్కూలు ప్యూను ఆఫీసు వాకిలి ముందట కునికిపాట్లు పడుతూ కూర్చున్నాడు. కాలింగ్ బెల్ మ్రోగటంతో గబగబా తల పాగా చుట్టుకొని హెడ్‌మాస్టరు గారి ముందు నిలబడ్డాడు నమ్రంగా. అప్పుడు మేము హెడ్‌మాస్టరు గారితో స్కూల్ డే జరపడం గురించి మాట్లాడుతున్నాము. హెడ్ మాస్టరుగారు ప్యూనుచేతిలో బేడ కాసుంచి 'పోయి కాఫీ తీసుకురా' అన్నారు. ప్యూను వెళ్లాడు. అర గంట కావచ్చినా కాఫీ జాడలేదు. హెడ్‌మాస్టరుగారు ఆలస్యాన్ని భరించలేక ఆఫీసు వరండాలోకి వచ్చారు. వచ్చీరాగానే కునికిపాట్లు పడుతున్న ప్యూను రంగయ్య కనిపించాడు. హెడ్మాస్టరుగారు కోపంగా 'రంగా! కాఫీ తీసుకు వచ్చావా?' అన్నారు జ్ఞాపకం చేస్తూన్నట్టు. రంగయ్య లేచినుంచుని "అప్పుడే తీసుకువచ్చానండి. అయ్యగారూ!" అన్నాడు.

హెడ్మాస్టరు ఒక నిముషం విస్తుపోయి, అంత కోపంలో పకపకా నవ్వడం మొదలు పెట్టారు. ప్యూను రంగయ్య నిర్ఘాంతపోయాడు. మేమూ అది అర్థం చేసుకొని నవ్వటం మొదలు పెట్టాము. హెడ్మాస్టరుగారు పర్సులోంచి మరో బేడ కాసు తీసి, రంగయ్య చేతిలో పెట్టి 'కాఫీ నాకు ఇక్కడికి తీసుకురా' అని వత్తివత్తి చెప్పారు. అప్పటికి గాని రంగయ్యకు జరిగిన పొరపాటు అర్థం కాలేదు. తల తడుముకుంటూ బయటకు పరుగెత్తాడు.

డా॥ జి. ఎన్. శర్మ (కళ్యాణదుర్గం)

• * *

## పుస్తకం చిరిగితే
### (రెండవ బహుమతి)

మా తరగతిలో నేను, నా మిత్రుడు వేణు చాలా స్నేహంగా ఉండేవాళ్ళము. అప్పుడప్పుడు మేము పాఠశాలకు సెలవు పెట్టే వాళ్లం. అటువంటప్పుడు మేము పరస్పరము అయ్యవారు ఇచ్చిన నోట్సులను ఇచ్చి పుచ్చుకునేవాళ్లం. ఒకసారి నా మిత్రుడు పుస్తకము ఒకటి పట్టుకెళ్ళి, తిరిగి ఇచ్చేటపుడు, "పొరబాటున చినిగిపోగా, కుట్టి తెచ్చి" నట్లు చెప్పాడు. మరొకసారి పుస్తకము ఇవ్వవలసి వచ్చినప్పుడు, నేను పుస్తకము ఇస్తూ "ముందుమాదిరి చింపి కుట్టితెచ్చే పద్ధతి పెట్టుకోవద్దు" అన్నాను. అందుకు నా స్నేహితుడు "కుట్టకుండానే తెస్తానులే" అని తక్కున సమాధానము ఇచ్చాడు.

జి. వి. శ్రీధర్ (మద్రాసు)

• * *

## అటకమీద అమ్మమ్మ!
### (రెండవ బహుమతి)

నేను మా తాతగారింటికి సెలవులకు వెళ్లాను. మా మామయ్య డ్యూటీమీద మరో ఊరికి వెళ్లాడు. రాత్రి 2 గంటలయింది. అందరం మంచి నిద్రలో ఉన్నాం. మామయ్య డ్యూటీనుంచి వచ్చి 'అమ్మా' అని పిలవసాగాడు. మా అమ్మమ్మ 'ఆఁ ఆఁ' అని పలుకుతోంది. నేను మెలకువవచ్చికూడా, ఆవిడే తలుపుతీస్తుందనివూరుకున్నాను కాని అమ్మమ్మ ఇంకా తలుపు తియడానికి లేవలేదు. మామయ్య 'అమ్మా' అని గట్టిగా పిలవడం మొదలెట్టాడు. అమ్మమ్మ 'నిచ్చెన లేదురా. ఎలాగరా రావడం' అంది. ఇదంతా బోధపడక ముందువెళ్ళి తలుపు తీశాను. మామయ్య వచ్చి ఆమెను లేపి కూర్చోపెట్టి సంగతేమిటని అడిగాడు. అమ్మమ్మ ఇలాగంది: "మన ప్రక్కనున్న సిద్ధాంతిగారి అటక ఆవకాయ తీయమంటే ఎక్కాను. ఇంతలో పిల్లలు వచ్చి నిచ్చెన తీసేశారు. నువ్వు కొంపమునిగి పోయినట్లు అప్పుడే అమ్మా అని పిలుస్తున్నావు. ఆ నిద్దర్లోనే నిచ్చెన లేదు. ఎలా దిగి వచ్చేదని అని ఉంటానురా."

ఇది విని మాకు నవ్వాగలేదు.

కె. సుబ్బారావు (పెద్దాపురం)

★




## జరిగిన కథ

చిన్నతనంనుంచి తల్లిదండ్రులు మమత కరువైన సూర్యం నాయనమ్మ నరసమ్మ గారి ఆదరణలో పెరిగి పెద్దవాడవుతాడు. పంతులమ్మ నిర్మల నరసమ్మగారింటో ఒక వాటాలో అద్దెకుంటోంది. మరో వాటాలో రాజ్యలక్ష్మివాళ్ళు ఉంటారు. శంకరంగారు సూర్యం పనిచేస్తున్న కంపెనీలో హెడ్ గుమాస్తా ఆరుగురు ఆడపిల్లల తండ్రి. ఆయన ఆహ్వానంమీద సూర్యం ఒకరోజున వాళ్ళింటికి వెళ్ళివస్తాడు. రాజ్యలక్ష్మి అంతలో అందంగా ఎదిగి పోడం సూర్యం మనస్సును [illegible]రిస్తుంది.

వెంటనే ధ్రువ మేడమెక్కిపోయాడు. సిగరెట్ ముట్టించి ముక్కుపుటాలు వాచేలా పీల్చి వదల్డం మొదలుపెట్టాడు.

ఏ మాటలు విన్నాడో తెలియదుగాని ఎద నంతా ఉద్వేగం నిండిపోయింది.

"ఎప్పుడూ లేంది, రాజాకి నేనంటే ఇంత భయం ఎందుకు చెప్మా?...."

మొట్టమొదట్లో వాళ్ళింట్లో దిగినప్పు డాపిల్ల ఎంత అల్లరి చేసేదని! ఇప్పుడు 'బావా! బావా!' అని చనువుగా రావడం మానేసింది.

గత ఏడాదిలో తను రాజ్యలక్ష్మిగురించి తీవ్రంగా ఆలోచించానని తోచింది సూర్యానికి. కాని ఆపిల్లకిమాత్రం సూర్యమంటే చనువు తగ్గిపోయి బిడియమూ, సిగ్గూ పెరిగిపోయాయి.

"పిచ్చిపిల్ల, అంత భయమెందుకూ? కప్పు ఎత్తేస్తే అదే పోయింది. అమ్మమ్మ ఏమేనా అంటుందేమోనని భయం కాబోలు ...." అను కున్నాడు.

ఒకవేళ తనకి కాఫీ లేకపోయిందేమని బాధ పడుతూందేమో? తను కాఫీ తాగే వచ్చేనని చెప్పాల్సింది.

ఇలా రాజ్యలక్ష్మిగురించే తలపోస్తూ తన మీదను వాలుతున్న చీకట్లను గమనించకుండా నాలుగు సిగరెట్లు కాల్చాడు.

"ఒరేయ్ సూర్యం! ఒరేవ్ బాబూ!" బామ్మ దిగువనుంచి కేకలేస్తోంది.

44-వ పేజీ చూడండి

# వనితాలోకం

# ఇంటిలో నర్సింగ్

బి. ప్రేమలీల

ఆమధ్య జబ్బుగావుందని తెలిసి నా స్నేహితురాల్ని చూడ్డానికి వెళ్లాను. గదిలో మూలగా మంచం మీద పడుకొని ఉందామె. కిటికీలన్నీ మూసేసారేమో గదంతా చీకటి చీకటిగా ఉంది. కాస్త టెంపరేచర్ హెచ్చుగా ఉందనుకుంటూ అటూ, ఇటూ కదులుతూ—ఆరాటపడుతూఉంది. ప్రక్కనే ఎత్తుపీటమీద టేబిల్‌ఫాన్ 'బొయ్యి'మనే శబ్దంతో గిరగిరా తిరుగుతూంది. నే వెళ్లేసరికి పదిమందిదాకా ఆడవాళ్ళు (నాలాంటి విజిటర్సే అనుకుంటా) మంచం చుట్టూరా, కుర్చీల్లో కూర్చుని కొందరూ—నిలబడి కొందరూ గుమిగూడి ఉన్నారు. గుమ్మందగ్గరే నిలచిపోయి, లోపలికి చూస్తున్నాను. అక్కడకు చేరినవాళ్లంతా రకరకాల జబ్బుల గురించీ — జరిగిన పురుళ్లగురించి — జరుగబొయ్యే పురుళ్ల గురించీ తుదా—మొదా తేలుస్తూ కబుర్లలో లీనమయ్యారు. నిలుచున్నవాళ్లమధ్య సందుల్లోంచి రోగిని చూడ్డానికి విశ్వప్రయత్నం చేసాను. కాని, లాభం లేకపోయింది. ప్రక్కగదిలోనుండి రేడియో "టోటల్ వాల్యూంలో" సంగీతం కురిపిస్తోంది. బయటి వరండాలో పిల్లలు గొల్లున అరుస్తూ, ఆటలాడుతున్నారు. ఓమూల ఒకపాప 'గయ్యి'మంటూ ఇంటికప్పు ఎగిరేలా ఏడుస్తోంది. చుట్టూరా ఇన్ని గొడవల్తో మంచంమీదున్న ఫ్రెండ్‌ని తలుచుకొనేసరికి ఎంతో జాలివేసింది. ఇన్ని గోలలమధ్య ఆమెకి నిద్రెలాపడుతుంది? మనస్థిమితం ఏం ఉంటుంది? ఆ ఆలోచన ఎవరికీ లేదు. ఇహ ఈ పరిస్థితుల్లో ఆమెని ఎలానూ చూడడం సాధ్యం కాదనుకొని వచ్చినదారిని వెనక్కు మరలాను. ఇది ఆనాటి అనుభవం. కాని ఆ అనుభవమే మనస్సులో ఒక చెరగని ముద్రలాపడి, ఈ వ్యాసరచనకి ప్రోత్సాహాన్ని — ఉత్సాహాన్ని కలిగించింది.

కుటుంబం అన్నతర్వాత ఇంటిలో ఎవరికో ఒకరికి—ఎప్పుడో ఒకప్పుడు సుస్తీ చేస్తుంటుంది. సుస్తీ రోజుల్లోంచి—వారాలూ, నెలల్లోకి దిగేసరికి అలాంటి రోగులను చేర్చుకోడానికి డాక్టర్లు నర్సింగ్‌హోమ్స్ నడుపుతుంటారు. అలాంటి హోమ్స్ అందుబాటులో ఉన్నప్పుడు రోగుల్ని వాటిలో చేర్పించడంకన్న ఉత్తమం లేదు. కాని, అలాంటి ఏర్పాట్లు లేనప్పుడు, ఉన్నా చేర్పించే ఆర్థిక స్తోమతు లేనపుడు, మన ఇంటిలోనే కాస్తంత శ్రద్ధ తెలివితేటల్నీ ఉపయోగించితే ఒక చిన్న నర్సింగ్ గది ఏర్పాటుచేసికోవచ్చును. ఆ గది రోగి ఉండడానికి అనుకూలమైనదీ—గృహంలోని మిగతా గదులన్నిటికి కాస్త ఎడంగా ఉండేదీ అయివుండాలి. గాలీ, వెలుతురూ, ధారాళంగా ప్రసరించేగదిని చూసుకొని కిటికీ లన్నిటిని తెరచిఉంచాలి. రోగిని ఆ గదిలో ప్రవేశపెట్టేముందర నేలనీ, గోడలు, సీలింగ్‌కు బూజులవీ లేకుండ శుభ్రంగా తుడిచి ఫినాయిల్, లిసాల్ మొదలయిన సంక్రమణ నిరోధములయిన ద్రావకాలతో గదిని కడిగివేయుటం మంచిది. ఒక బేసిన్, లేదా బొక్కెలో రెండు గాలన్లదాకా నీరుపోసి, దానిలో మూడు నాలు గవున్సుల పైచెప్పిన ద్రావకాలను కలిపి, ఒక శుభ్రమైన గుడ్డ దానిలోముంచి గదంతా తుడిచివేస్తే నేలంతా శుభ్రంగా ఉంటుంది. ఆ తర్వాత రోగి మంచం గదిలో కిటికీకి ప్రక్కగా అమర్చితే తలుపుల్లోంచి కాని, కిటికీలోంచిగాని వెలుతురు సూటిగా మొహం మీద పడకుండా—కళ్లకు శ్రమ కలిగించకుండా ఉంటుంది. గదిలో రోగి పడుకొనే మంచం, మందు లుంచే అలమరా, ఇతర వస్తువులు పెట్టుకునే బల్ల తప్పించి, మిగతా సామగ్రినంతా అక్కడనుండి తీసివేయాలి. గదిలో రోగికండ్ల కెదురుగా భయాన్నీ భీతినీ కలిగించే చిత్రపటాలు గోడలకు ఉంచకుండా మనస్సుకు సంతోషాన్ని కలిగించే ఆహ్లాదకరమైన సుందర దృశ్యాలుగల చిత్రపటాలు వేళ్లాడదీయుటం మంచిపని. ఇంకా రోగి కెదురుగా బల్ల మీద పూలకుండీని ప్రతిరోజూ తాజా పూలతో అలంకరించుతూంటే—ఆ దృశ్యం రోగి మనస్సుకు సంతోషాన్ని కలిగిస్తూంటుంది. రోగిని ఒక ప్రత్యేకమైన గదిలోనుంచి కావలసిన వస్తువు లన్నీ సమకూర్చడం మొదటి మెట్టు. ఇహ రెండోది ఆ రోగియెడల ఇంట్లోవాళ్లూ—పరిచర్య చేసేవాళ్లూ తీసికొనవలసిన జాగ్రత్తలు. హాస్పిటల్స్‌లో నర్సులు రోగుల పరిచర్యవిషయంలో ప్రత్యేక శిక్షణ పొందినవారయి వుంటారు. ఇంటిలో రోగి ఆహార పానీయాలు చూసుకొనే వ్యక్తి తల్లిఅయినా, మరెవరయినా, ఏలాంటి నర్స్‌శిక్షణ పొందకపోయినా, తగిన చాకచక్యాన్ని — తెలివి తేటల్ని ఉపయోగించిన రోగికి ఒక మంచి నర్స్ కాగలదు. రోగి అడిగే ప్రతి ప్రశ్నకూ విసుక్కోకుండా, ఓపికతో జవాబీయ గలుగుతూ వుండాలి. ఒక్కొక్కసారి రోగికోరే విపరీతపు కోరికలకు చిరాకుపడకుండా, కోపపడకుండా సానుభూతితో, దయతో, ఆ కోరికలనుండి రోగి మనస్సు మళ్లింప ప్రయత్నం చేయాలి. కొందరు జబ్బుగావున్నవాళ్ళు ఆ నీరసపరిస్థితిలో కొట్టవచ్చేట్టు కన్పించే ముదురురంగుల దుస్తులను, ఆ రంగులుగల వస్తువులనుచూసి, చికాకుపడతారు. అందుచేత ఇంట్లో రోగికి ఉపచర్యచేసేవారు సాధ్యమైనంతవరకు సింపిల్‌గావుంటూ, లేతరంగు దుస్తులు శుభ్రమైనవి ధరించడం మంచిది. తెల్లటి మల్లెపూవులాంటి దుస్తుల్లు రోగికళ్లకు హాయిని, మనస్సుకు ఆనందాన్ని, ప్రశాంతిని కలిగిస్తాయి. రోగికి ఉపచర్య చేసేవ్యక్తి వివేకవంతురాలూ, విద్యావంతురాలై వుండడం మంచిది. డాక్టరు చెప్పిన సలహాలు తూ. చా. పాటించుతూ, రోగనివారణకు ఆయన చేసే ప్రయత్నాలకు పూర్తి సహకారమిస్తుండాలి. రోగి కుపయోగించే మందుసీసాలన్నిటికి పైన లేబిల్సు వేసి, వాడేముందు పైపేర్లను బాగా చదువుకుని, ఆపైన వాడడం తెలివైన పని. సరిగ్గా చూసుకోక, ఒకమందు దీయబోయి మరోటి ఇచ్చేసి, చేతులారా ప్రమాదం తెచ్చుకొని, ఆపై లబోదిబోమని ఏడ్చేవాళ్లెంతోమంది. ఇంట్లో ఎవరేనా జబ్బుపడితే, పరామర్శించడానికి, చూడడానికి ఇరుగుపొరుగువారు, పరిచయస్తులు, స్నేహితులు వస్తుంటారు. పనిగట్టుకు చూడడానికి వచ్చినవారిని రోగిని చూడనీకుండా పొమ్మనడం—మర్యాదలక్షణం కాదు గనుక వచ్చినవారిని ఒకసారి రోగిని చూడనిచ్చి, మరో గదిలోకి తీసికొని వెళ్లటం చేయాలి. లేకపోతే నా ఫ్రెండ్ ఇంట్లో జరిగినట్లుగా, వచ్చినవాళ్లంతా రోగిదగ్గరే చతికిలపడి, ఊళ్లో గొడవలన్నీ (ముఖ్యంగా జబ్బులనుగురించి) ఏకరువు పెడుతూ గంటలకొలదీ గడపటం — రోగి అనారోగ్యాన్ని మరింత వృద్ధిచేస్తుంది.

ఇంట్లో రేడియోను హెచ్చుస్థాయిలో పెట్టడం, పిల్లల అల్లరి— ఆ నీరసపరిస్థితిలో రోగికి చిరాకును, అశాంతిని, నిద్రలేమిని కలిగిస్తాయి. రోగికి ఆ బలహీనమైన స్థితిలో మంచి మనోనిబ్బరం, ప్రశాంతత, నెమ్మది అత్యవసరం. గనుక కుటుంబంలో మిగతా వ్యక్తులు—రోగిని దృష్టిలో ఉంచుకొని, సాధ్యమైనంతవరకు ఇంటిని శాంతిపూరిత వాతావరణంలో ఉంచాలి. డాక్టర్లిచ్చే మందులకన్నా, రోగిపై పరిసరాల ప్రభావం, తనకు పరిచర్యచేసే వారి ప్రభావం, హెచ్చుగా ఉంటుంది. తీసికొంటున్న మందులకుతోడు, పరిసరాలు ప్రశాంతంగా, ఉల్లాసపూరితంగా వుంటే రోగి త్వరలో కోలుకోడానికి అవకాశముంటుంది. దీనికిమించి పరిచర్య చేసేవ్యక్తి చూపే లాలన, ఆదరణకరమయిన ఆమె పెదవులమీది చిరునవ్వు, ఉత్సాహాన్ని కలిగించే ఒక మంచిమాట, రోగిపాలిట సంజీవినీమంత్రంలా పనిచేస్తాయి. ★







# వనితా వాణి,
# ఆంధ్రసచిత్ర వారపత్రిక,
# 7, తంబుచెట్టివీధి,
# మద్రాసు-1

## పిల్లల మనస్సులు

27—4—62 పత్రికలో విశాఖగారు "పిల్లల మనస్సులు" అనే వ్యాసం వ్రాసి వనితలకు వారి భావనలను తెల్పినందుకుగాను నాకు చాలా సంతోషం కలిగింది. నేను ఈ విషయమ్మై పత్రికకు వ్యాసం వ్రాసి పంపుదామని ఎన్నాళ్ళుగానో అనుకుంటున్నాగాని వీలుపడలేదు. అందంగాలేరనో, చదువురాదనో పాటరాదనో పిల్లల్ని నిర్లక్ష్యం చేయడం జరుగుతుందని వ్రాశారు. అది అక్షరాలా నిజం. ఇలా నిర్లక్ష్యం చేయడం మూలాన పిల్లలలో పిల్లలకు కలహాలు, ద్వేషాలు కూడా బయలుదేరుతవి. ఇటువంటి వ్యాసాన్ని విశాఖగారు వ్రాసినందులకు నా కృతజ్ఞత పత్రిక ద్వారా వారికి అందజేయుచున్నాను.

బి. సరోజ ( విశాఖపట్టణము )

* * *

మా చెల్లెలిని నేను ఎప్పుడూ తిడుతూ, అసహ్యించుకుంటాను. దానికి కారణము మా చెల్లెలు చదువులో మొద్దు. విశాఖగారి వ్యాసము చదివిన తరువాత నాకు కనువిప్పు కలిగింది. ఇంకెప్పుడూ మా చెల్లెలిని తిట్టను, అసహ్యించుకోను.

కుమారి టి. వి. తులసి (గుంటూరు)

* * *

విశాఖగారితో నేను కూడా ఏకీభవిస్తున్నాను. ఆమె చిన్నపిల్లల విషయమే వ్రాసేరుగాని పెద్దవారై ఉద్యోగాలు చేస్తున్న బిడ్డల్నికూడ తల్లి, దండ్రులు వివిధంగా పక్షపాతబుద్ధితో చూస్తారో విశదీకరించవలసింది. తల్లేకాదు, తండ్రికూడ ఇందులో భాగం పంచుకుంటాడు. తల్లికికూడ తన స్వంత పిల్లలమీద ఎందుకు భేదభావము చూపుతుందో అర్థముకాదు. మాకు తెలిసినవాళ్ళు ఒకరున్నారు. ఆవిడకి పెద్ద కొడుకన్నా, అతని పిల్లలన్నా సరిపడేది కాదు. అతనుమాత్రం తల్లిని ఎంతో అభిమానంగా చూసుకొనేవాడు. కాని, ఆ తల్లి ఎందుకు అతనిమీద అభిమానము చూపలేకపోతున్నదో నాకు ఇప్పటి వరకు అంతు చిక్కలేదు. పిల్లలు బాగుపడాలన్నా, వృద్ధిలోకి రావాలన్నా తల్లే కారణం.

కుమారి (బరంపురం)

* * *

పిల్లలు అల్లరి చేయడం సహజం. తల్లివుంటే ఏ అల్లరి చేసినా కనిపించదు. తల్లి కప్పిపుచ్చుతుంది. కాని, తల్లిలేనివారు ఏ చిన్న అల్లరి చేసినా నానా మాటలుపడవలసివస్తుంది. పిల్లల అల్లరినిబట్టి సామెతలుచెప్తూ, ఇతరుల మనస్సు కష్టపెట్టడం ఏమంత మంచితనంగా కనపడదు.

నాగోజీ, నాగలక్ష్మి (పలమనేరు)

* * *

వ్యాసం చాలా బాగా వ్రాశారు. ఇటువంటి వ్యాసాలు ప్రతి తల్లీ చదివితీరాలని అనుకుంటున్నాను.

కె. సత్యవతీ అప్పల నర్సింహరాజు ( పెదపుల్లేరు )

* * *

'పిల్లల మనస్సులు' — ఈ వ్యాసం రాసిన విశాఖ గారికి నా ధన్యవాదములు.

వి. అన్నపూర్ణ ( విజయవాడ )

* * *

## రూర్కేలాలో జీవనవ్యయం

రూర్కేలానుగూర్చి వ్రాసిన వ్యాసం చదివాక ఉత్తరాదిఅంతా ఇంతేనా అనిపించింది. ప్రతిదీ ఖరీదెక్కువ మధ్యతరగతి కుటుంబీకుల జీవితం దుర్భరం. ఈ విషయం అలహాబాదు చేరేటప్పటికి మాకు బాగా స్పష్టమైంది. సరుకులమాట ఎలా ఉన్నా, వాతావరణం విషయం మిక్కిలి విచారకరం. ప్రతీ విషయంలోనూ మనప్రాంతమే మెరుగు. మొదట దూరపుకొండల నునుపు అనుకున్నా, తరువాత అనుభవమైతే నిజము బయటపడుతుంది. వ్యాసం అనుభవపూర్వకంగా ఉంది. ఇక్కడకూడ అన్ని విషయాలు రూర్కేలాను పోలిఉన్నవి. కాని, నాకు తెలిసినంతమటుకు పాలు, కాయగూరలు, స్వీట్సు మనప్రాంతంలోకంటే చవక అనిపించింది.

కుమారి బి. అన్నపూర్ణమ్మ (అలహాబాదు)

* * *

ఈరోజుల్లో జీవన ప్రమాణం చాలా పెరిగిపోయింది. ప్రతి వస్తువు ఖరీదు పెరిగిపోతోంది. బజారుకి, 40 రూ. పట్టుకెళ్ళినా, 50 రూ. పట్టుకెళ్ళినా ఇంటికివచ్చి చూసుకునేసరికి సరుకు మనకి కనపడదు. డబ్బైపోతుంది. ఈ రోజుల్లో మధ్యతరగతి కుటుంబాలవారు జీవితం గడపడం చాలా కష్టంగావుంది. 'జీవనప్రమాణం' గురించి శ్రీమతి పద్మావతి శర్మగారు చక్కగా వ్రాశారు.

కుమారి బి. రాజామణి (రామభద్రునిపల్లె)

* * *

"రూర్కెలాలో జీవనప్రమాణము" అన్న వ్యాసము చదివినతరువాత నేను చాలకాలము నుండి ఈ "భిలై" జీవనప్రమాణముగూర్చి వ్రాయాలనుకునేదాన్ని. కాని రచయిత్రి వ్రాసిన ప్రతీ విషయము తు. చ. తప్పకుండా ఇచ్చట అమలులో ఉన్నాయి. పై వ్యాసము చదివాక ఈ రెండు కార్ఖానాలు ఒకే మేనేజిమెంటుక్రింద ఉన్నవి. కాబట్టి జీవితప్రమాణములు యొకేలాగుండాలి గాబోసు అని అనిపిస్తుంది. ఇచ్చట బియ్యం, పప్పులు, నూనెలు ధరలు మన ప్రక్కలాగే ఉన్నను, కూరగాయలు, ఫేన్సీ సామానుల ధరలు మాత్రము ఆకాశాన్నంటుకుంటాయి. ఎంత పెద్ద జీతాలు దొరికినా, ఇచ్చట "సేవింగు"కు బదులు "షేవింగ్" మాత్రము తప్పదు.

పంచాలి శుభరత్నం ( భిలై )

* * *

## వనితలూ-వస్త్రాలు

మా కాలేజీలో కొంద రమ్మాయిలు తెల్లని చీరలు కట్టుకుంటారని వాళ్ళకి మగపిల్లలు పేర్లు పెడతారని "కుమారి దుర్గ" వ్రాసినారు. ఇది నిజంకాదు. నేను కూడ ఆ కాలేజిలోనే చదువుతున్నాను. నాతోటి విద్యార్థినులే కొందరు 'టెన్నీ' పేపరులాంటి నైలాను చీరలుకట్టి, 'రింగు' ముడులు వేసి, ఫేషన్ పరేడుకి వెడుతున్నట్టు వస్తారు. ఇలాంటి ఫేషన్ను 'టేక్' చేసి మగపిల్లల మనస్తత్వాలమీద ఎలాంటి ఊహలకు దారితీస్తాయో తెలుసనుకుంటాను. మన వేషభాషలు క్రమంలో ఉంటే ఎవరెన్ని అనుకున్నా ఫరవాలేదు. కాబట్టి ఇకమీదటయినా తోటి విద్యార్థినులు సింపుల్‌గా వస్తారని ఆశిస్తున్నాను.

సి. ఎస్. దేవి ( బరంపురం )

* * *

వనితలు వస్త్రాలు కట్టుకోవటంలో చాలా భేదములు కలవు. ఇప్పుడు నైలాన్ వస్త్రాలు అందరు కడ్తున్నారుకాని, ఏమీ అందముగా ఉండవు. ఈ నైలాన్ గుడ్డలు మన దేశపు ప్రజలు కట్టుకుంటే ఏమీ అందముగావుండవు. పైగా చాలా

వికారముగా వుంటాయి. నైలాన్ గుడ్డలు అంటేనే నాకు అసహ్యమనిపిస్తుంది.

బి. సురక్షితాంబ (సికింద్రాబాద్)

* * *

## అత్తలూ—కోడళ్లూ

ఈకాలంలో అత్తాకోడళ్ల పోరులేని సంసారాలు చాలా అరుదు. ఏవిధమయిన గొడవలు, లేక అత్తాకోడళ్ళు కలసి సంసారసాగరాన్ని గుట్టుగా నడుపుకువచ్చే కుటుంబాలు కూడా వున్నాయి. కాని ఇటువంటివి చాలా తక్కువ.

పూర్వకాలంలో అంటే మన తాతలనాటికాలంలో చిన్నవయస్సులోనే అంటే పదకొండు ఏళ్లకే ఆడపిల్లలకు పెళ్లిళ్లుచేసి, అత్త ఇంటికి పంపించేవారు. అప్పటినుండి వారు ఎన్నో బాధలుపడి సంసారాన్ని చక్కదిద్దుకుంటూ, వారికి కలుగబోయే సంతానాన్నిగురించి ఎన్నో కలలుగంటూ, వార్ని తమను సుఖపెడతారని సంతోషపడుతూ, ఆ సంతానాన్ని గంపెడాశతో కడుపునపెట్టుకొని పెంచి పెద్దచేస్తారు. తమ కుమార్లకు వివాహమయితే కోడళ్లవలన తమకు విశ్రాంతి లభిస్తుందని ఆశిస్తారు. కాని తమ కుమారులకు పెళ్లి పేరంటములు అయి, కోడళ్ళు వచ్చాకనే ఆ లోతుపాతులు అర్థమవుతాయి.

పదిరోజులపాటు సాఫీగా జరిగిన ఆ సంసారంలో తుఫాన్లు రేగుతాయి. అత్తగార్లు తమ స్థాయిని తగ్గిస్తారు. ఇన్నిరోజులు కష్టపడి పనిచేసిన మనిషి తనకు విశ్రాంతి కావాలనే వాంఛతో కోడళ్లు రాగానే ఏవో ఆరళ్లు పెట్టడం, వేడికుండను ఒక్కమారుగా వదలినట్లు సంసారభారాన్ని అంతా ఆమెమీద మోపడం జరుగుతాయి. వీరయితే చిన్నప్పటినుండి ఇంటిపనులతో విధిముఖమయినా చూడకుండా వుండటంవల్ల అత్త ఇంటికి రాగానే ఆ సంసార భారాన్ని మోయటం వారికి అంత కష్టంగా కనుపడదు. కాని, ఇప్పటి స్త్రీలు పాతికేళ్లవరకు కాలేజి చదువులతోను, క్లబ్బులతోను స్వేచ్ఛగా కాలక్షేపంచేస్తూ, సంసారవిషయాలలో ఏమీ పట్టించుకోకుండా వుండటంవల్ల వివాహమయిన వెమ్మట, ఒక్కసారిగా అత్తలు సంసారభారాన్ని వీరిపై వదలివేయటంవల్ల కోడళ్లకు చాలా కష్టం కలుగుతుంది. అప్పటి వారి స్థితి పంజరంలోని చిలుకగా వుంటుంది.

ఈ క్రొత్త సంసారంలో ఈదలేక కోడళ్ల గొడవలు, ఇటు కోడళ్లువచ్చి తమకు సుఖంలేదని అత్తగారి ఆరళ్లూనూ.

యం. సుభద్రమ్మ (కటక్)

* * *

27—4—62 సంచికలో కుమారి దుర్గ, బరంపురంనుండి వ్రాసిన లేఖను చదివాను. నేను నాలుగు సంవత్సరములు బరంపురం కాలేజీలో చదివాను. ఏ కాలేజి అమ్మాయీనా సిల్కుగాని, తెల్లచీరగాని ఎప్పుడు కట్టుకున్నా, ఎవ్వరు కూడ ఆ అమ్మాయి పేరును ఏ గుట్టమీదగాని, ఏ మెట్లమీదగాని వ్రాయడం ఎప్పుడూ చూడలేదు. ఇలాంటి అబద్ధాలు ఎందుకు వ్రాస్తారో అర్థంకాదు. ఇలాటివి వ్రాసి మగవారిని మరింత రెచ్చగొడుతున్నారు.

లత (ఛత్రపురం)

* * *

## సవతి తల్లులు

ఈ రోజులలో సవతితల్లులను చాలామందిని చూస్తున్నాము. వారిలో చాలవరకు పిల్లలను పెంచుకొనుటలో లోపములు చూపుతారు. అక్కడిదాకా ఎందుకు! మా చుట్టాలలో ఒకరున్నారు. వారు పెంపు తెచ్చుకున్నారు. భార్య ఇష్టముతో తీసుకొచ్చారు. మొదట భర్త కూడ బాగానే చూశాడు. తీరా పెండ్లీడు కొచ్చేప్పటికి చీటికి మాటికి అది రాదు, ఇదిరాదు అని లోపములు చూపటము, అటుపైన ఆ లేతహృదయము గాయపడటము జరిగింది కనుక పెంపకము తీసుకొనేముందు ఓర్పు నేర్పు అన్నిఉంటేనే తీసుకొనవలెను. లేదా మానవలెను. వారు తీసుకున్నారు, మనము తీసుకొనకపోతిమి అని విచారించరాదు. కనుక నేను చెప్పేదేమిటంటే ఎవరినన్నా తీసుకొనదలిస్తే ఓర్పు, నేర్పు వుంటేనే తీసుకొనవలెను.

మున్నా లక్ష్మీ స్వరాజ్యం (గుంటూరు)

* * *

మన వనితావాణిలో రోజురోజుకి అనవసర విషయాలు, అంటే అత్తకోడళ్ళ తగవుల గురించి, ఆడపడుచుల సాధింపుల గురించి, వరకట్నాల గురించి తప్ప, వనితలకు పనికివచ్చే విషయాలు ఏమీ కనిపించటంలేదు. 27—4—62 వ సంచికలో 'పిల్లల మనస్సులు' అనే విశాఖగారి వ్యాసం చదివాక ప్రాణం లేచి వచ్చింది.

శ్రీమతి పరిమి సీతాతిలకం (వాల్తేరు) ★

## వంటలు

## టర్కీ మిఠాయి

### కావలసిన వస్తువులు

| | | |
|---|---|---|
| జెలటిన్ | — | 1 గరిటెడు |
| చక్కెర | — | 1 కప్పు |
| వేడినీళ్ళు | — | ½ కప్పు |
| నిమ్మరసం, రంగు, ఎసెన్సు | | కొంచెం కొంచెం |

రంగు, ఎసెన్సు తప్ప మిగతా అన్ని వస్తువులు కలిపి కుంపటిమీద పెట్టాలి. కొద్ది సేపటికి చక్కెర కరుగుతుంది. బాగా ఉడికిన తరువాత రంగు, ఎసెన్సు కలిపి, చన్నీళ్లతో కడిగిన పళ్లెంలోకి గుమ్మరించుకోవాలి, గాలికి ఆరనిస్తే గట్టిపడుతుంది. నలుచదరం ముక్కలుగా కోసుకుని పైనా పంచదార వాటిమీద చల్లాలి.



తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక
సర్క్యులేషన్ అత్యధికమైనది!



వళ్లు పేయడమనే సమస్యే వుండదు



రాసుకొని దాని సంరక్షణ పొందితే...



# నైసిల్

వడి వేసవిలో కూడా వళ్లు పేయదు !
ఎంచేతనంటే నైసిల్ మీకు తాజాతనం సమకూర్చడంతో పాటు మీ చర్మాన్ని రక్షిస్తుంది. దీనిలో "క్లోర ఫెనిసిన్" తో పాటు మరో నాలుగు పదార్థాలున్నాయి-వళ్లుపేతకు ఇవి దివ్యంగా పనిచేస్తాయి.
నైసిల్, ఒంటి దుర్వాసనలను అదుపులోకి తెస్తుంది. విపరీతంగా చెమట కలగనీయదు. కొత్త మైక్రో-మిల్ పద్ధతితో తయారుచేసిన, సురక్షితమైన, సుకుమారమైన నైసిల్, మీ కుటుంబంలో అందరికీ స్నానం చేసాక తప్పకుండా ఉపయోగించ వలసిన పౌడరు.




# నైసిల్

ట్రేడు మార్కు

చర్మ రక్షణకు సాటిలేనిది



# మనమూ - మన దేహస్థితీ

డా॥ గాలి బాలసుందరరావు

## జీవకణకార్యక్రమము - 3

జీవకణములు, టిష్యూఫ్లూయిడ్‌లో సగ్గు బియ్యంగింజలు సగ్గుబియ్యం క్షీరాన్నంలో ఉన్నట్లుగా తేలుతూ ఉంటవని ఇదివరకే తెలుసుకున్నాము. అయితే, సగ్గుబియ్యం గింజలలా జీవకణములూ పరస్పరసంబంధము లేకుండా ఉంటవా ? వాటిని కలిపివుంచే దేదీ లేదా ? అతి సూక్ష్మములయిన ప్రోటీను రజ్జువులు టిష్యూఫ్లూయిడ్ లోపలలాగా యేర్పడి జీవకణములను కలిపి ఉంచుతవి. జీవకణములలో నీరు అధికంగా చేరినప్పుడు, జీవకణములు ఉబ్బి వాటి మధ్యప్రదేశము అంతరించిపోతుంది. అందులో ఉన్న టిష్యూఫ్లూయిడ్ రసాయనికస్వభావమే మారిపోతుంది. అప్పుడు జీవకణ కార్యక్రమము సరిగ్గా సాగదు.

జీవకణకార్యక్రమము అర్థమైతే జీవితకార్యక్రమమే అర్థం అవుతుంది. అక్కడ జరిగే అన్ని సూక్ష్మక్రియలనూ ఇంకా శాస్త్రజ్ఞులే అర్థం చేసుకోలేదు. మంచి రసాయనికపరిజ్ఞానమూ, విద్యుచ్ఛాస్త్రజ్ఞానము ఉంటేనేగాని జీవకణంలో జరిగే సంక్లిష్ట కార్యక్రమం అర్థంకాదు. గృహవైద్యం తెలుసుకుంటానికి ఇంత బాధపడ నక్కర్లేదు. కాని ఇది అణుయుగము. వైజ్ఞానిక యుగము. అచిరకాలములో యోగయుగమూ ఆరంభం కాబోతున్నది. ఇచ్ఛామాత్రంచేత ఏ వస్తువు కావాలంటే అది సృష్టించగల శక్తీ, ఔషధముల ప్రమేయం లేకుండానే వ్యాధి నివారణచేయుగల శక్తీ, వ్యాధిని కలిగించే శక్తీ, కలిగిన యోగులు ఎక్కడబడితే అక్కడే కనిపిస్తున్నారు. ఒకప్పుడు, ఇటువంటివా రున్నారంటే అల్లా అన్నవారు అపహాసం పాలయ్యేవారు. ఇప్పుడల్లాకాదు. రసాయనికవిజ్ఞానము, అణు విజ్ఞానము, విద్యుచ్ఛాస్త్ర పరిజ్ఞానమూ, జీవకణ కార్యక్రమమునే కాదు, అన్ని విచిత్ర సంఘటనలను కూడా కొంతవరకైనా అర్థంచేసుకుంటానికి ఉపయోగిస్తవి. అణువిజ్ఞానం భారతదేశంలో అతి పురాతనమైన విజ్ఞానం. అణువును విడగొట్టే సాధనములు వారికి లేవు. వారు అణువిజ్ఞానమును యోగశక్తిచేతనే గ్రహించారు. అణువిచ్ఛేదం ఇప్పుడు కొన్ని సాధనములచేత ప్రయోగరీత్యా నిర్ధారితమై, అందరిచేత విశ్వసించబడుతున్నది. అణువుతో ఏటంబాంబు చేస్తారనీ అది పగిలితే, నగరాలకు నగరాలే పేలిపోతవనీ తెలియనివారు లేరు. కాని అణువును కళ్లారా చూచినవారు ఎంతమంది ? తమ ఇంద్రియములద్వారా తెలుసుకున్నదానినిమాత్రమే మానవులు నిజమని విశ్వసిస్తారు. ఒకప్పుడు మహాయోగులకు మాత్రమే సాధ్యమైన అణువిజ్ఞానం, ఆధునిక విజ్ఞానం ధర్మమా అని, అందరికీ అర్థమయిన విజ్ఞానంగా మారిపోయింది.

ఆహారపదార్థములు, ఔషధములు, క్రిమిసంజనితములయిన విషయములు, ఇతర రసాయనిక వస్తువులు, శరీరధాతువులలోకి ఎల్లా పోతవి. శరీరంలోకి పోయినవన్నీ జీవధాతువులలోకి పోతవా? ఈ విషయములు తెలుసుకోడం చాలా కష్టసాధ్యమయిన విషయమే. కాని వాటిని తెలుసుకోడం ఈశ్వరవిలాసాన్ని, ఈశ్వరశక్తినే తెలుసుకోడంవంటిది. అది తెలుసుకున్ననాడు ఆ సృష్టిశక్తి విజ్ఞానంముందు మన విజ్ఞానం ఏపాటిది ? అనిపిస్తుంది. అంతేకాదు. ఆ విషయములు తెలుసుకోడం ఆధునికజీవితంలో చాలా సహాకరిస్తుంది.

టిష్యూఫ్లూయిడ్‌లో వున్న వస్తువులు జీవకణం పైపొరలో ఉన్న రంధ్రములద్వారా జీవకణంలోకీ, అక్కడ తయారయిన వస్తువులు జీవకణం వెలుపలకూ వస్తూవుంటవనీ, జీవకణంలో ధాతుసృష్టి ధాతులయమూ రెండూ జరుగుతూ ఉంటవని, యిదివరకే తెలుసుకున్నాము. అయితే ఈ రాకడా పోకడా ఇల్లు కడిగినప్పుడు తూములో నించి మురికినీరు పోయినట్లుగా పోవడం అందులో నుంచి ఎలుకలు లోపలికి వచ్చినట్లుగా రావడం వంటిదా ? అయితే కొన్నివస్తువులు లోపలికి పోలేక పోవడానికి కారణమేమిటి ? ఈ విషయం తెలుసుకుంటానికి ముందు కొన్ని వైజ్ఞానిక సత్యములు తెలుసుకోవాలి.

స్థూలంగా సృష్టిలో వస్తువు (Matter) అన్నింటికీ మూడు స్థితులు ఉంటవి. (1) ఘనస్థితి (Solid) (2) ద్రవస్థితి (Liquid), (3) వాయుస్థితి (Gas) నీరు వేడిచేస్తే ఆవిరి అవుతుంది. అది మరీ చల్లబడితే మంచు అవుతుంది. వేసవిలో కరగిఉండే నేయి శీతాకాలంలో పేరుకుంటుంది. మళ్లీ వేడిచేస్తే కరుగుతుంది. ఇల్లా ఉష్ణస్థితినిబట్టి వస్తువులు—అది నీరైనా, లోహములయినా, రాళ్లయినా—తమ స్థితిని మార్చుకొంటవి. కొన్నివస్తువులు స్థితితోపాటు తమ రసాయనిక స్వరూపాన్నికూడా మార్చుకుని మళ్లీ చలవచేసినప్పుడు పూర్వస్థితిని పొందవు. అప్పుడా వికృతిని రసాయనిక వికృతి అంటారు. మళ్లీ పూర్వస్థితిని పొందే వికృతిని భౌతికవికృతి అంటారు. ఈ స్థితి మార్పుకు కారణమేమిటి ?

ఒక గాజుగ్లాసులో నీటిని చూస్తే దాని మధ్య ఖాళీప్రదేశము లున్నట్లే మనకు కనిపించవు. కాని అందులో పంచదార వేస్తే కరిగిపోతుంది. ఇసకవేస్తే కరగదు. ఎందుచేత ?

పంచదారకణములు కణములుగానే కనిపిస్తవి. ఆ కణములమధ్య ఖాళీప్రదేశములు కూడా జాగ్రత్తగా చూస్తే కనిపిస్తవి. అదే మెత్తగా నూరినప్పుడు ఆ ఖాళీ ప్రదేశములుగానీ, ఆ కణములుగానీ కనుపించవు. అంటే వస్తువులో కణములు చిన్నవయినకొద్దీ, వాటినిగానీ, వాటి మధ్య ఖాళీలుగానీ చూడడం కష్టం. కాని భూతద్దం పెట్టి వాటిని చూడవచ్చు. అవిచ్ఛిన్నంగా (Continuous) కనుపించే నీరుకూడా, మన కంటికందని, కోటానుకోట్ల నీటికణముల సమూహము, అంటే ఆ నీటికణములు, విచ్ఛిన్నములు. వాటిమధ్య ఖాళీప్రదేశములు ఉన్నవి. పంచదారకణములూ అంతే. అన్ని వస్తుకణములూ ఒకే పరిమాణం కలవి కావు. కొన్ని కణములు చాలా చిన్నవి. ఒకవస్తువులో కణముల మధ్య వుండే ఖాళీకంటె చిన్నదయిన కణములుగల వస్తువు అందులో వడ్డప్పుడు అందులో కరిగిపోతుంది. కరిగిన వస్తుపరిమాణము కరిగించుకున్న వస్తుకణముల మధ్యఉండే ఖాళీప్రదేశముల ఘనపరిమాణంకంటె అధికం కానప్పుడు ఆ రెండూ చేరి ఏర్పడిన నూతన వస్తువు ఘనపరిమాణం పెరగదు. ఒకవస్తువు మరొక వస్తువులో కరగడమును "విలీనము" అంటారు. ఆ విలీనంవల్ల ఏర్పడిన వస్తువును "ద్రావణము" అంటారు. ఒకపరిమాణంలో మరొకవస్తువు ఎంత పరిమాణంలో కరుగుతుందో, ఆ గుణమును "ద్రావణీయత" అంటారు. టిష్యూఫ్లూయిడ్ అనేకవస్తువులు కరిగి ఏర్పడిన ద్రావణము.

అన్ని వస్తువులూ అన్ని ద్రవపదార్థములలోనూ సమానంగా కరగవు. కొన్ని పైన తేలుతూ ఉంటవి. కొన్ని అడుగున పేరుకుంటవి. కాని కొన్నివస్తువులు ద్రవపదార్థములలో కరగకపోయినా, వాటిలో సమవిస్తృతములై, సమవ్యాప్తి పొందుతవి. దేహద్రవములలో కొన్నివస్తువులు ఈవిధంగా ఉంటవి. వీటిని నీటిలో కరిగిన తుమ్మబంకతో పోల్చవచ్చును. వీటిని కొల్లాయిడ్సు అంటారు. మరికొన్ని వస్తువులు స్వతహా ఒకదానితో ఒకటి కలవవు. కాని వాటినే కలిపి, చిలికినప్పుడు కలిసినట్లు కనుపిస్తవి. ఆముదము, పాలూ కలిపి చిలికితే నవనీతము ఇల్లాగే ఏర్పడుతుంది. వీటిని "ఎముల్షన్" అంటారు. పాలు, మజ్జిగ ఇటువంటివి.

సారాయము నీరూ కలిపితే ఒకదానితో ఒకటి కలిసిపోతవి. కాని అల్లా కలిసిన మిశ్రమ వస్తువు పరిమాణము ఆ రెంటిపరిమాణములకన్న తక్కువగా ఉంటుంది!

ఈ లక్షణము ఒక్క ద్రవపదార్థములకు మాత్రమే ఉండదు. ఎక్కడో పువ్వు వికసించినా, ఊదువత్తి వెలిగించినా, తిరగమూత వేసినా ఆ సువాసన మనకు తెలుస్తుంది. అల్లాగా ఏదైనా కుళ్లినప్పుడు ఆ దుర్గంధమూ తెలుస్తుంది. ఇందుకు కారణం వాయువులు ఒకదానిలో ఒకటి వ్యాపించగలిగిన శక్తీ, లక్షణమూ కలిగిఉండడమే.

ఈ లక్షణమే కొద్దిగా ఘనపదార్థములకూ ఉంటుంది. ఒక బంగారము కడ్డీని వెండికడ్డీపై

—43 వ పేజీ చూడండి

పామాలివ్ సౌందర్య రక్షణ

# మీ దేహకాంతికి క్రొత్త శోభనిస్తుంది!

మీ దేహకాంతికి క్రొత్త శోభను చేకూర్చుకో గలరు.పామాలివ్ సౌందర్యరక్షణతో దానిని ఎంతో మృదువుగా, తాజాగా ఉంచుకోండి

మొదటి రోజు నుండే, పామాలివ్ సౌందర్య రక్షణ మీ దేహకాంతికి క్రొత్త శోభను యిస్తుంది. భారత దేశపు అపూర్వమగు సౌందర్య పోషక తైలములు చేరిన పామాలివ్ సబ్బు ఎంతో సౌమ్యమైనది మరియు శుద్ధమైనది. దాని సమృద్ధియగు మీగడ వంటి నురుగు ఎంతో శుభ్రపరచి, మీకు క్రొత్త శోభను చేకూరుస్తుంది. సౌందర్య పోషక తైలములు చేరిన పామాలివ్ సబ్బునే ఎల్లప్పుడూ వాడి చిన్న చిన్న కళంకములు చాల తక్కువగుట, ఎక్కువ మృదుత్వము, మరియు నునుపు, తాజాయైన మరియు నిర్మలమైన చర్మము, ఎక్కువ శోభాయమానమైన అందమగు దేహకాంతి మొదలైన వర్చస్సులో కలిగే అభివృద్ధిని మీరు చూడగలరు!



భారతదేశపు అపూర్వమగు సౌందర్య పోషక తైలములతో తయారైనది!






పూర్తిగా సౌందర్యముగా కనపడుటకు పామాలివ్ సబ్బుతో స్నానము చేయండి!


ఇప్పుడప్పుడే టికెట్లు ఇచ్చే లా లేరు. ఈ గా కాస్త కాసే ఆగొద్దాం
BOOKING
మిస్టర్ క్యూ లాంటి మష్యలో వెళ్ళిపోతేమ ఖ్వానోయం పైగాఖా చూడు నిమిషాయే అను మాలు కట్టు కోలేరు


ఫర్వాలేదులెండి మీ చొక్కా భుజం మీద పెన్సిల్తో అనుమాలు పెట్టుకున్నాను లెండి
సత్యమూర్తి



డాక్టర్ మూర్తి ఈజీచెయిర్‌లో కూర్చున్నాడు. తను ఆ పల్లెకువచ్చి సరిగ్గా సంవత్సరం అయింది. ఈలోగా ఎంతో నేర్చుకున్నాడు. బీదరికమూ, నిరక్షరాస్యతా పీక్కుతింటున్న పల్లెటూళ్లు ఎన్నాళ్ళిలా బాగుచేస్తే నవనాగరీకులతో సమానంగా వృద్ధిచెందుతాయి? సంప్రదాయాలూ, మూఢనమ్మకాలూ, జాతరలూ ఇంకా వీళ్ళ మనసుల్లో వదలకుండా వున్నాయి. తుడిచినకొద్దీ బూజు పడుతూంది.

తను గతంగూర్చి చింతించటంలేదు. లాంగ్‌ఫెలో అన్నట్లు గతాన్ని గతంలోనే పూడ్చిపెట్టాడు. భవిష్యత్ తెలియని అగాధం. కన్పించని కాంతి. ప్రస్తుతం వర్తమానంలోనే శాంతి......

సిగరెట్ వెలిగించి, అగ్గిపుల్ల పారేశాడు. ఆరిపోయిన పుల్లనుంచి ఇంకా కొంచం పొగ వస్తూ వుంది. గతంలోంచి వ్యక్తులూ, సంఘటనలూ అప్పుడప్పుడూ వర్తమానంలోకి ఉబికినట్లు....

చిన్ని కాబోలు పాట పాడుతూ అంట్లు తోముతూంది. మొదటిసారిగా తనా వూరు వచ్చినప్పుడు మునసబు నాయుడుగారు తన్ను రోడ్డు ప్రక్కన బస్సు ఆగగానే కలిశారు. వెనకాల అతని పాలేరు, తోటమాలి వగైరా వెంకన్న, కరణంగారూ కన్పించారు.

తను "కుటుంబంతో సహా" రాలేదని మొదటనే చెప్పుకున్నాడు తను....మునసబుగారు నవ్వారు. "అయితే మరీ మంచిది.... మా చిన్నోడికి తోటలో గదివుంది. దాంట్లో వుండండి" అన్నాడు నాయుడుగారు—తాను ఎంతో ప్రయత్నం చేశాడు. ఎవరికీ ఋణపడకూడ దిక్కడ....గ్రామాల్లో 'పార్టీలు' తనకి తెలీనివిగావు....

"మీరేందో ఆలోచిస్తావుండారు .... మావూళ్లో పార్టీలేంలేవులెండి.....మీకేమీ భయంలేదు....గదిలో వుండండి....వేళకి ఇంటికాడ్నుంచి కారియర్ పంపుతారు....తినండి...." అన్నాడు మునసబు నాయుడు. తను ఒప్పుకున్నాడు.

తను ఊళ్లో డిస్పెన్సరీ తెరిచేశాడు. చుట్టుప్రక్కల దాదాపు నాలుగయిదు చిన్న చిన్న గూడేలు, పల్లెలు ఉన్నాయి. ప్రొద్దున్నే తయారయేవాళ్ళు అందరూ....పండ్రెండు గంటలదాకా చేయి తీరేది కాదు. ఒంటిగంటకు ఇంటికొచ్చేసరికి క్యారియర్ పెట్టుకుని కూర్చునివుండేది చిన్ని....

చిన్ని .... నవ్వుకున్నాడు మూర్తి. ప్రపంచంలో ఎవరికయినా వా అన్న వాళ్ళెవరో ఒకరుంటారు.... చిన్నికి మాత్రం లేరు....అది ఎవరిబిడ్డో తెలీదు. నాయుడిగారిదగ్గర కమతంతో తిరుగుతూ వుండింది. పదహారేళ్ళుంటాయి. ఇంకా చలాకీగా అటూ, ఇటూ తిరుగుతూ, తనకు సహాయం చేస్తూ వుంటుంది. తోటలో తన గదికి కొంచెందూరంగా దాని గుడిసె.

ఈ సంవత్సరంలో తనకు దాంతో బాగా పరిచయం ఏర్పడింది. అమాయకత్వం చిన్ని గుణం....

"ఈ ప్రపంచంలో నీలాటివాళ్ళు బ్రతకలేరు" అనుకున్నాడు మూర్తి చిన్నిని చూసి.

నాయుడిగారి పాలేరు వెంకన్న దానికి కాబోయే మొగుడు.

"ఏమే చిన్నీ! వెంకన్నేడీ?" అని అడిగేవాడు తను నవ్వుతూ.

"వాడేడ బీడీలు దాగుతున్నాడో" అనేది సిగ్గుపడుతూ.

వెంకన్నకు ప్రాణం అది. వాడు తోటకు మాలి.... పొలాల్లో దున్నడాలూ, నాటడాలూ, ఊర్పుఅంతా వాడి చేతిమీద జరగాల్సిందే. ఇరవయ్యేళ్ళులేని వెంకన్నంటే నాయుడికి చాలా ఇష్టం .... నాయుడిగారి

—39 వ పేజీ చూడండి

# హాయవాతా అద్భుతగాథ

మూలం: లాంగ్ ఫెలో : : అనుసరణ: పి. గణపతిశాస్త్రి

(గత సంచిక తరవాయి)

నీటిలో మునిగిన వెనోనా నెమ్మదిగా తల పైకెత్తి తల్లి వెళ్లిపోయిన సంగతి పసికట్టింది. ఒడ్డుమీదికి వచ్చి సాయంకాలం నీరెండలో తడిసి ముద్దయిన తన రంగు రంగుల దుస్తులు ఆరబెట్టుకుంది. కొంచెం దూరంలో కొండలమధ్య అల్లిబిల్లిగా అల్లుకున్న పూల తీగల కేసి చూచింది. 'అమ్మయ్యా! అమ్మ బెడద తప్పిపోయింది. ఇంక హాయిగా తీగ ఉయ్యాల ఊగ వచ్చును!' అని ఎగిరి గంతేసింది. చెంగుచెంగున ఎగురుతూ ఆ కొండల మధ్య ఉన్న అడివిలోకి వెళ్లి పోయింది. కొన్ని అడివి మల్లె పువ్వులు కోసుకుని సిగలో తురుముకుంది. బండిగురువిందల దండలు గుచ్చి మెడలో వేసుకుంది.

అల్లంతదూరంలో ఆమె కెదురుగా ఒక బంగారు నెమలి పురి విప్పి ఆడింది. వెనోనా అంతకు ముందెప్పుడు పైడిరంగు నెమలిని చూడలేదు. 'ఇదేమిటీ విచిత్రం!' అని కళ్లప్పగించి అలాగే దానివైపే చూస్తూ కూర్చుంది. అంతలోనే దట్టంగా అల్లుకున్న ఆకులలో నించి 'వెనోనా! వెనోనా!' అని సన్నని పిలుపు వినిపించింది. వెనోనా గిరుక్కున వెనక్కి తిరిగి చూచింది. ఎవ్వరు కనబడలేదు! అంతలోనే ఆమె కెదురుగా ఆడుతున్న నెమలి అకస్మాత్తుగా మాయమయింది. వెనోనా కొంచెం భయపడి అటు ఇటు పరకాయించి చూసింది. కాని ఎక్కడ ఆ బంగారు నెమలి జాడే కనపడలేదు!

అంతలోనే వెదురు పొదలలో నించి పిల్లనగ్రోవి ఊదినట్టు 'వెనోనా!' అని ఇంకొకపిలుపు వినబడింది. వెనోనా వెనక్కి తిరిగి చూసి మరి తన కళ్లే నమ్మలేక పోయింది! ఆమె కెదురుగా ఒక అందగాడు నిలుచున్నాడు. చూడడానికి అతడొక గొర్రెల కాపరిలా ఉన్నాడు. కాని తెల్లని పిల్లమబ్బు దుప్పటీ కప్పుకున్నాడు. మెడలో నక్షత్రాల ముత్యాలహారం మినుకు మినుకుమని మెరుస్తూంది. తలకొక చిన్నారినల్లమబ్బు తలపాగా అలంకరించుకొన్నాడు. దానిమీద ఒక చిన్న ఇంద్రధనుస్సు! అతని శరీరం సాయంకాలం కావిరంగులా తళతళా మెరిసింది. పిల్లనగ్రోవి పెదవుల మీద నిలిపి తీయతీయని పాట పాడుతున్నాడు.

వెనోనా కొంచెం భయపడి 'ఎవ్వరు నువ్వు?' అని గద్దించింది. ఆ అందగాడు మాటాడలేదు. చిన్న చిరునవ్వు చిలకరించాడు:

'నే నెవరయితే ఏంగాని నీకో చక్కనికథ చెబుతాను వింటావా!'

'ఏమిటా కథ!'

'వింటానంటే చెబుతాను.'

'అలాగే వింటానుగాని ముందు నువ్వెవరో నీ పేరేమిటో చెప్పు!'

'నాపేరు పడమటిగాలి.'

'అమ్మో! మా అమ్మ నీతో కలిసి తిరగ వద్దంది. నీ కథలు విన వద్దంది.'

పడమటిగాలి కొంచెం సేపాలోచించి మళ్ళీ అడిగాడు: 'పోనీ! కథ అక్కర లేకపోతే మిగల ముగ్గిన ద్రాక్షపళ్ల గుత్తులు, పుట్ట తేనెపట్టు ఇస్తాను. ఆపైన మళ్లీ ఆ బంగారు నెమలి నృత్యం చూద్దువుగాని నాతో వస్తావా?"

'ఆ బంగారు నెమలి ఎక్కడ ఉంది?'

'ఈ అడివి మధ్యన ఒక కోనేరుంది. దాని గట్టుమీదఉన్న చెట్టు కొమ్మల్లో పడుకుని హాయిగా నిద్ర పోతూంది. అదిగో! చూశావా! అదే ఆ కోనేటిగట్టు! ఇక్కడికి అట్టే దూరంలేదు.'

వెనోనా కొంచంసేపు తటపటాయించింది. 'నేను తొందర తొందరగా తిరిగి ఇంటికి వెళ్లిపోవాలి మరి' అని అంటూనే పడమటిగాలి వెంటపడింది. ఇద్దరు నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ వెళ్లి ఆ కోనేటి గట్టుమీద కూర్చున్నారు. అంతలోనే పడమటిగాలి లేచి నిలబడి అటు ఇటు చూచి ఒకచోట దాచి పెట్టిన పుట్ట తేనెపట్టు, మిగల ముగ్గిన ద్రాక్షపళ్ల గుత్తులు తెచ్చి ఆమె కందీయబోయాడు.

'ఇవి నా కక్కరలేదు! ఆ బంగారు నెమలి ఏదీ?' అని బుంగమూతిపెట్టి అడిగింది వెనోనా!

'ఈ పళ్లు, పుట్టతేనె కొంచెం

—38 వ పేజీ చూడండి




దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

**11-5-1962 శుక్రవారము మొదలు**
**17-5-1962 గురువారము వరకు**

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

తిరుబాటు లేకుండా మీ కార్యక్రమాలతో మీరు క్రిందు మీదు అవుతూవుంటే, ఉపయోగంలేని మాటలతో విసిగించేవారు తటస్థపడతారు. తప్పనిసరి పరిస్థితి ఏర్పడితేగాని, ఏ ప్రయత్నము కొనసాగించలేకపోతారు. ప్రయాణాలు, పెద్దమనుష్యులను సంప్రదించటం, ధర్మ దైవికకార్యాలలో ప్రవేశించటం మొదలయినవాటిలో మీ సంకల్పం చక్కగా కొనసాగుతుంది. ఒకరిద్దరు స్నేహితులు మీవల్ల చిక్కులనుంచి తప్పించుకొంటారు. కాని, సమయంలో నిర్లక్ష్యంగా మాట్లాడతారు. మీ ఆదాయం మొదట్లో మాంద్యంగా కనుపించినా, వారం మధ్యభాగంనుంచి క్రమక్రమంగా అభివృద్ధి అవుతుంది. కుటుంబ బాధ్యతలు పెరిగే సమయం. విలాస, వినోదాలలో అధికంగా ఖర్చుచేయటంవల్ల ముఖ్యావసరాలకు శ్రమపడవలసి వస్తుంది.

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

మర్యాద అనేపేరుతో భారం పెంచుకొనటం అవుతుంది. సమయానికి తగినట్లు యోచించి మాట్లాడగలుగుతారు. చాలాకాలంగా శ్రమించి, ఎదురుచూస్తున్న ఫలితం సంతృప్తికరంగా లభిస్తుంది. ఇష్టవస్తు ప్రాప్తికాలము. బంధు మిత్రుల ఇండ్లకు ప్రయాణం చేయగలుగుతారు. మీ విద్యను అభివృద్ధిపరచుకొనటానికి అనువైన సమయం. ధనం విశేషం వ్యయంకాకుండా పేరు ప్రతిష్ఠలను పొందగలుగుతారు. ఇతరులను గురించి శ్రద్ధ తీసుకొంటారు. కాని, స్వవిషయంలో కొన్ని సమయాలలో అజాగ్రత్తగా ఉండటం జరుగుతుంది. కలహప్రసంగాలు ఆరంభంఅయి, చల్లగా సమసిపోతవి. మీ వ్యవహారాలు, లెక్కలు మొదలయినవానిలో గుట్టు అనేది అవసరం. 13, 14 తేదీలలో మిత్రలాభం, గౌరవప్రాప్తి.

**గ్రహస్థితి**

మేష, వృషభాలలో సూర్యుడు, వృషభంలో బుధ, శుక్రులు, కర్కాటకంలో రాహువు, మకరంలో శని కేతువులు, కుంభంలో గురువు, మీనంలో అంగారకుడు, కర్కాటక, సింహ, కన్య, తులలలో చంద్రుడు.

* * *

### మిథునం :

**(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఒకరిని నొప్పించకుండా, మీరు శ్రమపడకుండా చల్లగా మీ భావాలను నెరవేర్చుకోగలుగుతారు. ఆరోగ్యంవిషయంలోమాత్రం మధ్య మధ్య అసంతృప్తికలిగే అవకాశాలున్నవి. సాధ్యమైనంతవరకు ఏ వ్యవహారంలోనైనా తెగేవరకూ బిగించినట్లు కాకుండా చూచుకొనండి. ఇతరులవద్దనుంచి రావలసిన ధనంకోసం కొంత శ్రమపడి సంపాదించుకోగలుగుతారు. ఎదటివారి మెచ్చికోలుమాటలను నమ్ముకుని శక్తికిమించిన వ్యవహారాలలో అడుగుపెట్టతగిన సమయంకాదు. వారం రెండవభాగంలో ఆదాయం బాగా పెరుగుతుంది. పిల్లలమూలంగా సుఖసంతోషాలు లభిస్తవి. దేవునిదయవల్ల మీ వాక్కు ఎదటివారికి అమోఘంగా పని చేస్తుంది. మానసికంగా ఏర్పడిన సందిగ్ధస్థితి తొలగిపోతుంది.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)**

ప్రతిదానికి ముందుగా ఆలోచించుకొంటూ, కూర్చొనవలసిన అవసరం ఉండదు. మీ విరోధులు మీమీద ఏవిధంగాను తప్పు మోపడానికి అవకాశం లేకుండా ముందుగా జాగ్రత్తపడగలుగుతారు. కుటుంబంలోనివారి మరికొన్ని బాధ్యతలనుకూడా మీరే నిర్వహించవలసిన అవసరం కలుగుతుంది. అయినా శక్తి, ఉత్సాహము బాగా ఉంటవి. ఇంతకుముందు మీ వృత్తి, ఉద్యోగాలలో ప్రతిబంధకంగా ఉంటున్న వ్యక్తులు చల్లగా తొలగిపోతారు. వ్యవహారరంగంలో ముందుగా ప్రతికూలభావాలు తోచగలవు. దైవికంగా కార్య సాఫల్యం అవుతుంది. మీరుచేస్తూన్న అన్నిరకాల పనులకు సమన్వయం కుదరక చికాకు కలుగుతుంది. అయితే చివరి సమయంలో చక్కని ప్లాను తయారుచేయగలుతారు. 16, 17 తేదీలలో అధిక ఆలోచనలు గౌరవంతోకూడిన ఖర్చులు.

* * *

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

సుఖప్రదమైనకాలం. వ్యవహారరంగంలో మీ ప్రయత్నాలు కలసివస్తవి. అయితే మీ ధైర్యాన్ని చెడగొట్టే మనుష్యులు ఉంటారు. ఇతరులకు ఆలోచన అడగటంవల్ల ప్రతిబంధకాలు వస్తూ ఉంటవి. కుటుంబంలో మనశ్శాంతి లభిస్తుంది. ఆదాయం కూడా ముందుకన్నా బాగుంటుంది. సంఘ కార్యాలలో మీ గౌరవం క్రమంగా పెరుగుతుంది. ప్రస్తుతం

ధనాదాయమార్గాలలో చిన్నచిన్న అభ్యంతరాలు వస్తూఉంటవి. వారం రెండవభాగంలో వృధా కలహాలు వచ్చే అవకాశాలున్నవి. ధనసంబంధమైన లావాదేవీలలో ఎదటివారు తమ మాటను కాపాడుకొనక పోవటంవల్ల ఇబ్బందిపడవలసి వస్తుంది. ప్రయాణాలు చేయవలయుననుకొంటారు. కాని, సాగే అవకాశాలు తక్కువ. 11, 12 తేదులలో మంచి వారితో స్నేహం, నూతన మార్గాలలో ఆదాయం.

* * *

## కన్య:

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

మీరు మాట రాకుండా కాపాడుకొందామని ఎంత ప్రయత్నించినా, మధ్యలో ఎవరో ఒకరు జోక్యం కలిగించుకొని మీ ప్రశాంతతకు భంగం కలిగిస్తూ ఉంటారు. ఏ ఒక్క కార్యంమీద మనస్సును స్థిరంగా నిలపలేకపోతారు. దైవానుగ్రహంవల్ల పేరుప్రతిష్ఠలకు భంగంరాకుండా చూచుకోగలుగుతారు. వృత్తి, వ్యాపారాలలో ఆలస్యం, శక్తికిమించిన శ్రమ కనుపిస్తవి. కాని, అందువల్ల మీ స్థానంయొక్క విలువ పెరుగుతుంది. అధికారుల మంచితనం పొందగల అవకాశాలున్నవి. వారాంతంలో ప్రతికూలవార్తలు తెలియగలవు. అందువల్ల ప్రత్యేకంగా కలిగే గౌరవ భంగంకాని, ఇతర చిక్కులుకాని ఏమీ ఉండవు. పిల్లల ఆరోగ్యంగురించి జాగ్రత్తగా చూచుకొనండి.

* * *

## తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

అన్నివిధాలా గౌరవప్రదమైన కాలమేకాని, విశ్రాంతి సుఖము బాగా లోపిస్తవి. ధారాళంగా వచ్చే డబ్బు వస్తూఉంటుంది. ఖర్చు అయ్యేది అవుతూ ఉంటుంది. మొత్తంమీద శుభసంతోషాలతో కాలం జరుగుతూ ఉంటుంది. వ్యవహారసంబంధమైన పనులు నిదానంగా జరుగుతూఉంటవి. ఏపని తలపెట్టినా అందుకు కావలసిన సర్వసన్నాహాలు చేసుకొని అందులో ప్రవేశించటం అవసరం. సాధారణంగా ముందుగా ఇతరులకు ఇచ్చిన వాగ్దానాలను మార్గం తప్పించవలసిన అవసరం కలిగే సమయం. గ్రంథపఠనము, లలితకళలకు సంబంధించిన కార్యక్రమాలలో ప్రోత్సాహం, మంచి అవకాశముకూడా లభిస్తవి. ఎప్పుడూ పదిమందిలో విలాస వినోదాలతో గడుపగలుగుతారు.

* * *

## వృశ్చికం :

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

గ్రహబలం బాగున్నది. మీచుట్టు ఉంటున్న మనుష్యులలో ఒకరిద్దరు మీ మాటను నిర్లక్ష్యంగా చూడటంవల్ల కలహాలు వస్తవి. కాని మధ్యవర్తులతో నిమిత్తం లేకుండా మీ వ్యవహారాలను ఒకదారికి తీసుకొని రాగలుగుతారు. అందుకు ఎక్కువ శ్రమపడవలసి వస్తుంది. అనారోగ్యభయం తొలగిపోతుంది. వ్యాపారవిషయాలలో స్వశక్తితో ఫలితం పొందగలుగుతారు. కుటుంబంలో మీమాటయందు నలుగురు గౌరవం చూపిస్తారు. ఒకప్పుడు మీతో భేదాభిప్రాయం పెట్టుకున్న మనుష్యులే ఈ సమయంలో అనుకూలిస్తారు. శుభ సంతోషకార్యాలు నెమ్మదిగా జరుగుతవి. ధనవ్యయం మాత్రం అధికంగా ఉంటుంది. ధైర్యంతో ముందుకుపోతగిన సమయం. 13, 14 తేదులలో శుభవార్తలు, సంఘ కార్యాలు.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ముందు జాగ్రత్తతో మీ కార్యక్రమాలను సాగించవలసిన సమయం. మీమాటలలో తప్పులు వెతకటానికి ప్రయత్నించేవారు ఉంటారు. అధికారులతో ఏ విషయంలోను ప్రసంగాలు పెంచుకొనటం మంచిదికాదు. వృత్తిలో డబ్బు ఇచ్చినచోటా, పుచ్చుకొన్నచోటకూడా మీరే శ్రమపడవలసి వస్తుంది. పైపెచ్చు నలుగురిలో మీరే పొరపాటు చేస్తున్నారనే భావం కలిగే అవకాశాలున్నవి. చాలారోజులనుంచి ఎదురుచూస్తున్న వార్తలు ఈ సమయంలో వస్తవి. ప్రయాణాలు సుఖంగా సాగించగలుగుతారు. ముఖ్యంగా చెప్పుకోతగిన గొప్ప గొప్ప వ్యాపారములవంటివాటిలో ప్రవేశించే ఆలోచనలు అనుకూలిస్తవి. 16, 17 తేదులలో సంఘంలో గౌరవం, బంధువులవల్ల కార్యసిద్ధి. విలాస సంబంధమైన ఖర్చులు.

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

అన్నీ జరిగినట్లే ఉంటవి. ఎక్కడికక్కడ అసంపూర్తి కనుపిస్తూఉంటుంది. ఆదాయం బాగానే ఉంటుంది. అయితే ఒకసారిగా, సమయంలో అందక పోవటంవల్ల చికాకు తప్పదు. గొప్పవారితో స్నేహం లభిస్తుంది. కోర్టు కచేరీలలో పనులు చురుకుగా జరుగలేదని అనుకోవలసిన సమయంకాదు. వృత్తిలో పోటీ కనుపిస్తున్నా, మొత్తంమీద సమర్థతతో ఇతరులకు యిచ్చిన వాగ్దానాలను పూర్తిచేసుకోగలుగుతారు. అయితే అనారోగ్యం మాత్రం చేస్తుంది. ఉత్తరదిక్కునుంచి అసంతృప్తికరమైన వార్తలు తెలుస్తవి. ప్రాలుమాలికవల్ల తలచినపని సమయంలో చేయలేకపోతారు. 15, 16 తేదులలో శుభకార్యాలు, ఆదాయవృద్ధి.

## ఈ వారము ధరలు

ఈవారం బంగారుధర మందీ వస్తుంది. వారం చివరలో పెరుగుదల రాగలదు. వెండిధర గతవారంమాదిరిగానే ఉంటుంది. వెన్న, నెయ్యి వీటిధరలలో కొద్ది పెరుగుదల కనుపిస్తుంది. ప్రత్తి, నూలు ధరలు తేజీలో నిలకడగా ఉంటవి. నూనెగింజల ధరలలో పెద్దమార్పు ఏమీ ఉండదు. చింతపండుధర గతవారంకన్నా తేజీ వస్తుంది. గోధుమలకు మందీ వస్తుంది. మినుములకు తాత్కాలికంగా గిరాకీ వస్తుంది.

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

అనుకున్నపని పూర్తిగా జరిగేవరకూ కంగారు పడుతుంటారు. ప్రస్తుతం ఏ సందర్భంలోను చిక్కు ఏమీ ఉండదు. వృత్తిలో మిమ్ములను ఆదరించి మీ పనులలో సహాయచెప్పేవారు లభిస్తారు. ప్రయాణాలు చేస్తారు. సుఖ సంతోషాల నిమిత్తం ఖర్చులు అధికం అవుతవి. సాధారణంగా మీరు తలపెట్టిన పనులకు భంగం అనేది ఉండదు. ఓర్పు మాత్రం అవసరం. పిల్లలమూలంగా ఆనందం లభిస్తుంది. కోర్టుకచేరీలలో ఏపనీ చురుకుగా సాగదు. అయితే విరుద్ధమైన కాలంకాదు. ఇతరుల కలహాలలో జోక్యం పెట్టుకోతగిన సమయంకాదు. వాహనాలు మొదలయినవి కొనే ప్రయత్నాలు కలిసి వస్తవి. దైవకార్యాలు అనుకూలిస్తవి. వారాంతంలో మీ ఆరోగ్యం చెడే అవకాశాలున్నవి.

* * *

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

విసుగుచెందకుండా కృషిచేస్తూ పోవలసిన సమయం. ప్రత్యక్షంలో మాటలు ఎన్ని అనుకొన్నా, మీ స్వంత విషయాలలో క్రొత్తవారి జోక్యం లేకుండా చేసుకొనటం మంచిది. వృత్తి, వ్యాపారాలలో క్రమక్రమంగా కార్యభారం పెరుగుతుంది. ప్రతి విషయంలోను "పిచ్చి కుదిరితేగాని పెండ్లి కుదరదు, పెండ్లి కుదిరితేగాని పిచ్చి కుదరదు" అనే పద్ధతిలో ఒకదానికొకటి పోటీ ఏర్పడుతుంది. మీకు సహాయం చేయవలసినవారు చేయలేని పరిస్థితిలో ఉంటారు. మొత్తంమీద ఫలితం ఎదురుచూడకుండా ధృఢభావంతో ఉండటం అవసరం. శుభకార్యాలలో పాల్గొంటారు. గతవారం ఏర్పడిన అనారోగ్య దోషాలు తొలగిపోతవి. 15, 16 తేదులలో వ్యవహారజయం, క్షేమవార్తలు.



# డాక్టర్ రాజు

బొమ్మల కథ

దేవిక 24

















## నా ఘనత

నేనెంతో ఘనుడననే
గొప్ప ఎంతో నాకుంది
పలుకుబడి బోలెడుంది
ప్రజ్ఞ ఎంతో నిండి వుంది.

క్లాస్ రూమ్ సింగరనే
పెద్ద పేరు నాకుంది
కింగ్-ఆఫ్-రోడ్స్ అనే
మారుపేరు నాకుంది.

నా కండబలం చూపిస్తా
పిల్లల్ని బెదరిస్తా
కుక్కల్ని ఏడ్పిస్తా
కాకుల్ని తరిమేస్తా.

కోపమే రావాలి గాని
పెదాలు కొరుకుకుంటా
జుట్టుకూడ పీకుకుంటా
నా కెదురానే దెవ్వడంట!

ప్లేటులెన్నో మార్చేస్తా
కూతలెన్నో కూసేస్తా
ఎదురు తిరిగి 'ఎవ్వడంటే?'
'నాకు మాత్రం తెలియదంటా'

రోజంతా తిరుగుతా
క్లాసులన్ని 'ఎగ' గొడతా
పరీక్షలంటే లెక్కలేదు.
కాపీలే రక్ష నాకు.

నే తిరగని రోడ్డు లేదు
నే చదవని నవల లేదు
నే ఆడని పేకాట లేదు
నే కాల్చని సిగరెట్టు లేదు.

'దేవస్సు' అనే బిరుదుంది
'ఫూల్' అనే ప్రజ్ఞ ఉంది
నా ఘనతెరిగిన మా ఫాదర్
'మటన్-దొంగవెధవ!' అని అంటారు.

చూశారా! నా గొప్ప
విన్నారా ఓ! అప్పా
అలాటప్పాగాణ్ణి కాదు మరి
నా గొప్ప ఊహించు మరి!

మూర్తిబాబు, రీవా (మధ్యప్రదేశ్)★

# అపశ్రుతి

ఉద్యోగంతోపాటు ఒక్కటి గదికూడా కుదిర్చి పెట్టాడు రంగనాథం. ఇలాంటి మిత్రుడ్ని సంపాయించడం కేవలం పూర్వజన్మ సుకృతమే మరి! బి. ఏ. పాసయ్యి రెండేళ్ళు నిరుద్యోగంతో విసిగిపోయిన రాజా కింత నీడ చూపించాడు. ఆశ్రయమిప్పించాడు. ఇది చాలదూ తనస్నేహం సార్థకమయ్యిందని చెప్పుకోటానికి.

నాన్న లేడు. లోకులకళ్ళల్లో తమకింత ఆధారంగా పెట్టింత మావయ్య చలామణి అయ్యాడు. ఆయన లౌక్యుడు. పట్లూ, విడుపూ, ఎత్తూ పల్లమూ తెలిసిన వ్యక్తి. ఆయన అంతస్థుకుతగ్గ పరపతి ఉంది. డబ్బుతో, నోటిమాటతో ఆయన చేయలేని పనంటూ ఏదీ లేదు.

అలాంటి మావయ్య స్వార్థానికి కట్టుబడ్డాడు. కాలేజి నాలుగ్గోడలూ దాటిన రాజాకి అమ్మను పోషించాలిసినభారం నెత్తిన పడ్డది. అది తన ధర్మం—తరతరాలనుంచీ వస్తూన్న సాంప్రదాయం. రాజా చదువుతో నెగ్గాడుగాని, జీవితానికి సంబంధించిన పరీక్షకి తలొంచాడు. కాళ్ళరిగేలా తిరిగాడు ఉద్యోగం కోసం. ఖాళీవున్న ప్రతి చిన్న ఉద్యోగానికీ దరఖాస్తు పెట్టుకున్నాడు. ఫలితం శూన్యం.

ఇంత జరుగుతూన్నా చూస్తూ ఊరుకున్నాడే గాని, ఏమీ పట్టించుకోలేదు మావయ్య. ఒకటి రెండుసార్లు అమ్మ అడిగిందికూడాను — వాడికో ఉద్యోగం వేయించరాదూ—అని. చూద్దాంలే అన్నాడు తేలిగ్గా.

ఆయనపథకం వేరు. ఆ పథకంకోసం ఆయన వలపన్ని కాచుక్కూర్చున్నాడు.

జీవితంలో ఓ మలుపుదగ్గిర సమస్య లెదురయ్యాయి రాజాకి. హృదయంలో అశాంతి రగిలింది. నాన్నలేని లోపాన్ని కనిపించకుండా తననింతవాణ్ణిచేసిన అమ్మని పోషించాలి. ఆమెను సుఖపెట్టాల్షి. అప్పుడు తానూ ఓ మనిషనిపించుకోవాలి.

ఉద్యోగం లేదు. ఎందుకూ పనికిరాని డిగ్రీమాత్రం ఉంది. ఈస్థితిలోవున్న రాజాని పడుపుగా తనవైపుకు లాక్కోవాలని ఎదురుచూశాడు మావయ్య. రాజా విషయం తెలిసిగూడా తన ప్రయత్నాన్ని మానలేదాయన.

ఒకరోజు—అంటే రాజా ఈ కాకినాడకు రావటానికి నాలుగురోజులముందు. అమ్మతోపాటు తానూ మావయ్య ఇంటికెళ్ళాడు. అభిమానం చంపుకుని, ఉద్యోగం వేయించమని అడగటానికి.

తనకూతురు కుసుమని చేసుకున్న మరుక్షణంలో చదువుకిమించిన ఉద్యోగం అతనికాళ్ళముందరుంటుందని అన్నాడు.

ఈ పాతపాట అమ్మద్వారా చాలాసార్లు విన్నాడు రాజా. నిరుద్యోగిగానైనా వుంటానుగాని, కుసుమను చేసుకోలేనని—ఒకవేళ పరిస్థితులు తనని వత్తిడి చేసి, తప్పనిసరై కుసుమని తన భార్యగా స్వీకరిస్తే జీవితంలో సుఖం తప్పకుండా దూరమవుతుందని గూడా హెచ్చరించాడు. ఈనాడు ఇదేమాటని మావయ్యముందూ చెప్పక తప్పిందికాదు. మావయ్య ఈమాట వినడంతోనే రెచ్చిపోయాడు. 'నా కూతురుకేం లోపమ'ని అడిగాడు.

కుసుమ కుంటిపిల్ల. దానికి తగ్గట్టు ఆపిల్ల ఏమంత అందంగానూ వుండదు. చూస్తూ చూస్తూ ఇలాంటి అనాకారిని చేసుకోడంకన్నా జీవిత పర్యంతం బ్రహ్మచర్యం అవలంబించడం మంచిదని రాజా ఉద్దేశ్యం. సరిగ్గా ఇలాగే చెప్పలేదుగాని, ఈభావం స్ఫురించేటట్టు జవాబు చెప్పాడు.

ఆయన రుద్రుడయ్యాడు. "నాపిల్ల కుంటిది. అది దేవుడు చేసిందిరా. కాని మీ బుద్ధులూ, మనసులూ అన్నీ కుంటివే. మీ దౌర్భాగ్యాన్ని చాటడానికి రజని ఒక్కర్తిచాలు మచ్చుకి. 'పాండిక్కడ్నుంచి' పెద్ద దెబ్బ కొడవటానికి వచ్చారు కృతఘ్నులు'. అన్నాడు మావయ్య.

రజనిఅక్కయ్య పేరెత్తగానే రాజాలో కోపం పెల్లుబికింది. గుప్పిట్ల బిగించాడు. అతనికళ్ళు ఎర్రపడ్డాయి. పెదాలు వణికాయి. క్షణంలో అక్కడ దారుణం జరిగుండేది. కాని తల్లి అడ్డుపడింది. కొడుకుని వారించింది. అన్నయ్యను చిన్నగా మందలించింది.

"నీకిది తగదన్నయ్యా! ఈరోజు మేమీ స్థితిలో వున్నామనేగా యిలా మాటాడుతున్నావ్. రోజులెప్పుడూ యిలాగే వుంటాయని అనుకోకు. రజని తప్పు చెయ్యలేదని నీకూ తెలుసు. అయినా దాన్ని ఆడిపోసుకుంటున్నావ్. మనందరికీ దూరంగా బ్రతుకుతుంది. మనతో సమ్మంధం ఆనాడె తెంచుకుంది. దానికున్న అభిమానం మాకూవుంటే నీ గుమ్మం తొక్కేవాళ్ళమే కాదసలు. నీ పాడుబుద్ధి పోనిచ్చావు కాదురా అన్నాయ్. ఈనాడు కాపోయినా మరోనాటికైనా రాజాని ఈ పెళ్ళికి ఒప్పించవచ్చు. తొందరపడ్డావ్. చాలీ మర్యాద. పస్తాం. పదరా రాజా!" అన్నది ఆవేశంగా అమ్మ. రజని సంగతి గుర్తొస్తే ఈనాటికీ కంట తడిపెడ్తుంది అమ్మ.

రజని కాలేజీ చదువుతుండగా తన సహపాఠిని ప్రేమించింది. అతనితో తన వివాహం జరిపించమని నాన్నని అడిగింది. ఈ విషయం బంధువులలో చాలామందికి తెలిసింది. ఒక ఆడపిల్ల తెగించి ఫలానా వాడినిచ్చి నాకు పెళ్ళిచెయ్యమ'ని అడగడం వాళ్ళందరికీ నేరంగా తోచింది. పైగా ప్రేమట ప్ర... వల్లకాడు కాదూ—అని హేళన కూడా చేశారు.

రజనిని మందలించేరు నాన్న. ఆమె వి... కాస్త గట్టిగా చెప్పి చూశారు. లాభం లేకపోయి... కన్నెర్రజేశారు. అయినా తన అభిమతాన్ని చం... లేదు అక్కయ్య. ఆయన చేసిన ప్రయత్నా... ఫలించకపోగా విపరీత పరిణామా... తీసి...

నాన్నమాటకెన్నడూ ఎదురు... 'అతన్ని రిజిస్ట్రరు మారేజి చేసు... వి... ఆ పెళ్ళికి పెద్దలు. ఆరోజున అక్కయ్యని ... మంది అభినందించారు. ఇలాంటి ఆదర్శవి... యింకా జరగాలని ఆశిస్తున్నామని గూడా అ...

అక్కయ్యపెళ్ళి తమ కుటుంబంలో ... రేపింది. తండ్రీ, కూతుళ్ళమధ్య అనుబంధం ... పోయింది. అక్కయ్యకి తనింట్లో స్థానంలేదు... నాన్న. అప్పుడు అక్కయ్య నవ్వి అంది—"నా... జరగడంతోనే ఈ ఇంట్లో స్థానం పోగొట్టు... తెలుసు. కనీసం మమ్మల్ని ఆశీర్వదించ...

నాన్న ఛీత్కరించాడు. ఆమె వ... తలుపులు మూశాడు. అక్కయ్య వెళ్ళిపో... మా బ్రతుకేదో మేము బ్రతకగలమని చివరిమ... చెప్పింది ధైర్యంగా.

హైదరాబాద్‌నుంచి రెండు మూడు ఉత్త... రాసింది అక్కయ్య. జవాబు ఇవ్వడం మాట... కాకుండా ఆ ఉత్తరాలని చించి కాల్చి పారేశారు...

ఆ తర్వాత అక్కయ్య గురించిన వి... తెలియలేదు.

రజనిఅక్కయ్య చెప్తూండేది 'నువ్వు ... మంచనిపిస్తే చెయ్యి. పరాయివాళ్ళ ... గానీ, వాళ్ళేమనుకుంటారోనన్న భయ... నిన్ను నువ్వు వంచించుకోడం మంచిదికాదు... అలాంటివ్యక్తిత్వానికి రాజా అంజలి ఘటి... యిప్పటికేను.

తమ కుటుంబంలో ఎన్నో అవాంతరా... వచ్చాయి. నాన్నపోయారు. అక్కయ్య ... సమ్మంధం తెంచుకుంది. బంధువుల్లో ... తమతో మాటాడటానికైనా యిష్టప... ఇన్నింటినీ అమ్మ భరించింది. తనకోసం ... కోసం—అన్నింటినీ మరిచి తన ... కుంది.

అలాంటి అమ్మను సుఖపెట్ట... మయినందుకు రాజా గర్వించా...

మంచిరోజు లొచ్చాయి.

కాకినాడనుంచిరాజామిత్రుడు రంగనాథం జాబురాశాడు.

వాళ్ళ ... అతనిలా!

యవద్వారా ఉద్యోగం వేయిస్తానూ వెంటనే రమ్మని. ఆనాడు రాజా ఆనందానికి అవధుల్లేవు. అమ్మ కళ్ళల్లో ఆనందం తొణికిసలాడటం అతను గమనించాడు తొలిసారిగా.

తను కాకినాడ వచ్చేముందు అమ్మ అన్నది. "నా బాధ్యత తీరింది. నువ్వు ప్రయోజకుడివి అయ్యావు. దేవుడు నీకన్నివిధాలా మేలు చేస్తాడు" అని.

పాపం! ఈనాటికి కొడుకు ప్రయోజకత్త్వం మీద ఆమెకు నమ్మకం కుదిరింది కాబోలు!

—రాజా అమ్మకి ఉత్తరం రాశాడు. ఆ జాబులో రంగనాధం తన కిప్పటివరకూ చేస్తూన్న సహాయాన్నీ, ఆదరణనీ రాశాడు. మరోనెలరోజుల్లో ఆమెను తీసుకెడతానని రాశాడు.

ఉత్తరాన్ని మడిచి, జేబులో పెట్టుకుని టైము చూశాడు. సాయంత్రం అయిదయింది. నాలుగ్గంటలకే వస్తానని మాటయిచ్చిన రంగనాధం ఇంకా రాలేదు.

రంగనాధానికి క్లబ్బుపిచ్చిజాస్తి. రాజు కాకినాడ వచ్చిన మూడు నాలుగు రోజులు కాబోలు—క్లబ్బు మానుకుని తనతోపాటు తిరిగాడు. అప్పటికే అనేశాడు గూడాను.

"ఏమిటోరా రాజా! ఒక్కరోజు క్లబ్బుకి వెళ్ళకపోతే పిచ్చెత్తినట్టయిపోతుంది. ఈ అలవాటు మానుకోవాలని సర్వవిధాలా ప్రయత్నిస్తూన్నాను. కాని, నావల్ల కావడంలేదు" అని.

రంగనాధం నాన్నగారు కాకినాడలో పేరొందిన పెద్ద వ్యాపారుల్లో ప్రముఖుడు. వ్యాపారంలో ఆయన లక్షలు ఆర్జించాడు. రంగనాధ మొక్కడే సంతానం. అతను కా అంటే కా, కీ అంటే కీ.

మరో గంటవరకూ అతనికోసం ఎదురు చూశాడు. రాలేదు. సాయంత్రం సినిమాకు వెడదాం, రూంలో వుండమని మరీ మరీ చెప్పాడు రంగనాధం. ఆమాట కాస్తా క్లబ్బు మోజులోపడి మరిచిపోయివుంటాడని తలిచాడు రాజా.

తలుపుకి తాళంవేసి బజారువైపు నడక ప్రారంభించాడు రాజా. కాఫీ తాగింతర్వాత సినిమాకి వెడదామనిపించింది. థియేటరువైపు దారి తీశాడు.

ఆ సినిమావచ్చి కొన్నాళ్ళయింది కాబోలు—జనం అట్టే రద్దీగాలేరు. టిక్కట్లు సులువుగా దొరుకుతున్నాయి. బుకింగువైపు నడుస్తూన్నరాజా తనకు పదిగజాలదూరంలోవున్న జంటనుచూచి హఠాత్తుగా ఆగిపోయాడు.

ఎన్ని సంవత్సరాలు గడిచినా, లలితను మరిచిపోడం కల్ల. ఆమె నక్కడ చూడగానే కాలేజీరోజులు తన కళ్ళముందు సినిమా రీలులా కదిలింది.

లలితంటె చాలామంది విద్యార్థులకి ప్రాణం. ఆమెతో మాటాడి, ఆమెను మాటాడించుకోడమే ధ్యేయంగా పెట్టుకున్నవాళ్ళు చాలామంది వుండేవాళ్ళు. ఆమెను వెంబడించటమే హాబీగా వుండేది కొందరికి. ఆమె అడిగినా అడక్కపోయినా నోట్సులూ గట్రాయిచ్చి (ఆమెకోసం ప్రత్యేకించి, శ్రద్ధ తీసుకుని రాసినవి) ఆవిడ అభిమానం సంపాయించుకున్నవారు అప్పట్లో పెద్ద అదృష్టవంతుడు!

అలా లలితను ఆరాధించేవాళ్ళల్లో రాజా కూడా ఒకడు. అయితే అతనీ కార్యక్రమంలో కాలుపెట్టిన కొద్ది రోజులకే అందరికీ ఓ చక్కటి గుణపాఠం నేర్పింది లలిత.

సారధి అని—ఓ గడుగ్గాయి స్టూడెంటు వుండేవాడు. అతను లలితను ప్రేమిస్తూన్నానూ అవటా అని అందరికీ చెప్తూండేవాడు. కేవలం ఆమె కోసమే రాసినట్టు కొన్ని ప్రణయగీతాలు రాసి, చదువుతూండేవాడు. ఇలా కొన్నాళ్ళ—ఆమెకు దూరంగానేవుండి కవిత్వం రాశాడు. ఓనాడు—ధైర్యంచేసి — ఓ ప్రేమలేఖరాసి, స్వయంగా తీసికెళ్ళి ఇచ్చాడు. ఆమె అది చదివింది. కళ్ళెర్రజేసింది. వెంటనే చింపింది. అందరికీ వినిపించేలా—లేదా—అందరూ వినాలనే ఉద్దేశ్యంతో "వళ్ళు దగ్గర పెట్టుకు నుండమ'ని సలహాయిచ్చి వెళ్ళిపోయింది లలిత ఉరఫ్ మిస్ కాలేజి.

---

కుర్రకారు రచయిత ఒకడు తాను సంకలనం చేయదలచిన గ్రంథంలో బెర్నార్డ్ షా రచన ఒకటి చేర్చుకోదలచి, ఆయన కొక లేఖ రాశాడట: "నేను యువకుణ్ణి; మీరు మామూలుగా పుచ్చుకునే పారితోషికం ఇవ్వలేను"

"మరేం ఫరవాలేదు. నువ్వు పెద్దవాడయ్యేవరకూ కాచుక్కూర్చుంటాలే" షా అతడికి సమాధానం రాశాడు.

ఆర్. లతా (వరంగల్)

---

ఆనాటినుంచే రాజాలాంటి పిరికి విద్యార్థులు చాలామంది తమ కార్యక్రమానికి స్వస్తి పలికారు.

ఈనాడు అదే లలిత — మరో యువకునితో (బహుశా అతను ఆమె భర్తఅయివుండవచ్చని రాజా అనుకున్నాడు) ఏదో విషయమ్మై చర్చిస్తుంది. కాలేజీ రోజుల్లో ఆమెకు రెండు జడలుండేవి. స్టైల్‌గా అలంకరించుకుని హంసలా కాలేజికి వచ్చేది. ఆ అలంకారం ఇప్పుడు పూర్తిగా మారిపోయింది.

అచ్చం గౌరిదేవిలావుంది. నొసటని అందమైన కుంకుమబొట్టు కొత్తశోభను తెచ్చింది. బెనారసుసిల్కుచీర ఆమెకు బాగా నచ్చింది. రెండు చేతులకూ నిండుగా గాజులున్నాయి. ఇప్పటి లలిత పదహారణాల తెలుగు గృహిణిలావున్నది.

చాలాసేపు ఆమెవంక చూచాడు. పలుకరిద్దామని తలిచాడుగాని, బావుండదని మానుకున్నాడు. టిక్కట్టు పుచ్చుకుని థియేటర్లోకి అడుగు పెట్టబోతూండగా లలిత అతనిపేరుపెట్టి పిలిచింది. రాజా ఖంగారుపడిపోయాడు. ఆగిపోయాడు బ్రేకు వేసినట్టు.

"మీరు అవునో కాదోనని యిప్పటివరకూ అనుమానిస్తున్నాను" అన్న దామె నవ్వుతూ.

రాజా తానై ఏమీ మాటాడలేదు. కాలేజిరోజుల్లో గూడా ఆమెతో మాటాడటం సంభవించలేదు. ఏదో కాలేజీ ఫంక్షన్లలో తప్పనిసరైతే తప్ప.

"ఈవూళ్ళో ఏం చేస్తున్నారేవిటి?"

అతను చెప్పాడు.

"భలే....ఒకేచోట చేరామన్నమాట. ఆఁ... వీరు మావారు. ఈయన రాజా అని మా క్లాసుమేటు." అని పరిచయాలు చేసింది.

శ్రీధరం చాలా అందంగా వుంటాడు. లలితకు తగిన భర్త. అతనెంత అందంగా వుంటాడో అతని మాటలు గూడా అంత అందంగా వుంటాయి. అక్కడ నిలబడ్డ పావుగంటలోనూ శ్రీధరమే ఎక్కువగా మాటాడాడు. అతను మాటలు విన్నకొద్దీ యింకా వినాలనిపిస్తుంది.

శ్రీధరం కాకినాడలో లెక్చరరుగా వుంటున్నాడట. స్వంతవూరు నర్సాపురంట. మొన్ననే యూనివర్శిటీనుంచి వచ్చాడుట. ఈ వివరాలన్నీ తనే స్వయంగా చెప్పుకున్నాడు. అతనికి కొత్త పాతా అనే భేదం లేనట్టుంది. పరిచయమైన మరుక్షణంలోనే తనతో యింత చనువుగా కలుపుగోలుతనంగా మాటాడ్డ మేమిటి?

ఆ తర్వాత ముగ్గురూ కలిసి సినిమా చూచారు. ఆట మధ్యలో లలిత రాజాని అడిగింది.

"ఎక్కడుంటున్నారు?"

"గాంధీనగరం—గాంధీబొమ్మ సమీపంలో."

"గుడ్‌గాడ్! మా ఇల్లూ అక్కడే—" అని తమ ఇల్లు ఎక్కడో అతనికి వివరించి చెప్పింది.

"ఎన్నాళ్ళయింది వచ్చి?" అని అడిగింది.

రాజా చెప్పాడు.

"ఫామిలీని తెచ్చారా?"

"అమ్మ ఓ నెల్రోజుల్లో రావచ్చు...."

"మరి......"

"నాకింకా పెళ్ళికాలేదు." అతను సిగ్గుపడుతూ అన్నాడు.

ఆమె చిన్నగా నవ్వింది.

"భలే....ఇన్నాళ్ళూ ఇంత దగ్గరగా వుండి కూడా పోల్చుకోలేకపోయా మన్నమాట ..... అప్పుడప్పుడు వస్తూండండి—ఏదో పిచ్చాపాటి మాటాడుకుందికి"

"అలాగే...." అన్నాడు రాజా.

శ్రీధరం సినిమా చూట్టంలో నిమగ్నుడైపోయాడు. లలితమాత్రం ఏవేవో విషయాలు చెప్తూనే వున్నది. ఆమె మాటలు వింటూ గతాన్ని నెమరు వేస్తున్నాడు రాజా.

సినిమా అయిపోయింది.

ఆరోజు శ్రీధరం లలిత ద్వారా పరిచయమయ్యాడు. పరిచయమైన ప్రతిమనిషికీ ఓ అభిప్రాయమంటూ కేటాయించడం జరుగుతుంది.

శ్రీధరం రాజాని ఆకర్షించాడు. శ్రీధరం భోళా మనిషి. దేన్నీ దాచుకుని మాటాడ్డం అతనికి తెలియదు. అందరితోనూ మనసు విప్పుకు మాటాడు

తుంటాడు. అతను కాలేజీలో మంచి పేరు సంపాయించుకున్నాడు. ఈ కొత్త దశలోనే విద్యార్థులందరూ అతనంటె ప్రాణాలు పెడ్తుంటారు.

కానీ—ఇలాంటి మనిషి వెనుక వికృతమైన చరిత్ర ఉందంటె రాజు ఎందుకనో నమ్మలేకపోతూన్నాడు.

ఒకనాడు రాజు, శ్రీధరం యింటికివెళ్ళాడు. ఆ సమయానికి శ్రీధరం ఇంట్లోలేడు. లలిత రాజుని లోనికి ఆహ్వానించింది. కాఫీ చేసితెచ్చింది. అతను కాఫీ తాగుతూండగా మాటల సందర్భంలో శ్రీధరం విషయం కదిలింది. ఆమె అన్నదిది:—

"మనుష్యుల్ని, వాళ్ళ ఆకారాన్నిచూచి నిర్ణయానికి రావడం మంచిదికాదు రాజూ! మీకు ఆయన మంచివాడుగా కనుపించవచ్చు. ఆయన చేస్తూన్న అన్యాయం మీకు తెలీదు. చెప్పినా నమ్మరు" ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. రాజు ఉలిక్కిపడ్డాడు.

"పదిమందిమధ్యా చక్కగా నటించడం వారి వవును. అందర్నీ వంచించడం ఆయనకు బాగా తెలుసు. మీరనుకుంటారు—మా దాంపత్యం సుఖమయంగా, ఆనందంగా నడుస్తూందని కదూ!"

రాజు తలూపాడు.

"మగవాళ్ళందరూ ఇంతేనా అన్నది ఆసందర్భం. ఆయన ప్రవర్తన రోజు రోజుకీ దారుణంగా తయారవుతోంది. "క్షణం ఆగి మళ్ళీ అన్నది" ఆయనకీ ఊళ్ళో ఓ అమ్మాయితో పరిచయముంది. ఆమెను చూడనిరోజు ఆయనకేదో వెలితి. ఆమె వుంటున్న ఇల్లు ఆయనకు స్వర్గం. నేను పనికిరాను. నా మాటలు ఆయన పట్టించుకోడు. ఎంతో మొర పెట్టుకుంటేనేతప్ప, సినిమాలూ, షికార్లూ నాతో పాటు గిట్టవు. ఎక్కడ చెప్పవలసినమాట అక్కడ చెప్పడం నేర్చుకున్నారు. ఇంటిగుట్టు చెప్పుకోడం యిష్టంలేక ఇన్నాళ్ళూ నోరుమూసుకుని పడున్నాను. ఇంక నావల్లకాదు" ఆమె తన ముఖాన్ని చేతుల్తో దాచుకుంది.

రాజు మనసు చివుక్కుమంది.

ఈ విషయం లలిత నోటినుంచి విన్నతర్వాత శ్రీధరం గురించి యింకా బాగా తెలుసుకోవాలనీ, చేతనైతే ఆ సంసారంలో మళ్ళీ సుఖాన్ని దగ్గర చేయాలనీ నిశ్చయించుకున్నాడు.

రోజులు గడుస్తున్నకొద్దీ శ్రీధరం గురించి వివరాలు సేకరిస్తూనే వున్నాడు. తలోవిధంగా వస్తున్నాయి వివరాలు. ఒకదానికీ, మరోదానికీ అసలు సమ్మంధమే లేకపోతూంది. ఏం నమ్మాలో, ఏం నమ్మకూడదో తెలియక్కుండా వుంది.

ఒకరోజు రంగనాథంతోపాటు రాజు బజారువైపు వెడుతూండగా సైకిల్మీద శ్రీధరం కనుపించాడు. తను పిలిచేలోగానే రంగనాథం అతన్ని పిలిచాడు. శ్రీధరం ఆగిపోయాడు.

"ఏం....మహానుభావా! ఇన్నాళ్ళూ తమ దర్శన భాగ్యమే కరువయ్యింది. ఆ...అన్నట్టు....ఇతను రాజు అని మా మిత్రుడు. వీరు శ్రీధరం—"

"లోగడే పరిచయాలు ముగిసాయి. మా శ్రీమతి ద్వారా వీరు తెలిశారు. కాబట్టి తమరింక శ్రమ తీసుకోనవసరం లేదనుకుంటాను."

"థాంక్స్" అన్నాడు నవ్వుతూ,

తర్వాత రంగనాథం, శ్రీధరం — ఇద్దరూ వాళ్ళ క్లబ్బు విషయాలు చాలాసేపు మాట్లాడుకున్నారు. జరుగనున్న వార్షికోత్సవానికి కావలసిన సదుపాయాలు గురించే వాళ్ళెక్కువసేపు మాటాడింది.

"ఇంక వుంటానునుభాయ్ — వస్తానండి రాజు గారూ!" అని శ్రీధరం వాళ్ళిద్దరి దగ్గిరా సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

కాసేపు ఇద్దరూ మవునంగా నడిచారు.

"శ్రీధరం గురించి నీ ఉద్దేశ్యమేమిటి?" అని రంగనాథాన్ని అడిగాడు రాజు. రంగనాథం ఫకాలున నవ్వాడు. అతనెందుకు నవ్వుతున్నాడో అర్థం కాలేదు.

"ఎవడో దారేపోయే దానయ్యని ఎత్తుకుని, వాడిగురించి నీ అభిప్రాయ మేమిటని అడుగుతే నేనేం చెప్తానురా."

పోలీసు ఉద్యోగాలకు ఇంటర్వ్యూలు జరుగుతున్నాయి.

"నువ్వొక పోలీసు కారులో వంటరిగా వెడుతున్నావనుకో. నీ వెనుక మరొక కారులో నలుగురు దొంగలు గంటకు నలభై మైళ్ళ వేగంతో వస్తున్నారనుకో. అప్పుడు నువ్వేం చేస్తావ్?" అధికారి ఒక అభ్యర్థిని ప్రశ్నించాడు.

"ఏభై మైళ్ళ వేగంతో నా కారు నడుపుతా" అభ్యర్థి చమటలు కక్కుతూ సమాధానం చెప్పాడు.

జయచంద్రుడు (తెనాలి)

"శ్రీధరం భార్య నా క్లాసుమేటు."

"అయితే?"

"శ్రీధరాన్ని మొదట్లో చూచి, చాలామంచివాడనుకున్నాను. లలితలాటి గుణవంతురాలికి తగిన భర్తనుకున్నాను. వాళ్ళ సంసారంలో ఏవిడీ దుడుకూ, పొరపొచ్చాలూ లేవని తలిచాను. కానీ—మొన్న వాళ్ళింటికెళ్ళినప్పుడు లలిత శ్రీధరం గురించి చాలా చెప్పింది. అతను నీతికి దూరంగా తిరుగుతున్నాట్ట. నిజమా?"

మళ్ళీ నవ్వాడు రంగనాథం.

"ఎందుకలా నవ్వుతావ్?"

"నిన్నుచూస్తూంటె— ఓ తి పి చ్చి రా జా! ఇది లోకమని మరిచిపోయావుట్రా! శ్రీధరం మగవాడు. అతనికి చాలా కోరికలుంటాయి, అవకాశలూ వున్నాయ్!"

"అంటె నీ ఉద్దేశ్యం?"

"అతను క్లబ్బుకి వస్తాడు. పేకాట ఆడతాడు. ఆడపా దడపా పానీయం సేవిస్తాడు.

"రంగా—"

"అతనంటె ఓ చక్కనిచుక్క ప్రాణాలు పెడ్తుంది. ఇవి చాలా?"

రాజు మాటాడలేదు.

"ఇవేం ఈ రోజుల్లో తప్పుకింద భావించడం లేదే. పైగా ఇది ఈ యుగధర్మమని కూడా అంటూన్నారాయె. అలాంటప్పుడు ఫలానావాడు నీతికి దూరంగా తిరుగుతున్నాడూ అనటాన్ని వగవి ప్రయోజనం లేదురా రాజూ. ఇప్పటి మగవాడికి—అందునా పదిమందిలో తిరిగేవాడికి యివన్నీ జీవితావసరాలు! సరా!"

"తేలిగ్గా మాటాడుస్తున్నావ్. మనిషికున్న విలువ......"

"ఓరి బుద్ధావతారం!—ఈ రోజుల్లో ఇంకా విలువ లెక్కడివోయ్. అవెప్పుడో గతించాయి. ఆ....అదిగో ఆ ఎడంచేతివైపు పెంకుటిల్లుంది చూశావ్....ప్రహరీగోడా అదీను."

"ఊ...."

"ఆఇల్లే—మన శ్రీధరంగారి ప్రాణం. అతని ప్రియురాలు తనకోసం తలుపులెప్పుడూ తెరిచే వుంచుతుంది."

వాళ్ళిద్దరూ ఆ యింటిముందునుంచీ వెళ్ళారు. పెంకుటిల్లయినా అధునాతనంగావుంది. ఇంటిముందు అందమైన క్రోటన్సు వున్నాయి. ఆ యింటి అరుగుమీద శ్రీధరం సైకిలుంది. ఇంటి తలుపులు మూసివున్నాయి.

"ఇప్పుడు ఇంట్లో శ్రీధరం సర్వాన్ని మరిచిపోయి వుంటాడు. ఇది అతనికో చక్కటి విడిది."

రంగనాథం ఇంకా ఆ యింటి గురించి వివరాలు చెప్తూనే వున్నాడు. రాజు అతను చెప్తూన్నదంతా మవునంగా వింటూన్నాడు. కొంతదూరం వెళ్ళిన తర్వాత రాజు అన్నాడు.

"లలిత సంసారంలో చిచ్చు రగిలినమాట వాస్తవం!"

"తప్పునంతా శ్రీధరంమీదనే రుద్దకు. ఆమాట కొస్తే ఆ సంసారం గురించి నీకింకా బాగా తెలియదన్నమాట."

"అంటె?"

"నా నోటితో ఎందుకు చెప్పనిస్తావ్ రాజూ నువ్వే చూస్తావుగా తొందర్లో....ఇప్పటికే పొద్దుపోయింది. వస్తా—" నంటూ రంగనాథం వెళ్ళిపోయాడు.

రంగనాథం వెళ్ళిపోతూ చివర్న అన్నమాట రాజు చెవుల్లో ఇంకా రింగుమంటూనే వున్నది. ఎంత ఆలోచించినా ఆమాటలోనిభావం అర్థం కావడంలేదు.

* * *

ఒక ఆదివారం:

రాజు నిద్రలేవడం ఆలస్యమైంది. కాలకృత్యాలు ముగించుకున్నాడు. కాఫీ తాగేందుకు బజారువైపు వెళ్ళాడు. బజార్లో ఆఫీసు మిత్రు డెవరో కలిశాడు. కాసేపు ఇద్దరూ బాతాఖానీ వేసుకుని కాఫీతాగి, ఎవరింటికి వాళ్ళు వెళ్ళిపోయారు.

రాజు ఇంటికొచ్చేసరికి పదిగంటలయింది. గది

స్థాపితం 1920
రెడ్డి అండ్ కో. (రిజిస్టర్డు)
గోపాలపురం
తూ॥ గో॥ జిల్లా
కుష్ఠు బొల్లి మేహవాడ
వగైరా చర్మ సుఖ వ్యాధులకు
శాస్త్రీయ- ప్రత్యేక చికిత్స.
ఆయుర్వేద ఔషధములు లభించును
→ కేటలాగు సలహా ఉచితము



క్రమంతప్పక వాడండి
నీమ్ టూత్‌పేస్ట్
ఆధునిక టూత్ పేస్టులో వాడబడు అవసరమైన ఔషధము లన్నింటితో కలసి. వేపలోని శక్తివంతమైన భాగములన్నియు పొందియున్న ఒకే ఒక టూత్ పేస్ట్
Neem TOOTH PASTE "CALCHEMICO"
కలకత్తా కెమికల్ కలకత్తా-29
NTP-192-T6
దక్షిణ ఇండియా ఆఫీసు
8/149 బ్రాడ్వే, మద్రాసు-1.


# అపశ్రుతి

తలుపు తెరిచి లోన అడుగుపెట్టేసరికి అతనికో కాగితం కనుపించింది. మడతవిప్పి చదివాడు.

రాజా గార్కి!

గత నాలుగైదు రోజులుగా మీరు మాయింటికి రావడం మానుకున్నారు. మీతో ముఖ్యమైన విషయాలు కొన్ని మాటాడవలసిన అవసరమొచ్చింది. అందుచేతనే పనిగట్టుకుని ఉదయం మీ రూం కొచ్చాను. మీరు లేరు.

తీరుబడి చేసుకుని శ్రమనుకోకుండా మధ్యాహ్నం మా యింటికిరండి. భోజనం మా యింట్లోనే!—ఈ ఆతిథ్యాన్ని కాదనకండి.

తప్పకుండా వస్తారని ఆశిస్తూ—లలిత.

రాజా ఈ ఉత్తరం చదివి ఆశ్చర్యపోయాడు. తనతో సంప్రదించవలసిన ముఖ్యవిషయాలేమిటో అతనికో పట్టాన తోచలేదు.

గంటసేపు ఏదో పత్రిక చదివాడు. ఆ తర్వాత బట్టలు మార్చుకుని లలిత ఇంటికి బయల్దేరాడు.

లలిత వాళ్ళయిల్లు చక్కగా అలంకరించి వున్నది. తలుపులకి వేసిన డోరుకర్టన్లు అందమైన డిజైనులతో ముచ్చటగా వున్నాయి. లోపలనుంచి సన్నగా రేడియో వినిపిస్తోంది. ఇదంతా ఓ కొత్త శోభగా కనిపించింది రాజాకి.

అతను నిశ్శబ్దంగా హాల్లోకి ప్రవేశించాడు. సువాసన గుప్పుమంది. హాల్లో లలితగానీ, శ్రీధరం గానీ లేరు. రెండు నిమిషాలలా మవునంగా జరిగిం తర్వాత—

"శ్రీధరంగారూ" అని పిలిచాడు రాజా.

వంటగదిలోంచి ఆ పిలుపు వినగానే లలిత గబగబా వచ్చింది.

"ఓ....వచ్చారా....రండి. మీ కోసమే ఎదురు చూస్తున్నా. అలా కూర్చోండి. ఆ టీపాయ్‌మీద పుస్తకాలున్నాయి. తిరగేస్తూండండి. ఈలోగా వంటకావలసిన ఫైనల్ టచెస్ పూర్తిచేసివస్తాను" మళ్ళీ అతని మాటకైనా ఎదురు చూడకుండా గబగబా వంటగదిలోకి వెళ్ళిపోయింది.

ఆమె చేస్తూన్న హడావిడిని చూస్తుంటే రాజాకి నవ్వు వచ్చింది. ఒక్కసారి ఇల్లంతా పరికించి చూశాడు. శ్రీధరం ఇంట్లో లేనట్లు గ్రహించాడు. తర్వాత టీపాయ్‌మీదవున్న మాగజైన్లు తిరగెయ్యడం ప్రారంభించాడు.

ఓపావుగంటకాబోలు లలిత హాల్లోకివచ్చి కూర్చుంది. రాజాని చూస్తూ నవ్వుతూ అన్నది.

"హోటల్లో భోజనం ఏంచక్కగా వుంటుందో ప్రత్యక్షంగా నాకు అనుభవం లేకపోయినా—శ్రీవారు చెప్తూండగా విన్నాను. పాపం! మీరీసరికే ఆ హోటలు భోజనంతో విసిగిపోయి వుంటారు కదూ?"

రాజా తలూపాడు.

"ఇన్నాళ్ళూ సమయం—సందర్భం—అనుకూలించక మిమ్మల్ని మా ఇంటికి అతిథిగా ఆహ్వానించలేకపోయాను."

"అంటే ఇప్పుడేదైనా సందర్భం—"

"కరెక్ట్....ఆ సందర్భం గూడా మీరేటో వూహించి చెప్పండి చూద్దాం."

ఏం చెప్పాలో తెలీక రాజా మవునంగా వుండిపోయాడు. ఆమె పకపకా నవ్వింది, రాజాని చూస్తూ.

"ఇవ్వాళ నా పుట్టినరోజు."

"వ్వాట్"

"అవును."

"మరయితే ఈ విషయం ఉత్తరం రాయలేదెందుచేత?"

"మీ ఊహాశక్తిని పరీక్షిద్దామని. అసలు మీ నోటినుంచి జవాబే రాలేదాయె."

"మీ పుట్టినరోజు పండగని జోస్యం చెప్పటానికి నేనేమైనా జ్యోతిష్కుడనా—పైగా ఏవో కొన్ని ముఖ్య విషయాలూ మాటాడాలన్నారు."

"అవును. అవన్నీ విందైన తర్వాత."

"శ్రీధరంగారేరీ—ఎక్కడా కనుపించడంలేదు."

ఇలా అడిగిన తర్వాత ఆమె ముఖంలో మార్పు స్పష్టంగా కనుపించింది. ఈ మార్పుని దాచుకునేందుకు సర్వవిధాలా ప్రయత్నించిందికాని ప్రయోజనం లేకపోయింది. చివర్ని అన్నదిలా:

"నా పుట్టినరోజు పండుగలో ఆయన కేమిటి పని? ఆయనా, ఆయన ప్రియురాలూ ఎదో పిక్నిక్ ఏర్పాటు చేసుకున్నారుట. నిన్న సాయంత్రమే వెళ్ళిపోయారు. బహుశా ఈ రాత్రికిగాని తిరిగి రారు" ఆమె తలదించుకుంది.

రాజా మనసు చివుక్కుమంది.

"శ్రీధరం మీ కన్యాయం చేస్తున్నారు."

"పోనీండి. ఈ రభస ఎప్పుడూ వున్నదే. ఈ ఒక్కరోజైనా అన్నీ మరచిపోనీండి." అన్నదామె కళ్ళు వత్తుకుంటూ. "లేవండింక. అవతల పదార్థాలు చల్లారిపోతున్నాయి." అంటూ ఆమె వంటగదివైపు నడిచింది.

—భోజనాలు ముగిసాయి. ఆమె చేసినవంట అద్భుతంగా వున్నది. ఆ చేతిలో ఏ అమృతముందో గాని—అమ్మ కూడా ఇంత చక్కగా వంట చెయ్యలేదనిపించింది రాజాకి. అదే అన్నాడు ఆమెతో. ఆమె నవ్వుతూ "థాంక్స్" చెప్పింది.

ఇద్దరూ హాల్లో కూర్చున్నారు.

"మీ కెప్పుడైనా మన కాలేజీరోజులు గుర్తుకొస్తుంటాయా?"

చిరునవ్వు రాజా పెదాలపైన నిలిచింది.

"నిజంగా ఆరోజులు మళ్ళీ తిరిగి రావాలనిపిస్తుంటుంది నాకు. ఈ నరకం అనుభవించేదానికంటె ఒక్కొక్కప్పుడు నేనెంత మధనపడిపోతూంటానో చెప్పలేను."

నిజమనిపించింది రాజాకి.

"మనతోపాటు చదివినవాళ్ళందరూ పేరుపేరునా గుర్తుకొస్తూంటారు. ముఖ్యంగా, మీరూ—సారథీ. రాజా ఆశ్చర్యపోయాడు.

"నిజం. కాలేజీ నాలుగ్గోడల మధ్యా మనకి బయటి ప్రపంచం తెలీదు. ఏదో చిలిపితనం కొద్దీ అల్లరి చేస్తూంటాం. దాదాపు అదో హాబీగా తయారవుతుంది. అదేమంత పట్టించుకో దగ్గ విషయం కూడా కాదు. సారథిమీద నాకేదో

వేగ ఉన్నదని మీరందరూ అనుకున్నారు. అది మాత్రం వట్టిది. అతనానాడు నాకు ప్రేమలేఖ రాసి పదిమందిలోనూ అవమానం చేశాడన్న కోపం కొద్దీ ఏదో అనేశానే గాని తర్వాత నేను చాలా పీలయ్యాను.''

రాజా ఆమె చెప్పేదంతా శ్రద్ధగా వింటు న్నాడు.

''అత డిప్పుడు ప్రఖ్యాతరచయిత అయ్యాడు. చిత్రం. ఆ రోజుల్లో అతను వట్టి గడుగ్గాయిగా కనుపించేవాడు. మొన్నా మధ్య రాజమండ్రి ప్లాటు ఫారమ్మీద అతని శ్రీమతితోపాటు కనుపించాడు. ఒక పిల్లవాడు గూడాను. ఆ దాంపత్యంలోని ఆనందం ఆ ఒక్క అరగంట చాలు వాటి చెప్ప టానికి. నేనే అతన్ని ముందు పలుకరించాను. ఆతర్వాత అతనే ఎక్కువగా మాటాడాడు. అతని శ్రీమతిని నాకు పరిచయం చేశాడు. వీలైతే ఎప్పుడైనా కాకినాడ వస్తానని గూడా మాట యిచ్చాడు. అతను అదృష్టవంతుడు.''

ఇదంతా రాజాకి చిత్రంగా తోచింది. కాలేజీ రోజుల్లో సారథం టే విరుచుకుపడే లలిత ఈనాడు అతన్ని ఆకాశాని కెత్తి చెప్తుంది.

''ఆ రోజుల్లో నాకో గర్వముండేది !''

ఏమిటన్నట్టు చూశాడు రాజా.

''నాతో చదువుకుంటూన్న వాళ్లందరూ ఏదో విధంగాను పరిచయం కావాలని తహతహ లాడిన వారే. ఆ అందరి మధ్యా నాకేదో ఆధిక్యత ఉన్న ట్టనిపించింది. దానికి తగ్గట్టు కాస్త బెట్టుగానే తిరిగేదాన్నేమో కదూ.''

రాజా జవాబు చెప్పలేదు.

''అన్నట్టు మీరూ సారథి వాళ్ల జట్టులోనే ఉండేవారు'' అన్నదామె.

రాజాకి సిగ్గు వేసింది.

''ఎవరైనా చక్కగా నవ్వుతే మీరు నాకు హఠాత్తుగా గుర్తుకొస్తారు. అప్పట్లో మీకో ప్రత్యేకత ఉండేది. ఇది ముఖస్తుతి మాత్రం కాదు.—మీరు చాలా అందంగా నవ్వేవారు.''

రాజా కీ ధోరణి రుచించలేదు.

''మళ్లీ ఒకసారి మీ నవ్వుని చూడాలని ఉంది. నవ్వరూ—''

అతను ఆమె మాటకు అడ్డుపడ్డాడు.

''నాతో చాలా ముఖ్యమైన విషయాలు మాటాడా లన్నారు.''

''ఇంతవరకూ చెప్పినవి ముఖ్యమైనవే. మీకి విషయాలు నచ్చడం లేదేమో గాని నాకు తీరిక చిక్కినప్పుడల్లా యివే గుర్తు చేసుకుంటాను. ఈ అనుభవాలే ఒక విధంగా నన్ను సంతోష పెట్టేవి. ఇవి కూడా గుర్తు చేసుకోకుండా, దూరం చేసుకుంటే యింక మిగిలేది నరకం రాజా—'' ఆమె కంఠం గద్గదిక మయ్యింది. రాజా ఆశ్చర్యపోయాడు.

''అందర్లో అవుననిపించుకున్నాను. అన్నీ ఉన్నాయి నాకు. పువ్వులా పెరిగాను. కానీ .... ఈనాడు'' ఆమె కన్నీళ్లు పెట్టుకుంది.

రాజా మనసు ద్రవించింది.

''జీవితంలో యీ మలుపు దారుణంగా ఉంది. గతజన్మలో జేసుకున్న పాపం నన్నీనాడు తపించింది. మిగిలాను జీవచ్ఛవంలా.''

''మీరిలా బాధపడటం బాగుండలేదు. ధైర్యంగా ఉండండి—''

''మగవాడు తిరుగుతాడు—ఆడది తిరగరాదు. మగవాడికి పవిత్రతతో అవసరంలేదు. ఆడదాని కదో చక్కటి ఆభరణం. మగవాడేం చేసినా చెల్లు తుంది. ఆడది నోరుమూసు క్కూర్చోవాలి. ఇది న్యాయమా ? చెప్పండి రాజా ?'' ఆమె చాలా ఆవేశంగా మాటాడింది.

''శ్రీధరం నన్ను ఆటబొమ్మలా చూస్తు న్నాడు. నా చేతకానితనాన్ని అలుసుగా తీసు కున్నాడు. ఇది మగవాడికి తగును ! కాని నాలాటి ఆడదాని కోరిక తీరవద్దా.—నేనూ జీవితంలో తీపిని చవిచూడాలని ఉంది, అవకాశంకోసం ఎదురుచూస్తాను. చిక్కుతుంది. నా అభిమతం నెరవేరుతుంది. అప్పుడేమవుతుందో తెలుసా రాజా?' అని రాజా నడిగింది. రాజా మనసులో చిరాగ్గా ఉంది. ఈ ధోరణిని యింకా యిలా వినేదానికంటే పారిపోవడం మంచి దనుకుంటున్నాడు.

''అందరూ నన్ను స్వైరిణి అంటారు. అంతేగా ?''

---

"నీ వయస్సులో లింకన్ ఎంత కష్టపడి 'లా' చదివా డనుకున్నావ్ ?" న్యాయవాది కొడుక్కి బుద్ధి చెబుతున్నాడు.

"అవును నాన్నా! నీ వయస్సులో లింకన్ అమెరికా అధ్యక్షు డయ్యాడు కూడాను" కొడుకు మధ్యలో అందుకుని అన్నాడు.

జి. శాంతి (మద్రాసు)

---

రాజా ఉలిక్కిపడ్డాడు.

''నేను వీ టన్నింటినీ లెక్కచెయ్యను. స్వేచ్ఛ ననుభవించే హక్కు నాకూ ఉన్నాయి. శ్రీధరం లాటి వ్యక్తికి భార్యనై జీవితపర్యంతం అతనికి దాస్యం చెయ్యడం నాకు చేతకాదు.'' క్షణంసేపు ఆగి తిరిగి అన్నది రాజా నుద్దేశిస్తూ ''మీ ముందున్నది—మీతోపాటు చదువుకున్న రెండు జడల లలిత. ఆనాడు అందర్నీ హడలగొట్టింది కానీ యీనాడు—''

రాజాకి భయం వేసింది. చేతిలోని మాగజైను టీ పాయ్‌మీద వదిలాడు.

''మీరింకా నన్ను ప్రేమిస్తున్నారు గదూ. సూటిగా అతన్ని ప్రశ్నించింది.

రాజాకి నోట మాట రాలేదు. అతని ముఖంపై స్వేదబిందువులు నిలిచాయి.

''చెప్పండి రాజా ! భయపడకండి. ఇంతసేపూ ఓ ఆడది తా ననుభవిస్తూన్న క్షోభని చెప్పు కుంది. ఈ ఉపోద్ఘాతం వెనుక ఆమె కోరిక గుర్తించండి. ఇంతకంటే యింకేం చెప్పగలను ?''

''లలితగారూ !'' అతను సర్వాన్ని మరచి పోయాడు..

''నాకు లేని భయం—సిగ్గూ మీ కెందుకూ ?''

అతను చివాలున లేచాడు. అతని కళ్ళు ఎర్రబడ్డాయి.

''నేనింకా పతనానికి దూరంగా ఉన్నాను. ఉంటాను గూడా. మరోమాటు యిలాంటి ఉద్దే శాన్ని మీనుంచి ఆశించను. సెలవు. వస్తాను'' అంటూ గబగబా బయటకు నడిచాడు.

ఆ యింటి పరిసరం దాటాడు. తా నెటు నడుస్తూన్నదో గూడా గమనించే స్థితిలో లేడు. వడిగా నడుచుకొంటూ పోతున్నాడు.

ఆ క్షణంలో మనుషు లందరిమీదా అతనికి నమ్మకం పోయింది. అందర్నీ ఏవగించుకున్నాడు. ఇంత చీకటిని హృదయంలో దాచుకున్న లలితను వృధాగా తా నిన్నాళ్లూ గౌరవించినందుకు విచా రించాడు.

ఒక ఆడది — మగవాడికి పవిత్రతతో పనిలే దన్న కుంటిసాకుని ఆసరాగా తీసుకుని, అక్కను కొద్దీ తానూ పవిత్రతకు దూరంగా ఉంటా మనుకోడంకన్నా దారుణం మరొకటి లేదు.

లలిత నైతికంగా దిగజారినందుకు రాజా ఓ విధంగా జాలి చెందాడు.

'ఆ సంసారం గురించి నీ కింకా బాగా తెలియ లేదు కాబోలు' అని రంగనాథమన్న మాటలోని భావం యిప్పటిగాని రాజాకి బోధపడలేదు.

ఛీ .... పాడు మనుషులు ! ....

ఈనాడు తానో చక్కటి పాఠం నేర్చు కున్నాడు. అతనికి జీవితం నేర్పిన మొదటి పాఠం—'ఎవర్నీ అతిగా నమ్మకు.'

సరిగ్గా ఆ సెంకుటింటి దగ్గరికి వచ్చేసరికి అతను బ్రేకు వేసినట్టు ఆగిపోయాడు. అప్పటి గ్గాని తా నెట్లు నడుస్తున్నాడో గమనించలేదు.

శ్రీధరం ఆ యింట్లోంచి బయట కొచ్చాడు. నవ్వుతూ ఉంటానంటూ చెయ్యూపి గబగబా వీధి లోకి నడిచాడు. అతను బాగా అంత దూరం వెళ్లిన తర్వాత—రాజా కదలబోయాడు. కాని, ఒక్క అడుగు కూడా ముందుకి వేయలేక పోయాడు.

ఆమె గుమ్మందగ్గర నిలబడి శ్రీధరం వెళ్లిన వైపే చూస్తుంది.

రాజా ఆమెను చూచాడు. గతుక్కుమన్నాడు. రెండు క్షణాలుపాటు నిశ్చేష్టు డయ్యాడు. తర్వాత తన నమ్మకాన్ని దృఢపరచుకునేందుకు గాను ఆ యింటి గుమ్మంవైపు నడిచాడు.

ఒక్కో అడుగూ భయపడుతూ వేస్తున్నాడు. ఉన్న కొద్దీ ఆమె తనకు దగ్గరవుతుంది. తన నమ్మకం నిజమయ్యింది. ఆమె !!

అతని తలమీద పిడుగు పడినట్టయింది హృదయంలో గూడు కట్టుకున్న బాధనంతా ఎవరో కెలికి, వెలికి తీసినట్టయింది.

సరిగ్గా యిదే స్థితిలో ఆమె కూడా "గొ క్కుంది. రాజాని చూస్తూనే స్తంభించిపోయింది.

రాజా ఆమెను చేరుకున్నాడు. ఆమె కళ్ల ల్లోకి తిన్నగా చూచాడు. అతని పెదాలు వణి కాయి. నిలువెల్లా కంపించిపోయాడు. ఏం చెయ్యాలో తోచిందికాదు.

''అక్కా !'' అన్నాడు బాధగా.

''రాజా—'' రజని కళ్ల వర్షించాయి.

రాజా తల దించుకున్నాడు. 

# హయవాతా అద్భుత గాథ

వ పేజీ తరువాయి

రుచి చూడు! ఆతరవాత ఆ నెమలిని చూపిస్తాను లే!'

వెనోనా మరి కాదనలేక పోయింది. ద్రాక్షపళ్లు కొన్ని తిన్నది. పడమటిగాలి అందించిన ఆకుదొన్నెలో పోసుకొని పుట్టతేనె కొంచెం తాగింది.

'ఈ తేనె ఎంత తియ్యగా ఉందో! నేనెప్పుడు ఇలాంటి తేనె ఒక్క చుక్కకూడా రుచి చూడలేదే!' అంది వెనోనా!

'నా కథ ఇంతకన్నా తియ్యగా ఉంటుంది. అక్కరలేదన్నావుగాని!' అన్నాడు పడమటిగాలి కొంటెగా కన్నుగీటి.

'మరి ఆ నెమలి ఏదీ?' ఎంతో ఆత్రంగా అడిగింది వెనోనా!'

'కొసకంటా నా కథ విను మరీ! ఆ పైన నెమలి చూపిస్తాను లే!'

'తప్పకుండా చూపిస్తావా?'

అబద్ధం ఆడితే ఇదిగో నీ చేతులతోనే నా కంఠానికి ఉరిబిగించి ఊపిరి ఆడకుండా చేద్దువుగాని! సరి గదా!

'సరే! ఈ కొంటెమాటలకేంగాని త్వరగా కథ మొదలుపెట్టు!'

పడమటిగాలి కథ అందుకున్నాడు:

'అనగనగనగా ఒక పెద్ద అడివి. ఆ అడవిలో ఒక అందాలరాణి. ఆమె కళ్లు నీలాలు. ముంగురులు గండు తుమ్మెదలు. ఆ చక్కని చుక్క అడుగుపెట్టిన చవిటి నేలలో కూడా పచ్చనిపచ్చిక బారెడెత్తు పైకి లేస్తుంది. పెదవి కదిపితే పిల్లనగ్రోవి పాట అనుకొని ఆవుల మందలు చుట్టు చేరతాయి. ఆ అందకత్తె నడుస్తూంటే ఆకాశంలో అచ్చరలు గుంపులు గుంపులుగా చేరి 'ఓహో! ఏమి వయ్యారం!' అని మెచ్చుకుంటారు. పిల్లగాలి తలమీద పువ్వుల వాన కురిపిస్తుంది.

'కథ చాలా బాగుందే! ఇంతకీ ఎవరా అందకత్తె?' ఆశ్చర్యపడి అడిగింది వెనోనా.

'మొదలుపెట్టానో లేదో! అప్పుడే అడ్డు తగిలితే ఎలాగ? కథ బాగుందన్నావు గదా! తేనె కన్నా తియ్యగా ఉందో లేదో చెప్పు మరి!'

'తేనెకన్న తియ్యగానే ఉంది గాని ఆ అమ్మాయి పేరెవరు?'

'చెబితే మరి కథ అక్కర్లేదంటావేమో అని భయపడుతున్నాను.'

'అనను లే!'

'నిజమేనా!'

'నిజమే!'

'అయితే ఆ పేరు అతి రహస్యంగా చెవిలో చెప్పాలి. అది గాలి కూడా వినకూడదు. తెలిసిందా?' అని పడమటి గాలి వెనోనాను కౌగలించుకొని చెక్కిలి

## గానకోకిల

జి. టి. వి. జగన్నాధాచార్యులు

నింగిలోన మాయె మయ్యెను
దొంగ చంద్రుడు వేళ కాగా
పొందులేర్పడ కూయవమ్మా
కొమ్మమీది కోకిలమ్మా!

చెట్టు చాటున దాగినావు
వెదకిజూడగ కానరావు
పంటచేలు పలుకరింప
వెలికిరమ్మా! కోకిలమ్మా!!

చూడబోతే నల్లగుంటావ్
వాడ వాడల నెగురుతుంటావ్
గాన మాధురి యొక్కసారి
గూయవోయీ రాగరాణీ!!

ఆదరించెను ఋతువు నిన్ను
మూదలింపరు యెవరుగూడ
వేచియుండెను చిత్రవర్ణుడు
పాడవమ్మా! కోకిలమ్మా

కోకిలమ్మా! కూయవమ్మా!
కొంటెతనపు సిగ్గు విడచి
కోరుకొందును నిన్ను నేను
తిరిగి జూడుమ యొక్కమారు!!

మీద పెదవిచేర్చి 'చెప్పనా మరి?' అని మళ్లీ అడిగాడు.

వెనోనా అతనికేసి చురచుర చూసి 'ఇంకా ఎందుకీ ఆలస్యం! త్వరగా చెప్పు మరి!' అని చిరాకు పడింది.

అంతలోనే పడమటిగాలి ఆమె కళ్ళకేసి చూసి 'అయ్యో! నీ కళ్ళల్లో పుప్పొడిపడింది. కొంచెం ఊదనీ! అని కళ్ళమీద పెదవిచేర్చి నెమ్మదిగా 'ఉఫ్' అన్నాడు.

వెనోనా ఇంకా బాగా చిరాకు పడి 'నా కళ్ళజోలి నీ కెందుకుగానీ ముందు ఆ అందకత్తె పేరుచెప్పు!' అని గట్టిగా గద్దించింది. పడమటిగాలి మరి గత్యంతరం లేక నెమ్మదిగా వినబడీ వినబడనట్టుగా 'ఇదిగో ఆమె పేరు చెబుతున్నాను. జాగ్రత్తగా విను మరి ! 'వెనోనా' అన్నాడు.

వెంటనే వెనోనా అతని పట్టు తప్పించుకుని దూరదూరంగా జరిగి కూర్చుంది.

'ఇంకా ఏదో కొత్త కథ చెబుతా వనుకున్నాను. ఇంతా చేసి నా కథేనా? నా కక్కర లేదు!' అని లేచి నిలబడి చెంగున గంతేసి అక్కడి నించి వెళ్ళిపోవాలని ప్రయత్నించింది.

కాని అంతలోనే పడమటిగాలి తిరిగి చెయ్యి దొరకపుచ్చుకుని వెనోనాను తన సరసన కూర్చోబెట్టి ఒక సరికొత్త కథ మొదలు పెట్టాడు. వెనోనా ఆ కథ వింటూ చీకటి పడిందన్న మాటే మరిచిపోయింది. కాని ఆకాశంలో నక్షత్రాలకేసి చూసి ఉలిక్కిపడి లేచి 'అమ్మో! బాగా చీకటిపడింది! నేను వెళ్ళిపోవాలి. లేకపోతే మా అమ్మ కోప్పడుతుంది.' అంది.

పడమటిగాలి 'మరి కథ కొనకంటా విని నెమిలి నృత్యం చూడవూ?' కళ్లల్లో కళ్లు పెట్టి అడిగాడు.

'మళ్లీ రేపు వస్తానులే!'

'అయితే రేపురాత్రి మీ అమ్మ బాగా నిద్రపోయిన తర్వాత లేచి పండువెన్నెల్లో ఇక్కడికి రా! అప్పుడు నెమలి పురివిప్పి ఆడితే ఎంత బాగుంటుందో తెలుసునా? ఇసక తిన్నెలో ఇంద్రధనుస్సులు నృత్యం చేసినట్టుంది!'

'అమ్మో! మా అమ్మకిగాని తెలిస్తే నన్నుమరి బతకనిస్తుందా?'

'భయం లేదులే! మళ్ళీ తెల్లవారకుండా నిన్ను మీ ఇంటి దగ్గర దిగబెడతానులే. త్వరగా వెళ్లు మరి! ఎందుకింత ఆలస్యమయిందని మీ అమ్మగాని అడిగితే కులాసాగా ఏటి ఒడ్డున పచార్లు చేస్తున్నానని చెప్పు. తెలిసిందా?' 'వెనోనా అలాగే' అని చెంగున గంతేసి అక్కడినించి వెళ్లిపోయింది!

ఇంకా ఉంది

---

కుమారుడు చిన్నోడు —బ్రతికుంటే వెంకన్నంతే వుండేవాడని అనేది చిన్ని....

'షెల్లీ' పద్యం ఒకటి జ్ఞాపకం వచ్చింది. "ఎడారిలో తాను ఒక్కడూ మిగిలిపోతే ముండ్లకంపనన్నా ప్రేమిస్తాను కాని ప్రేమించకుండా వూరుకోలేను" అని......

ఆమధ్య రెండుసార్లొచ్చాడు పట్నంనుంచి రెడ్డి. హాస్పిటల్‌లో ఆర్టర్లీ .... ఎవరికీ దొరకడు...ఎప్పుడూ చెలాకీగా తిరుగుతూంటాడు. ప్రపంచాన్ని ఎదిరించే సామర్థ్యం, తెలివీ, ధైర్యమూ అతనిలో కన్పిస్తాయి. మొదటిసారి వచ్చినప్పుడు ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చున్నాడు ఆ తోటలో.

"ఏందిసార్! పోయిపోయి అడియిలో బడ్డారె! సినిమాలేదు—రేడియోలేదు....పాడుకొంప" అన్నాడు విచారంగా.

"డాక్టర్లకు ఏ అడవైనా ఒకటేకదా రెడ్డీ!"

"ఏందిసార్! మీబోటోళ్ళు ఈ వయసులో సల్లగా తారురోడ్లమీద కార్లో దిరగాల్సిందిబోయి ఈ ఎండా వానల్లో గబ్లెంటబడి, కంపా, డొంకా దాటుకుంటూ దిరగడవేందిసార్......" అన్నాడు రెడ్డి.

చిన్ని కన్పించింది వాడికి. దానివేపే చూచాడు.

"అబ్బో! మా సెలాకీపిల్లే" అన్నాడు.

"ఏం! పెండ్లి చేసుకుంటావా? అడగమంటావా ఏం?"

# ఆకులూ-ముళ్ళూ

25-వ పేజీ తరువాయి

"ఛూ! పల్లెటూరిది! మాంచి పట్నవాసం పిల కల్ని వదిలి ఈ మట్టికంపేం ఖర్మసార్ నాకు!" అన్నాడు వాడు. మూర్తి నవ్వుకున్నాడు.

ఆరోజు డిస్పెన్సరీనుంచి వచ్చేసరికి రాత్రి తొమ్మిదయింది. రెడ్డి కన్పించలేదు....

"రెడ్డి....రెడ్డీ...." అని పిలిచాడు తను....

"వస్తుండా...." అన్నాడు రెడ్డి తోటలోంచి వచ్చి.

"జాగ్రత్త రెడ్డీ ! పాములుంటాయి ! పల్లెటూరిది....మన పట్నంకాదు...." అన్నా డతను.

రెడ్డి మాట్లాడలేదు .... ఇద్దరూ కారియర్ లోంచి భోంచేశారు...ప్రొద్దున్నేలేచి బస్సుకుపోయాడు రెడ్డి....మళ్ళీ రెండు నెల్లకుకాని అతను రాడు...

మూర్తికి రెడ్డివెళ్ళిపోయిన తర్వాత మనసంతా అదోలాగు అయింది. రెడ్డి ఎంత సరదాగావుంటాడు! అతనూ తనలాగు గతాన్ని మరిచిపోడానికి ప్రయత్నించుతూ వుండాలా ప్రతిక్షణం? అతనికేం ఖర్మ! రెడ్డి అన్నమాటలు నిజమనిపించాయి. ఈసరికి తను పట్నంలో ప్రాక్టీసుపెట్టి, హాయిగా తిరగాల్సింది....రంగునీళ్ళు పోసినా మంచి రూపాయలే ఇస్తారు పట్నం ప్రజలు....ఎలాగూ నాగరీకులు కదా!

కాని తనకా జన సమ్మర్దం, కృత్రిమ వాతావరణం పడదు. స్వేచ్ఛ, నిరాడంబర జీవితండాక్టరుగా తన పని నిర్వర్తించుకోవడం.... ఇంతే తనకు కావల్సింది....ఈ ప్రజలంతా తనమీద ఎంతో ఆశలు పెట్టుకుని వస్తారు....పాముకాట్లు, మలేరియా, మశూచి, దెబ్బలు—అన్ని రోగాలూ తనకు చూపుతారు. కుదిరేదాకా తనమీదే ఆధారపడతారు... తర్వాత ఎన్నాళ్ళయినామర్చిపోరు....రూపాయనోట్లతో తన ఋణాన్ని చెల్లించరు .... పైరుగాలి లాంటి స్వచ్ఛమైన మనసుల్లో దాచుకుంటారు.... కృతజ్ఞతని....

* * *

చాలా రాత్రయింది. మూర్తికి ఏమీ తోచటం లేదు. యాంత్రికంగా పని సాగిస్తూ వున్నాడతను. ఇంజక్షన్‌లూ, మందులూ అయిపోతున్నాయి. కొందరు బాగుపడుతున్నారు.... కొందరు హఠాత్తుగా తిరిగిపోతున్నారు. జీవన్మరణాల పోటీ.... చుట్టూతా కీచురాళ్ళ ధ్వని. పొలంలోంచి నక్కల అరపులు అప్పుడప్పుడూ విన్పించుతున్నాయి.... సిగరెట్ అవతల పారేశాడు. డాక్టర్ మూర్తి. అగ్గి పెట్టెకోసం జేబు తడిమాడు.

## చిన్నపిల్లల ప్రశ్నోత్తరాలు

1. ప్రపంచపు జనాభా ఎంత ?

2. ఏ మిఠాయిలు మీకు మీ బొమ్మ విలువనిస్తాయి ?

నైజామ్ షుగర్ ఫ్యాక్టరీ లిమిటెడ్,
హైదరాబాదు (ఎ.పి.)

NSZ-1310 TG



కల్ కెమికోవారి

# కాస్టొరాల్

*ముచ్చటగా జుట్టు ముడుచుకోడానికి*

కల్ కెమికోవారి కాస్టొరాల్‌ను రాసుకొని ఆమె జుట్టును ముడుచుకుంటే. ఎంత అందంగా కనువిస్తున్నదో చూడండి.

కాస్టొరాల్ అసామాన్యమైన గుణాలు ఆమెకు తెలుసు. ప్రకృతి సహజమైన సువాసనలీనే నూనెలు ఇందులో వున్నందున జుట్టు వొత్తుగా పెనుగా పెరగడానికి ఇది దోహద మివ్వగలదు.

CASTOROL

దీ కలకత్తా కెమికల్ కంపెనీ లిమిటెడ్, కలకత్తా - 29

సౌత్ ఇండియా ఆఫీసు : 5/149, బ్రాడ్వే, మద్రాసు - 1.

CAS 1/61-63 TE


## ఆకులూ - మ. శర్మ

ఎక్కడ్నుంచో సన్నగా ఏడుపు వినిపించింది. అతనికి. వూపిరి బిగవట్టి విన్నాడు. సందేహంలేదు. ఎవరో వెక్కి వెక్కి ఏడుస్తున్నారు. ధ్వని వచ్చినవేపు చూశాడు మూర్తి. చిన్ని గుడిసె కన్పించింది. వెన్నెల్లో సగం కూలిపోయిన గుడిసెలోంచి దీపం కాంతిని బలహీనంగా వెదజల్లుతూంది బయటికి.

తలుపు దగ్గరగావేసి, టార్చిలైటు చేతపట్టి, అటువేపు బయలుదేరాడు. నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ ఏడుపు నెమ్మదిగా, సన్నగా వినవస్తూంది. తలుపు దగ్గర తటపటాయిస్తూ నిలబడ్డాడు మూర్తి. లోనికి తొంగిచూచాడు.

కుక్కిమంచంమీద తలపెట్టుకుని కూర్చునివుంది చిన్ని. ఆమె తలకు దగ్గరగా పొయ్యివుంది. ప్రక్కనే చెక్క పెమ్మమీద చమురు దీపం వెలుగుతూవుంది. కదిలే దీపపుజ్యోతి గుడిసెలోకి వికృతపు ఛాయల్ని వంపింది....ఏడుపుతో అలిసిపోయిన చిన్ని దేహం వుండి వుండి కంపించింది....ఏడుపు సన్నగా వచ్చింది.

"చిన్నీ" అన్నాడు నెమ్మదిగా మూర్తి ద్వారం దగ్గర్నుంచి. ఉలికిపడిలేచి నుంచుంది చిన్ని. భయం చేత దూరంగాపోయి నిల్చుంది. దీపంకాంతిలో ఆమె శరీరం నీడలు గోడమీద కదిలాయి....

"నేను చిన్నీ" అన్నాడు మూర్తి లోపలికివచ్చి. చిన్ని చినిగిన పమిట సర్దుకుంది. తలవంచుకుని. నిలబడింది అక్కడే. మూర్తి పొయ్యివేపు చూశాడు. "రాత్రి అన్నం వండుకోలేదా?"

తలూపింది అడ్డంగా చిన్ని.

"ఊఁ మరి ఏడుస్తున్నా వెందుకూ?"

సమాధానంగా కూలబడిపోయింది చిన్ని. వళ్ళు కదిలిపోయింది ఆమె ఆక్రందనతో. మూర్తి దగ్గరగా వచ్చాడు. ప్రక్కనే కూర్చున్నాడు.

"చిన్నీ, ఏమిటి? ఏమయింది?" అన్నాడు లాలనగా, అడ్డంగా వద్దన్నట్టు తలూపింది చిన్ని.

"నాతో చెప్పు చిన్నీ! నేను....ఏమయింది? నాయుడుగారి పాలేరు కొట్టాడా? చెప్పు?"

చిన్ని శోకం ఎక్కువయింది. కళ్ళవెంబడి నీరుకారి మట్టిలో ఇంకిపోయాయి.

గాఢంగా నిట్టూర్చి, లేచి నిల్చున్నాడు మూర్తి. ద్వారం దగ్గరగా నిల్చున్నాడు. తలుపు మీద చేయివేసి, క్షణం ఆగాడు.

"భయంగావుంటే నా గదిబయట పడుకో" అన్నాడు. చిన్ని మాట్లాడలేదు. బరువుగా అడుగులు వేస్తూ, గదివేపు పోయాడు మూర్తి. గుడిసె తలుపువేసి.

మూర్తి మరో సిగరెట్ వెలిగించాడు. దాదాపు రెండు నెలలనుంచి చిన్ని అదోమాదిరివుంది. పనులు చేసే వేళలోకూడ పరధ్యానంగా వుంటూంది. మొన్న ఒకరోజు నీళ్ళు తోడకుండా బావిదగ్గరే కూర్చుండిపోయింది. ఎన్నిసార్లో పిలిచింతర్వాతకాని ఈ లోకంలోకి రాలేదు. అప్పుడు కూడా చేత్తో కండ్లు తుడుచుకుంటూ బావిలో చెదవేసింది.

"ఇంకా పసిదేకదా! ప్రపంచంలో ఎవరులేరు పాపం! ఒంటరితనం భరించలేకపోతూంది" అను

కున్నాడు మూర్తి. సాయంత్రం వెంకన్నతో అన్నాడు "ఏం వెంకన్నా, చిన్నికీ, నీకూ ఏమయినా చెడిసిందా?'

వాడదోమాదిరిగా చూచాడు దానివేపు.

"ఏందో దొరా! ఈ మద్దిన మనిసే మారి పోయింది. చనం కూకోదు....కూడు దిందు.... ఏదో ఆలోచన.....ఏందే అంటే జవాబు సెప్పదు.... ఏమో రోగం దొరా....నాకేం దొరకటంలేదు" అన్నాడు వాడు.

"తగూలు పడ్డాయా? ఏమన్నా అన్నావా?"

"యాడిదిదొరా! దాంసంగతి నాకు తెల్దా! నా ప్రాణంబోయినా దాని వంటిమీద ఈగవాల్ని స్తానా?" అన్నాడు వాడు పౌరుషంగా. మూర్తి నవ్వుకున్నాడు.

"అయినాదొరా, ఈ రెండు మూడు నెల్లూ ఏందో మాదిరిగుందయ్యా తీరు! దగ్గిర జేరనీదు... ఏడుస్తది. మాట్లాడబోతే....నాకేంతోచదు దొరా"

*  *  *

మూడు నాలుగు నెలలు గడిచాయి.

ఆమధ్య రెడ్డిరాలేదు. మళ్ళీ తన దగ్గరకు. కంట్రాక్టు వ్యవహారాలూ అవీ చూసుకుంటూ వుండి వుండాలి అనుకున్నాడు మూర్తి. అప్పటికి నాయుడుగారి తోటలో అవిశచెట్లు చాలా పొడుగు ఎదిగాయి. వాటికి పురుగు పట్టకుండా వెంకన్న, చిన్ని పొద్దుట్నించి కాచుకుని కూర్చునేవారు.... ప్రతి అవిశచెట్టుకూ ప్రాకించారు తమలపాకు తీగల్ని. కొద్ది కొద్దిగా, దిన దినానికీ తీగలుపాకి అల్లుకున్నాయి. నెలరోజుల్లో అవిసె చెట్లన్నీ పైదాకా తమలపాకులతో నిండిపోయాయి.

"ఏం వెంకన్నా, ఎలావుందిప్పుడు...." అని అడిగాడు ఒకరోజు. తోటకి నీరు పెడుతూన్నాడు వెంకన్న. దారిలోపడ్డరాళ్ళూ, ఆకులూ, కుళ్ళిపోయిన తమలపాకులూ తీసి పక్కన కుప్ప పెడుతున్నాడు వాడు.

"ఏందో దొరా! నిజం చెబుతా ఇనండి! అది చాలా మారిపోయింది దొరా! పొద్దు కూకకూడదు గుడిసెలోంచి బయటికిరాదు....కూడా తాకడంలా. ఎంతసేవూ ఏడుపు....మొన్న అవిశచెట్లకాడ పడిపోయింది....ఎత్తుకుబోయి పండబెట్టినా మంచం కాడ....లేచింది మొదలు నన్ను పొమ్మని ఏపించింది. ఏందో దొరా! పెండ్లికాకముందే ఇట్టావుంది.... అయిన పిట ఇంక...."

"నాతో చెప్పలేదేం వెంకన్నా...." అన్నాడు మూర్తి.

"చెప్పనని ఒట్టేయించుకుంది దొరా" అన్నాడు వాడు.

మాట్లాడకుండా గదిలోకి పోయాడు మూర్తి. చాలా విచిత్రంగావుంది అనుకున్నాడు చిన్ని ప్రవర్తన.

మరునటిరోజు వెంకన్న మాటల్లో చెప్పాడు జాగ్రత్తగా ఉండమని....

"దొరా! చిరుతపులి తిరుగుతూండది పొలాల్లో! రేత్రిళ్ళ జాగ్రత్త దొరా! నీడల్లో ఉంటది...."

"చిరుతపులి ఎక్కడిదోయ్...." అన్నాడు మూర్తి.

"మీకు తెల్దుగావాల! తోట కవతల వాగుందిదొరా! నీళ్ళ కొస్తది...అబ్బో! చానా జూసినా నేను.... నిన్నరాత్రి గావాల నాయుడిగారి కుక్క ఒకటే మొరుగుడు....పొద్దున చూసినా దొరా....బురదలో కనపడినాయి గుర్తులు....చిరతే అది!"

తలూపాడు మూర్తి. ఒకరోజు కాదుకదా! ప్రతి రోజూ జరిగేదానికి భయం దేనికి. మృత్యువుతో పోటీపడి పరుగెత్తడం, ఓడటం, గెలవటం అన్నీ తనకు తెలిసినవే! ఇదీ ఒక రకం అందులో.

ఆ మరునటినెల్లో రెడ్డి వచ్చాడోరోజు. సాయంత్రం డిస్పెన్సరీనుంచి వచ్చేసరికి కూచునివున్నాడు. తన్ని చూచి, చుట్ట పారేసి, నవ్వాడు.

"ఏం రెడ్డీ, మర్చిపోయావ్ నన్ను!" అన్నాడు మూర్తి.

"ఏందిలేసార్! ఈనెల్రోజులూ గడిచింది చాలు! అబ్బ! ఏం పని! యాడవచ్చేదానికి వీలుంటేగద!" అన్నాడు రెడ్డి సంచీ ఇస్తూ.

"ఇయ్యి మీ అన్నగారు పంపినారు....ఇది మీరు రాసినారంటనే ఆ మందులు .... పెద్దమ్మగారు మిమ్మల్ని చానా అడిగినారు....బాబూ! తెలీక అడగతా గానీ, ఏందీ యవ్వారం! హాయిగా టౌన్లో కాపురం బెట్టక ఈ యడివిలో....ఏందయ్యా?" అన్నాడు రెడ్డి. మూర్తి మందులు లోపల పెట్టి వచ్చాడు. స్టౌ వెలిగించాడు. కాఫీ మూతతీసి, రేకుకోయ సాగాడు.....నీళ్ళు వేడెక్కుతూన్నాయి.

"సార్.....సిన్నదింకావుండదే ఈడ్నె....." అన్నాడు రెడ్డి నవ్వుతూ బయటకువచ్చి. మూర్తి కిటికీలోంచి చూచాడు. గుడిసెబయట కూర్చుంది చిన్ని. రెడ్డిని చూడగానే గిరుక్కున దిరిగి తోటలోకి పోయింది.

"ఓయబ్బో.....ఇంకానా...." అన్నాడు సన్నగా రెడ్డి మీసాలు తాకుతూ....మూర్తి చూచీ చూడనట్లు కాఫీ తయారుచేయటంలో నిమగ్నుడయ్యాడు.

"రాత్రి కుంటావుగా" అని అడిగాడు మూర్తి కాఫీఇస్తూ రెడ్డికి. రెడ్డి లేచి, అందుకుని, తలూపాడు సాలోచనగా....

మూర్తి నవ్వుకున్నాడు. గుడిసెవేపే ఎంతసేపూ రెడ్డి దృష్టి.... పోయిన సారయితే మరీనూ.

"రెడ్డీ....పెండ్లి చేసుకోవా నీవు...."

రెడ్డి నవ్వాడు చిత్రంగా. తలూపాడు.

"నక్కట సిన్నది దొరికితేకదా! చేసుకునేది" తోటలోంచి వచ్చింది చిన్ని....

"చిన్నీ...." పిలిచాడుమూర్తి....తలెత్తిచూచింది.

"ఈ గిన్నెలు కడిగిపెట్టుతావా?"

నిశ్శబ్దంగా వచ్చింది చిన్ని. కప్పులు తీసుకుని ఎవరివేపూ చూడకుండా వెళ్ళిపోయింది. గుడిసె దగ్గరకు....రెడ్డి చుట్ట వెలిగించి తోటవేపు నడిచాడు....

ఆరోజు రాత్రి చాలా అలిసిపోయి గది చేరాడు మూర్తి. సాయంత్రం అయిదుమైళ్ళు దిరిగాడు దాదాపు...వచ్చీ రావడంతోనే నాయుడుగారు పంపిన కారియర్ విప్పి, భోంచేశాడు. సిగరెట్ వెలిగించి పడుకున్నాడు. రెడ్డి బయట పచార్లు చేయసాగాడు.

"రెడ్డీ మరిచాను! రాత్రిళ్ళు చిరుతపులి ఒకటి తిరుగుతూంది....బయట జాగ్రత్త" అన్నాడు.

పది నిముషాల్లో నిద్ర పట్టింది మూర్తికి.

*  *  *

పొద్దున్నే కేకలువిని నిద్రలేచాడు మూర్తి. రెడ్డిలేడు ప్రక్కన. తలుపు దగ్గరగావేసివుంది. తలుపుతీసిచూచాడు మూర్తి. వెంకన్న పరుగెత్తుకుంటూ వస్తున్నాడు చెట్లమధ్యనుంచీ. బయటికి వచ్చాడు మూర్తి ఆతురతగా.

"ఏమయింది వెంకన్నా?" అని అడిగాడు.

"ఘోరం దొరా! రెడ్డిగావాల్ను! చిరత కొట్టింది!"

పరుగెత్తారు ఇద్దరూ తోటలోకి.

ఘోరం కన్పడింది తోటకు పడమర కంచె దగ్గర....అవిసె చెట్లమధ్య ఈగలు మూగుతూ వుండగా పడివుంది రెడ్డి శవం....ముఖంఅంతా



"ఏమిటయ్యా ఊరివీధులనిండా ఎక్కడపడితే అక్కడ చెత్తకొాయితాలు.?"
"ఊరుశుభ్రంగాఉంచాలనికోరుతూ మునిస్పల్ కమిషనర్ గారుపంచిపెట్టిన కాయితాలు ఇవి."

వికృతంగా గాట్లుపడివున్నాయి. కళ్ళు బయటికి వచ్చేశాయి. గడ్డకట్టిన నెత్తురు రూపుమార్చి వేసింది.

"వెంకన్నా, పొలెంపోయి హెడ్ కానిస్టేబుల్ని పిల్చుకురా! దార్లో కరణంగారితో, నాయుడుగారితో చెప్పు"

రాత్రి చుట్ట తాగుతూ వచార్లు చేయటం చూచాడు తను....వెళ్ళవద్దనికూడా చెప్పాడు తను.... ఇలా అవుతుందని తెలుస్తే! చిరుత!

మధ్యాహ్నానికి స్టేటుమెంటు కానిచ్చాడు కానిస్టేబులు. పంచాయతీచేసి, చిరుత కొట్టిందని నిర్ణయించారు. ముఖంనిండా గోళ్లతో పీకినట్లు తెలుస్తూనేవుంది....గుడ్డలూ, జుత్తూ కూడా రేగిపోయి, చిరిగి వున్నాయి....

జరిగిన సంఘటన మూర్తిని కదిల్చివేసింది. ట్రాన్స్ఫర్‌కు పిటీషన్ పెట్టుకున్నాడు....స్వయంగా పోయి డి. యం. వో నూ కలిసి, సరేననిపించివచ్చాడు. మరోనెలలో పట్నం చేరవచ్చునని కొంత తనకుతానే సమాధానం చెప్పుకున్నాడు....

పట్నంనుంచి వచ్చినరోజురాత్రి నిద్ర పట్టలేదు మూర్తికి. సిగరెట్లు పీలుస్తూ పచార్లు చేయసాగాడు.

రెడ్డి మరణం అతన్ని బాధించసాగింది. నవ్వుతూ, చుట్ట తాగుతూన్న రెడ్డి! ఎలా చావాల్సివచ్చింది.... చిన్ని అంటే అంత చులకనా, తమాషా అతనికి.... ఏదో అర్థం కాలేదు అతనికి. పులి కొట్టిందనే అందరూ అంటున్నారు....తనకు నిద్రలో ఏమీ తెలియలేదు.....అరుపులు ఎవరూ వినలేదు..... అసలు చిరుత అతివేగంగా మీదపడుతుందనీ, గొంతు పీకేస్తుందనీ అంటారు....

పచార్లు ఆపాడు మూర్తి. గుడిసెవేపునుంచి మళ్ళీ మూలుగు వస్తూంది ఆవేపు నడిచాడు. ఏమిటో తెల్సుకోవాలి ఈరోజు.

ద్వారందగ్గర నిలబడిపోయాడు. లోపల కుక్కిమంచంమీద మెలికలు తిరుగుతూంది చిన్ని..... దీపం గాలికి కొట్టుకుంటూంది ఆమె కళ్ళవెంబడి నీరు ధారగా కారిపోసాగింది. వెళ్ళి ఆమె చేయి పట్టుకున్నాడు. చిన్ని కండ్లువిప్పిచూచింది....బాధతో 'అబ్బా, అమ్మా' అని అరవసాగింది. మూర్తి ఆశ్చర్యపోయి చూచాడు ఒళ్ళు కాలిపోతూంది.... పైగా....ఆమె గర్భవతి!

మూర్తి మళ్ళీ పరీక్షగా చూచాడు ఆమె శరీరం వేపు....కనీసం ఆరేడు నెలలు వుండాలి! కాని— ఎలా సాధ్యం! చిన్ని ఇన్ని రోజులూ.....

"చిన్నీ....ఏమిటిది ..."

"బాబూ చచ్చిపోతున్నా" అంది చిన్ని ఏడుస్తూ. మెలికలు తిరిగిపోతూవుంది. నోట్లోంచి చొంగ రాసాగింది....మూర్తి త్వర త్వరగా గది చేరుకున్నాడు. మందులసంచీతో సహా తిరిగి గుడిసె చేరాడు. వెంటనే ఒక ఇంజక్షన్ ఇచ్చాడు.....కొద్ది సేపట్లో నిద్రపోయింది చిన్ని. ఆమెకు జాగ్రత్తగా గుడ్డ కప్పి, ప్రక్కనే పడకకుర్చీ వేసుకుని కూర్చున్నాడు మూర్తి.

# ఆకులూ–వంకళ్ళూ

ప్రొద్దు పొడిచింది. పక్షుల అరుపులకి కండ్లు తెరిచాడు. ఎదురుగా నిద్రబోతూ కన్పించింది చిన్ని......నీరెండలో జాగ్రత్తగా చూచాడు...... సందేహంలేదు.....

తను ఇన్నాళ్ళూ చిన్ని వేదన అర్థం చేసుకోలేకపోయాడు! కాని, ఈ దుర్మార్గానికి ఒడిగట్టిన వాడెవడు! వెంకన్నా! లేక మరెవరు?

నిసుగ్గా లేచి గది చేరుకున్నాడు మూర్తి. ముఖం కడుక్కుని, షేవ్ చేసుకుని స్నానం చేసాడు బావి దగ్గర. డ్రస్ చేసుకుని బయలుదేరాడు.....ఎదురుగా తల వంచుకుని నిల్చునివుంది చిన్ని.

"ఏంకావాలి?" అని అడిగాడు మూర్తి కొంత కఠినంగా. తలెత్తలేదు చిన్ని. అలాగే దగ్గరకు నడిచాడు.

"ఏంకావాలి చిన్నీ...." ఆప్యాయంగా అడిగాడు.

---

ఒక పుస్తకాల కంపెనీకి ఉత్తరం వచ్చింది. "అదేదో నవల-దానిపేరు గుర్తు రావటం లేదు గాని-వెంటనే పంపండి. ఒక అబ్బాయి ముందు ఒక అమ్మాయిని ద్వేషించి, ఆమె చాలా అందకత్తె అని తెలుసుకున్న తరువాత ప్రేమించి పెళ్ళిచేసుకుంటాడే ఆ నవల!"

కంపెనీ గుమాస్తా ఉత్తరం చదివి ఆముదం త్రాగిన మొహం పెట్టాడు.

పి. అనసూయ (నిడుబ్రోలు)

---

"నాకు బిడ్డవద్దు" అంది చిన్ని ఒక్కసారిగా ఏడుస్తూ.

ప్రాన్పడి నిలబడిపోయాడు మూర్తి.

"అంటే?"

"తలెత్తిచూచింది చిన్ని. కండ్లలో నీరు తిరిగాయి మూర్తికి. తను చేయని నేరానికి ఈ పిచ్చిపిల్ల శిక్ష ఎందుకు పొందాలి? వేరే మార్గంలేదా?

"నాకు బిడ్డవద్దు. మీ ఇష్టమొచ్చిన మందీయండి" అంది. తలవంచుకుని నిల్చున్నాడు మూర్తి.

"ఇప్పుడిహ లాభంలేదు......ఆపరేషన్ చేయాలి" కాస్సేపు చిన్ని మాట్లాడలేదు. మూర్తి భయపడ్డాడు. అబార్షన్ చేయటం—అసలు చట్టరీత్యా తప్పు. తను ఇంతదాకా దొంగ మెడికల్ సర్టిఫికేట్లు కూడా ఇవ్వలేదు ఎవరికీ.

"ఎప్పుడు?" అంది చిన్ని.

మూర్తి తలెత్తిచూచాడు. మంచికోసం తప్పు చేయవచ్చా? డాక్టర్‌గా తను ఏం చేయాలి!

"ఎల్లుండి....ఎవరోతోనూ చెప్పవుకదా!" అన్నాడు. చిన్ని వెళ్ళిపోయింది....భారంగా అడుగులు వేస్తూ, నడిచిపోయాడు మూర్తి.

రెండోరోజురాత్రి ఆపరేషన్‌కి అంతా సిద్ధం చేశాడు.....చిన్ని ఏడవసాగింది. ధైర్యం చెప్పాడు మూర్తి.

ప్రొద్దున్నే వెంకన్నతో రాత్రివేళ చిన్నికి కడుపులో ఆపరేషన్ చేసినట్లు చెప్పాడు.

ఆ తర్వాత మూడు రోజులకు ట్రాన్స్ ఫర్ ఆర్డర్స్ వచ్చాయి మూర్తికి. ఆనందంగా అందుకున్నాడు వాటిని. సరంజామాఅంతా సర్దివేశాడు. వూర్లో అందరికీ సెలవు చెప్పాడు. నాయుడుగారు ఎంతో మెచ్చుకున్నారు. సాయంత్రం బస్సుకి పోవాలనగా, మధ్యాహ్నం భోంచేసి కూర్చున్నాడు గదిలో తృప్తిగా మూర్తి. వెంకన్న వచ్చాడు.

"మళ్ళా ఏనాడో బాబూ తమ దరసనం" అన్నాడు.

"వెంకన్నా,చిన్నినెప్పుడు పెండ్లి చేసుకుంటావు"?

"తమ దయదొరా! ఈ నెల్లోనే! నిన్న అడిగినా! నవ్వింది దొరా! అంతా మాయ! తమ చేతులి సలవ!"

పర్సులోంచి పదిరూపాయలు తీసిఇచ్చాడు మూర్తి.

"పెండ్లికి చిన్నికి చీర కొనిపెట్టు" అన్నాడు. దండంపెట్టి అందుకున్నాడు వెంకన్న నోటుని.

చిన్ని! నవ్వుకున్నాడు మూర్తి....వెంకన్న బాగానే చూచుకుంటాడు....అసలీ సంగతి ఎవరికీ తెలియా పక్కర్లేదు.....తను ఎవరికీ చెప్పడు—చిన్ని కోసం.... చిన్ని చెప్పదు.....మూడోవాడు......ఎవరు?

వెంకన్ననాయుడిగారింటివేపు పోయాడు దండాలు చెప్పి. తోటలోకి నడిచాడు మూర్తి. ఆఖరుసారి కాబోలు........ఈ అవిశతోటలో ఈ చెట్లమధ్యనే చిన్ని కన్పించింది....

"చిన్నీ నేను పోతున్నాను....మళ్ళీ మనం కలుసుకోము. ఒక్క సంగతి నిజం చెప్పు....నీకు అన్యాయం చేసిన దెవరు? నే నెవ్వరికీ చెప్పను.....ఎవరు?"

చిన్ని ముఖంమీద కారుమబ్బులు నిలిచాయి. అవిశచెట్లకు తమలపాకులు పెనవేసుకున్నాయి. తలవంచుకుంది చిన్ని జవాబీయకుండా.

"చెప్పు....చిన్నీ.....ఎవరు?"

ఏదో చెప్పబోయి ఆగింది. మూర్తి కదిలాడు.

"రెడ్డి...." కూలబడిపోయింది చిన్ని. మూర్తి షాక్ తిన్నట్లు చూచాడు. రెడ్డి....తనకు తెలుసా?

"మరి రెడ్డి......చిరుతపులి...." మనస్సు ఎదురు తిరిగింది.....కూలబడిపోయిన చిన్ని కుడిచేతికీ, తర్జనికీ ఎండతగిలి తళుక్కుమంది....మూర్తి చూచాడు. చిన్ని రెండు వ్రేళ్ళకీ తమలపాకులు కోసేందుకు ఇనుపగోళ్ళు—పులి పంజాల్లాగా వున్నాయి. ★

# మనమూ-మనదేహస్థితి

21-వ పేజీ తరువాయి

**గట్టిగా అదిమి కట్టి, కొంతకాలం ఉంచి ఆ తరవాత పరీక్షిస్తే, వెండికడ్డీలో బంగారం కణములూ బంగారం కడ్డీలో వెండికణములూ కనుపిస్తవి.**

ఇట్లా ఒక వస్తువులో కణములు మరొక వస్తువులోకి వ్యాపించడమును "ప్రసార లక్షణము" అంటారు. ఇంగ్లీషులో 'డిఫ్యూషన్' (Diffusion) అంటారు. ఇందుకు కారణము వస్తువులలో ఉన్న కణములమధ్య ఖాళీ ప్రదేశములు ఉండడమే. వాయువులలో ఈ ఖాళీలు ఎక్కువగా ఉంటవి. అంటే అందులో కణములు దూర దూరంగా ఉండి, అటూ ఇటూ కదులుతూ ఉంటవి. ద్రవపదార్థములలోనూ ఖాళీలు ఉండడమేకాక, అందులో కణములూ కదులుతూనే ఉంటవి. ఘనపదార్థములలోనూ యింతే. ఈ కణముల చలనమునుగానీ, వాటి మధ్య ఖాళీలను గానీ మన దృష్టి కనిపెట్టలేదు. వాయువులో కణములను ఒక మైదానంమీద పరుగెత్తుతూ ఉండే ఆటగాళ్లతో పోల్చవచ్చును. ద్రవపదార్థములో కణములను సినిమాహాల్లో కూర్చున్న ప్రేక్షకులతో పోల్చవచ్చును. ఘనపదార్థములో కణములను మెయిలులో మూడవక్లాసులో క్రిక్కిరిసి కూర్చున్న ప్రేక్షకులతో పోల్చవచ్చును.

అయితే కణము (Molecule) లన్నవి అన్నీ ఒకేరకం కాదు. ఒక పంచదార కణమునో ఉప్పు కణమునో చితకకొడుతూ పోతే, ఇక చితక గొట్టడానికి వీలులేనంత చిన్నకణములు ఏర్పడతవి. ఆతర్వాత వాటిని ఛిన్నాభిన్నము చేయడానికి వీలులేదు. ఏ సూక్ష్మకణానికి పంచదార లక్షణములో ఉప్పులక్షణములో ఉంటూ ఇక ఛిన్నంచేయడానికి వీలుండదో ఆ కణమును 'మాలిక్యూలు' అంటారు. మనం 'కణము' అందాము. కణము అనేక అణువులు కలిసి ఏర్పడుతుంది. కణములో అణువులను విడగొట్టడం తేలికపని కాదు. అందుకు మహత్తరమైన శక్తి ప్రయోగం జరగాలి. ఆ శక్తి రసాయనికం కావచ్చు. విద్యుచ్ఛక్తి కావచ్చు. ఒక వస్తుఖండంలో కణములూ అందులో అణువులూ అనుక్షణమూ అతి వేగంగా చలిస్తూనే ఉంటవి. భూమి చలిస్తున్నా మన మా చలనమును గుర్తించలేనట్లే, వస్తువులో కణముల, అణువుల చలనమునుగానీ, ఆ చలన వేగమునుగానీ గుర్తించలేము. వస్తువు ఉష్ణ శక్తిప్రభావానికి గురి అయినప్పుడు, అందులో కణచలనము అధికమై ఒకదానితో ఒకటి ఢీకొనడము అధికమౌతుంది. కణముల మధ్యప్రదేశమూ అధికమౌతుంది. అందువల్లనే ఎండాకాలములో రైలుపట్టాలమధ్య ఖాళీప్రదేశం తగ్గిపోతుంది. గిన్నెలో నీరుపోసి మూతపెట్టి నీటిని మరగబెడితే కొంతసేపటికి ఆవిరి పీడనశక్తివలన గిన్నె మీద మూత ఎగిరిపోతుంది. ఇందుకు కారణములు కణమధ్యప్రదేశమూ, కణగమనవేగమూ అధికం కావడమే. వస్తువు మూడు స్థితులలోనూ చలనములలో భేదం ఉన్నది. ఘన పదార్థములలో చలనము చెట్టు గాలిలో పొందే చలనము వంటిది. దాని మూలము కదలదు. దాని చలనానికి ఒక గతి క్రమమూ ఉంటవి.

కణము, వివిధములయిన అణువుల సంయోగమువలన ఏర్పడుతుంది. అయితే అన్ని వస్తువులలోనూ ఇలా ఉండాలని లేదు. కొన్ని వస్తువులు ఒకేరకం అణువుల కలయికవల్లనే ఏర్పడుతవి. ఉదాహరణంగా హైడ్రోజను అనే వాయువులో అణు, కణ భేదం లేదు. నీటికణము, రెండు హైడ్రోజను అణువులు ఒక ఆక్సిజను అణువు కలిసి ఏర్పడ్డది. ఇట్లా వస్తువంతా ఏకజాతి అణువులతో ఏర్పడ్డప్పుడుతప్ప అణువులు స్వతంత్రంగా, ఏకాకులుగా ఉండలేవు. అవి ఇతర అణువులతో చేరి కణములుగా ఏర్పడిపోతవి. అణు లక్షణములు వేరు. కణము లక్షణములు వేరుగా ఉంటవి. కేవలం అణువులవల్ల ఏర్పడ్డ వస్తువులను మూలవస్తువులు అంటారు. (Elements) వివిధ అణువుల కలయికవల్ల ఏర్పడ్డ కణముల కలయికతో ఏర్పడిన వస్తువులను సంయుక్త ద్రవ్యములు (Compounds) అంటారు. మూలద్రవ్యములు, 'లోహములు', అలోహములు అని రెండురకములు. (Metals & Nonmetals)

'ఏటం' (Atom) అన్న మాటకు "కోయరానిది' అని అర్థము. అంటే ముక్కలు చేయరానిది అన్నమాట. పాశ్చాత్యశాస్త్రజ్ఞులలో డెమోక్రిటన్ అనేవాడు క్రీస్తుకు పూర్వము 400 సంవత్సరములకు ముందు, వస్తువు కంటికి కనుపిస్తున్నట్లుగా అవిచ్ఛిన్నముకాదనీ అది కణముల మయమనీ వాటిమధ్య ఖాళీ లున్నవనీ వస్తువు సూక్ష్మాతిసూక్ష్మభాగము, అవిభేద్యమైన ఒక సూక్ష్మరేణువనీ భావించి దానిని 'ఏటం' అన్నాడు.

మన ఋషులు అణువు అవిభేద్యమని ఏనాడూ అనుకోలేదు. అణువు పరమాణువు అవుతుందనీ పరమాణువు తన్మాత్ర అవుతుందనీ మూలప్రకృతి తన్మాత్రలమయమనీ భావించారు.

మూలవస్తువులన్నీ అణు సమూహములే. 1940 నాటికి 92 మూలవస్తువుల ఉనికిని శాస్త్రజ్ఞులు కనిపెట్టేరు. 1869 నాటికి యిన్ని మూలద్రవ్యము లున్నవని శాస్త్రజ్ఞులకు తెలియదు. మూలవస్తువుల లక్షణములను పరిశీలించి "మెండలజీవు" అనే రష్యను శాస్త్రజ్ఞుడు, ఒక పట్టీ తయారుచేసి, సృష్టిలో ఉన్న అణువు లన్నింటినీ మనం కనుక్కోలేదనీ, హైడ్రోజనుతో ఆరంభించి, 99 అణువులు ఉండాలనీ, అవి కాలక్రమాన బయటపడతవనీ ఊహించాడు. అతని జోస్యం సరిగా జరిగింది. ఈనాటికి హైడ్రోజను మొదలు యురేనియము (Uranimus) వరకు 92 మూలవస్తువులు కనిపెట్టబడ్డవి. ఇంకా ఏడు రావాలి. అణువులు పరమాణువుల కలయికవల్ల ఏర్పడ్డవి. పరమాణువుల మధ్య ఉండే శక్త్యాకర్షణవల్ల అవి అవిభేద్యములై ఉన్నవి. తన్మాత్రలను, తన ప్రభావంతో కలిసి అణువులుగానూ రెండూ మూడూ అణువులను కలిపి ద్వ్యణుకములు, త్ర్యణుకములు అయిన కణములుగానూ ఈశ్వరశక్తి ఏర్పరచిందని మన ఋషుల భావన. ఆ ఈశ్వరశక్తిని మూల సంఖ్యతో చేరిస్తే 100 అవుతుంది. ఇదే శత మానానికి మూలాధారం కావచ్చు. ★

## గమనిక

ఆంధ్ర సచిత్ర వారపత్రికకు పంపే రచనలు సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక పేర మాత్రమే పంపాలి. వ్యక్తుల పేర్లు వ్రాయవద్దని మనవి



AGENTS FOR ANDHRA
ఆక్మి ట్రేడ్ ఏజన్సీస్
విజయవాడ-1


# విడీ విడని చిక్కులు

16-వ పేజీ తరువాయి

"ఆఁ .... యిదో" నంటూ సిగరెట్‌ను కాలి క్రింద నలిపేసి క్రిందకు పరిగెత్తాడు.

"ఆ కప్పుగురించేనా బామ్మా .... అది నేనే బద్దలు కొట్టాను." అన్నాడు ఒగరుస్తూ.

"శివ ! ఏ కప్పురా?...." ఆవిడ ఆశ్చర్య పోయింది. "ఎందుకు పగలగొట్టావు ?" అంది వెంటనే.

"అదే పగిలింది" అన్నాడు గోముగా.

"పోనీలే, పోతే పోల్లు. ఉంటే గట్టి ...." మనుమ డేదో ఘనకార్యం చేసినట్లు మురిసిపోతూ "భోజ నానికి రా" అంది ఆవిడ.

## 7

సాంబశివంగారు ఇంట్లోకి వచ్చి కోటు తీసి పెగ కొయ్యకు తగిలిస్తూ "లక్ష్మి ఎక్కడ ?" అనడిగాడు.

"ఏమో ! అదెక్కడ చచ్చిందో .... వేలెడులేదు గాని దానికి ఉన్నన్ని పెత్తనాలు ఆ నారదుడికి కూడా ఉండవు .... లలితాంబ భర్తకి కాఫీ అందిస్తూ విసుక్కుంది.

"ఏనా గాకపోయినా, ఇంటికి రాగానే ఉన్నావా ? ఊడేవా ? అని నన్ను గాక, నా పిల్లల్ని గాక .... ఆ దరిద్రగొట్టుదాన్నే అడుగుతారేం .... కాదులే .... నాకు తెలీక అడుగుతున్నాను" ఆమె అక్కసూ, వ్యంగ్యం మిళాయించి అడుగుతుంది.

"అబ్బే ! అబ్బే ! అదికాదూ .... దాన్ని ఉదయం బనీయనొకటి ఉతికి ఆరేయమన్నానూ... అందుకని" నీళ్లనములుతాడు ఆయన.

ఖాళీకప్పు అందుకుని మూతితిప్పి వెళ్లి పోయింది లలితాంబ. సాంబశివంగా రింక లలితాం బతో వృధావాదులాటకు జడిసి లక్ష్మిమాటే ఎత్తలేదు.

రాజ్యలక్ష్మి బితుకు బితుకున ఇంట ప్రవే శిస్తూ ఉండగా, "ఏమే .... పింజారీ ! నీకు ఒచ్చిన ఏళ్లు ఎవరికొచ్చేయి .... వెధవ పెత్త నాలూ, నువ్వూను. ఎక్కడ చచ్చేవ్ ? ...." వీపుమీద ఒక్కచరుపు చరిచింది లలితాంబ.

కిక్కురుమనలేదాపిల్ల. ఆమె ఆయింట పెరు గుతూ ఉండి పదమూడోయేడు. చరిత్రలకా స్వల్పవ్యవధి అల్పమయినదే ఐనా, రాజ్యలక్ష్మిలాంటి పిల్లకి మాత్రం చాలా అనుభవం అనే చెప్పాలి.

రాజ్యలక్ష్మి మాటలాడుతూ జ్ఞానమొచ్చి సాంబ శివం ముద్దుమురిపాలకు నోచుకున్న రోజు ల్లోనే లలితాంబకి తొలికాన్పు కలిగింది. ఆమెను పుట్టింటివారు తొలిచూలు కొడుకునుకన్నది గనుక ఆర్నెల్లుదాకా అట్టేపెట్టుకునిగాని పంప లేదు. అప్పటికి అయిదేళ్లు నిండని రాజ్యలక్ష్మి పట్ల నలుగురూ చూపిన ప్రవర్తన ఆ పసిహృద యంలో తనకి 'అమ్మా నాన్నా' అందరిలాంటి వారూ లేరనే ముద్రను వేసేసింది.

లలితాంబ పుట్టినిల్లు కొవ్వూరుదగ్గర ఓ పల్లెటూరు. సామర్లకోటలో సాంబశివం ఉద్యోగం. వారానికోసారి ఐనా తప్పకండా భార్యాపిల్లల్ని చూసేందుకు వెళ్లేవా డాయన. వెళ్లినప్పుడల్లా అతగాడు భార్యను, కొడుకును చూసి మురిసిపోడం కంటే ఐదేళ్లకూన రాజ్యలక్ష్మిని చూసి రహ స్యంగా వెక్కివెక్కి ఏడ్చేవాడు.

ఆ పసిదానికి నోరు విప్పి పూసగుచ్చినట్లు సాంబశివానికి జరిగినవి చెప్పడం రాకపోయినప్ప టికీ ఆపిల్ల వీపుమీద తేరిన తట్లూ, తొడ పాశాల 'దద్దుర్లూ', పాలబుగ్గలమీద గంట్లూ స్పష్టంగా ఆపిల్ల కాయింట జరిగే ముద్దుమురిపాలగురించి తెలియజేసేవి.

"ఒదినే ఉంటే, నా కీపాట్లు లేకపోను కదా ?" జుట్టులోనికి వేళ్లుపోనిచ్చి కూచున్నాడు సాంబశివం. నాడూ అంతే. నేడూ అంతే.

అంతలో లలితాంబకేక వినిపించింది. కాని ఆయన వినిపించుకోలేదు. "పుట్టకనివ్వకపోయి నంతమాత్రాన పెంచిన మమకార మేమవుతుంది ఛీ! ఇది గుండెకాయలేని ఆడది అని భార్యను? నిందించుకుంటూ లేచాడు.

"ఓసేవ్ ! మొద్దూ .... అలా ఆమూల పోయి కూచోకపోతే ఆయనకి చెప్పరాదుటే? వేణ్ణీళ్ళు పెట్టానని. నాకు ఒళ్లు నొప్పులుగా ఉంది, ఉడుకునీళ్లు కావాలీ అన్న పెద్దమనిషి అవూసు ఎత్తాల్నా వద్దా."

తను ఆలస్యంచేసినా లక్ష్మికే తిట్లు తప్ప వని తెలిసి సత్తువ తెచ్చుకుని సాంబశివంగారు పైమీద తుండు వేసుకుని స్నానానికి వెళ్లాడు. ఐతే వేన్నీళ్లస్నానం ఒళ్లునొప్పులను తగ్గించ గలదేమోగాని మనస్సులోని గాయాలకు అదేం ఉపశమనం కాగలదు?

భోజనందగ్గర అన్నం అటూ ఇటూ కెలుకుతాడేగాని హితవు పట్టించుకోలేకపోయాడు సాంబశివంగారు.

లలితాంబ "అయ్యో ! అదేమిటండీ ఈపూట బొత్తిగా మూడువుంజీల మెతుకులేనా ముట్టు కున్నారు కాదు ?" అని నొచ్చుకుంది. రెండు మూడుసార్లు ఆయన ఏదో రాజ్యలక్ష్మి గురించి అడుగుదామనుకున్నాడు గాని అడగలేక "పాపా బాబూ నిద్దరోయారా ?" అని అడిగాడు.

మళ్లీ రెండునిమిషా లాగి "పాపకి హార్లిక్స్ పట్టావా ?" అనడిగి మరి ఇవాళ సాయంకాలం రాజ్యలక్ష్మి భోజనంచేశాక వాళ్ల "అమ్మమ్మ" గారి ఇంటికి వెళ్లిందా ?" అని భోగట్టాలాగ అడి గాడు.

"ఏమో ! వెధవపీడ. ఈ దిక్కుమాలినదాని కామునిర్ది అమ్మమ్మ?.... ఏమో ఆ మహాతల్లి మీ ఒదిన చచ్చి ఏ స్వర్గాన ఉందోగాని నాకు మాత్రం పోతూపోతూ ఈ పీడ వంటగట్టి పోయింది" అన్నది. మజ్జిగ విసురుగా పోసి అక్క ణ్ణుంచి వెళ్లిపోయిందికూడా.

అన్నం పారేయలేక కతుకలేక ఇబ్బందిపడ్డాడు సాంబశివంగారు.

"ఛీ ! నా పాపాలకి నిష్కృతిలేదు. ఇదే ప్రాయశ్చిత్తం .... ఈ రంపపుకోతే శిక్ష" అను కున్నాడు పదేపదే. ఆయన భోజనం అనగానే ఎంగిలి తియ్యడానికి వచ్చింది రాజ్యలక్ష్మి "రాజూ ! భోంచేశావురా తల్లీ !" జీరపోయిన కంఠంతో రహస్యంగా అడిగా డాయన.

"పెళ్ళి చేసేకా చేస్తా గా ...." అన్న మాటలు సాంబశివంగారి విట్టూర్పులో కలిసిపోయాయి.

## 8

ఒకప్పుడు, అంటే ఇరవై యేళ్ల క్రితం రాజమండ్రి మెరకవీధులునహా సాంబశివం పేరు చెబితే హడిలిపోయేవాళ్ళు. అతనిమూళ అంతా రౌడీనజ్జు. ఈ బలగబలం ఒకవేపు ఉంటే రెండో వేపు ఆ ఊళ్లో పేరుమోసిన లాయర్ భీమశంకరం గారి తమ్ముడై వందున సాంబశివం విచ్చలవిడిగా తిరిగాడు.

అలనాటి ఆ సాంబశివం ఇవాళకూడా తనను కడుపులోపెట్టుకుని కాపాడిన వదినెగార్ని తల్చుకుని ఆమెమాటలు పాటించనందుకు మనసా కుమిలిపోతాడు. ఆ మహాలక్ష్మి అంత దొడ్డ ఇల్లాలు. "ఆమె అడుగుపెడితే బంగారమే."

భీమశంకరంగారి ప్రాక్టీసు వుంజాకున్నదికూడా పెళ్లయినతర్వాతనే.

సాంబశివం భీమశంకరం పెళ్లినాటికి పన్నెండేళ్ళవాడు.

"ఓయ్ ! సాంబం! .... ఆనాటినుంచీ పిల్లలు లేని నేను నిన్ను కన్నబిడ్డగా చూసుకున్నాను .... కాని 8 సంవత్సరాలలో ఇంత పనికిమాలినవాడి వైపోయావే" .... ఇంతకంటే ఆమె మరిదినీ వీనాడూ ఎక్కువమాటలు అనలేదు.

అప్పుడు వాటిని లక్ష్యపెట్టకపోయినా ఇవాళ సాంబశివంగారిగా తల ఎత్తుకుని శిష్టసమాజంలో బ్రతుకుతూవున్న సాంబశివం ఒదినెగారి మాటలు శూలాల్లాగ గుండెల పొడుచుకుని బాధపడతాడు.

"ఇదుగో వదినా ! ఈ నికృష్టుడు బుద్ధిమంతుడయ్యాడు.... ఓ ఇంటివాడై గయ్యాళితో ఇద్దరు పిల్లలితో కాపురంచేస్తున్నాడు. కాని ఏదీ వీడికి సుఖం ...." అని పరలోకంలోవి ఒదినెగారికి వినిపించాలి అన్నట్టు పరితపిస్తాడు. కాని ఆమె ఎక్కడుంది ?

భీమశంకరంగా రేనాడూ తమ్ముడిగురించి అంత పట్టించుకోలేదు. అసలు ప్లీడరీతప్ప అతనికి వేరే వ్యాపకంలేదు. నిజానికి మహాలక్ష్మి మొక్కని దేవుడు లేడు. పాలుపొయ్యని పుట్ట లేదు. ఆమెకో కొడుకు పుడితే వాడికి ముక్కోటి దేవతలపేర్లు కలిపి ఓ మైలు పేరు పెట్టాల్సి వచ్చేది.

సాంబశివాన్ని పిలిచి ఆమె కూకలేసేది. "ఆయనేమో ఆ అబద్ధాలకోర్లు ఉద్యోగం .... నువ్వేమో ఈ పోకిరీ వేషాలూ... ఇంక మీ వంశం ఎలా ఎత్తుర్కుతుందీ" అని.

ఆమె సాంబశివాన్ని బడిపంతు లవమని కోరుతూ ఉండేది. ఆమెకు దీనికితోడు భర్త ఆరోగ్యం దెబ్బతినడంతో మరిక పిల్లలిమీద ఆశ పోయింది. భీమశంకరంగారికి రక్తపుపోటు సంప్రాప్తించింది. దాంతో మహాలక్ష్మి మరింత మానసికంగా క్రుంగిపోయింది.

దీనికితోడు సాంబశివం చేసే దగుల్బాజీలు, దౌర్జన్యాలు ఎవరో ఒకరు ఆమెచెవిని వెయ్యడమూ నువ్వు మందలిస్తే వాడిల్లా తయారయ్యేవాడా ? అనడమూ జరిగేది. అందుకనే ఆమె తన ఆరోగ్యం, భర్త అనారోగ్యం రెండూ లక్ష్యపెట్టక సాంబశివానికి పెళ్లి తలపెట్టింది.

ఐతే అయినసమ్మంధా లెవరూకూడా "చూస్తూ చూస్తూ వాడికి మా పిల్లనిచ్చి దాని మెడ ఉత్తరించలేమంటూ" ముందుకి రాలేదు. అయితే కన్నెచెర విడుతుందంటే ఈ దేశంలో సంబరపడేవాళ్ళు చాలామంది తండ్రులుంటారు కదా ? లలితాంబతండ్రి ముందుకి వచ్చాడు.

"కుటుంబ సాంప్రదాయం నిప్పులాంటిది. తాతముత్తాతలనుంచీ భీమశంకరంగారిదాకా అందరూ పేరుప్రఖ్యాతులు గలవాళ్ళు ...." అనే ధైర్యంతో పిల్ల నిస్తానన్నాడు.

మహాలక్ష్మమ్మతో సహా అందరూ సాంబశివానికి ఆ మూడుముళ్ళు పడితే ఇంటిపట్టునుంటాడని ఆశించారు. అయితే మహాలక్ష్మమ్మ

---

"ఇంతకూ నువ్వు నేరం చేశానంటావా; చెయ్యలేదంటావా?" జడ్జి ఖైదీని అడిగాడు.

"చెయ్యలేదు బాబు"

ఇదివర కెప్పుడైనా జైలు కెళ్లావా"

"లేదండీ దొరగోరు! ఇంతకు మునుపెప్పుడూ నేను దొంగతనం చెయ్యందే"

జడ్జీ చిరునవ్వు నవ్వాడు.

రాజేశ్వరి (మద్రాసు)

---

అనుకున్నంత సులువుగా సాంబశివం పెళ్లికి లొంగి రాలేదు.

ఆమె చివరికి తనదగ్గర ఉన్న ఒకేఒక దివ్యాస్త్రం ప్రయోగించింది.

"నువ్వీ పెళ్లికి ఒప్పుకోకపోతే గోదావరిలో పడి ఛస్తా" నని ఒట్టుపెట్టుకుంది. ఆమె మాతృ వాత్సల్యంముందు సాంబశివం సిగ్గిపోయాడు. లొంగిపోయాడు. తన ఒదినె అన్నంతపనీ చేసేస్తుందనే భయంతోనే లలితాంబ కానాడు సాంబశివం మూడుముళ్ళూ మెడను కట్టేడు.

అటుతర్వాత మూడేళ్లదాకా లలితాంబను కన్నెత్తికూడా చూళ్లేదు సాంబశివం.

ఈలోగా భీమశంకరంగారి ప్రాక్టీస్ చితకడమేకాదు, వ్యాధోగం విషమించింది. ఆయనను పెద్దాసుపత్రిలో జాయిన్ చేయాల్సివచ్చింది. అన్న జబ్బుకంటే ఒదినెగా రక్కడ అహర్నిశలు, భర్తసేవ కంకితమైపోయి ఉండటంవల్ల సాంబశివం గుండెలో కష్టాలు నాటేయి. అన్నా ఒదినె ఇద్దరూ దూరంగా ఉండటంతో సాంబశివానికి భయం వేసింది.

ఏదో ఒక ప్రవాహంలో పడి అంతూ దరీ తెలీకుండా కొట్టుకుపోతూ ఉన్నట్లనిపించింది. అదివరకూ అంతే అయినా అవసరమైతే అన్నయ్య ఒదినె ఉన్నారు ఆ 'పడవ' లోకి ఎక్కిపోవచ్చును..... అనుకునేవాడు కాని, రాను రాను ఆధైర్యం సన్నగిల్లిపోయింది.

అదిగాక అతనికి కొన్ని ప్రాణసంకటాలైన సమస్యలు ఉత్పన్నమయ్యాయి. ముఖ్యంగా తనను నమ్ముకుని తన శీలాన్ని అర్పించుకున్న కాపు పడుచు ఒకర్తె అతగాడి గుండెలు దేవేస్తూ ఉండేది.

ఆపిల్లతో సాంబశివానికి పరిచయం చాలా విచిత్రంగా, దైవికంగా జరిగింది.

అది తల్చుకుంటే ఇప్పటికీ ఎదనంతా విద్యుత్ ప్రసరించినట్టు ఉంటుంది. ఐతే కనకం వచ్చిపోయి చాలారోజు లయిందిగదా అని మనసు దిటవుచేసుకో జూస్తాడుగాని .... అతని మనో వ్యాకులత నేటికీ తగ్గలేదు. పైగా కనకం శేష పొడమే ఏదోరకమైన భయానికికూడా కారణమైంది.

ఒదినెగారిని తల్చుకుని ఎంత బాధపడతాడో సాంబశివంగారు నేటికీ కనకం వూను తల్చుకుని అంత పశ్చాత్తాపపడతారు.

ఐతే ఇటీవల ఆయనకు భవిష్యత్ మీద నమ్మకం ఏర్పడుతున్నది. ఒకటి రెండేళ్లల్లో తన వాణ్ణి ఒకణ్ణి చూసి రాజ్యలక్ష్మికి పెళ్లిచేస్తే అక్కడితో అతని మనోవ్యాకులం పోతుంది. అదే అతని నమ్మకం, ప్రయత్నం కూడాను. రాజ్యలక్ష్మిపెళ్లి సవ్యంగా జరిగిపోతే సాంబశివంగారు తన పాపానికి నిష్కృతి లభ్యమైందని తలపోసినా తప్పులేదు.

ఒకప్పుడు కనకం తనకు ప్రాణదానం చేసింది. పైగాశీలంకూడా అర్పించుకున్నది.సాంబశివంగారికళ్ళు చెమ్మగిల్లడానికి కారణం ఒక్క ఒదినెగారిమీద భక్తే అనుకుంటుంది లలితాంబ కాని ఆమెకి కనకం వైనం తెలియదు. అస లెవరికీ తెలియదు ఆ సంగతి.

ఆనాటి సాంబశివానికి ఊరు శివార్లలో జూదమాడటం నిత్యకృత్యం అంటే ఇవాళ నరసమ్మగారి లోగిలిలోగాని ఆ ఊళ్లోగాని ఎవ్వరూ నమ్మరుకూడాను. కాని అతడు తప్పదాగి ఉన్నదంతా పోగొట్టుకుని ఇంటికి వచ్చి ఒదినెగారి కాళ్ల దగ్గర లెంపలువేసుకుంటూ ఉండే సందర్భాలు అప్పుడు అడపా దడపా ఉండేవి.

మహాలక్ష్మమ్మ ఒట్లుపెట్టినా, వత్యాలు పలికినా దానిబలం నాలుగైదురోజులు మహా అయితే వారం. అంతకంటే ఎక్కువవేపు ఉండేది కాదు. ఓనాడు రాత్రి తప్పతాగి, కైపు దిగజారడానికి గోదార్లో మువ్మారు మునిగి ఎంటికి వస్తూ ఉండేవారు.

# కాశ్మీర్ బొకె టాల్కుతో గంటలుతరబడి సువాసనగా తాజాగావుండండి

అత్యద్భుతమైన, నాణ్యమైన కాశ్మీర్ బుకె కాన్కలు ఒక సౌందర్య టాల్కు... ఒక బేబీ పౌడరు

పూల గుచ్ఛంలోనికి చొచ్చినట్టుగావుంటుంది, కాశ్మీర్ బుకె టాల్కు యొక్క చల్లని, పూలరేకు వంటి మెత్తదనాన్ని అనుభవిస్తే. వొళ్లు అంతా రాసుకొనండి, నవ వసంతపు ఘుమఘుమలతో రాజిల్లుతారు.





శిశువును సంతోషంగా సౌఖ్యంగా వుంచండి! కాశ్మీర్ బుకె ప్రతి యితర ప్రత్యేక బేబీ పౌడరువలె మెత్తగా, నున్నితంగా వుంటుంది. మీ ఇద్దరూ ఉపయోగించగల ఒకే పౌడరు అందు బాటులో వుండటం ఎంత వీలు!




## కాశ్మీర్ బొకె

పురుషులు వాంఛించే సువాసనగల టాల్కుం పౌడరు

ఓక్కొనాడు సాంబశివం జేబులోని పైకం, వేలి మున్న ఉంగరం, వాచీతో సహా జూదంలో ఓడి పోయాడు. ఆఖరికి కాలిచెప్పులుకూడా ఓడేడు.

"ఇంకా పైండయ్‌రా! రంద్రా .... అడి తీర్తా నని ...." చిందులు తొక్కాడు.

"నెత్తినున్న వెంట్రుకలుతప్ప ఏముస్నాయ్ నీదగ్గర...."అనిముఠావాళ్ళు గేలిచేశారు. దాంతో కైపుమీద ఉన్న సాంబశివం "ఒరే! తొత్తుకొడుకులూ! నేను ధర్మరాజుగ్నా .... కావాలంటే మా తమ్ముడు లాయర్ భీముణ్ణడుగు. నా ఆలినైనా ఒడ్డుతా ...." నని దగ్గరగా ఉన్న చెలికాణ్ణి గూబమీద ఒక్కటిచ్చుకున్నాడు.

దాంతో తతిమ్మావాళ్ళకి ఒళ్ళు పులిసిన ట్లయ్యింది కలియబడ్డారు.

జలాంయివేషాలంటే పైగాని దెబ్బలంటే హడిలిపోయే సాంబశివం జారిపోతోఉన్న కచ్చనైనా పట్టుకోకుండా పరిగెత్తాడు. ఆ పరిగెత్తడం పరిగెత్తడం మురికిపేటలదాకా పరిగెత్తాడు. పాటక జనం పాకలమధ్యగా మనిషి అలిసిపోయి మోకాలి చిప్ప లూడిపోయినట్లు బాధపడి ఓ గుడిసె ముందు కూలిపోయాడు.

వెన్నెల కాస్తున్నది పుచ్చపువ్వులాగ. అది వీధీ కాదు .... సందూ కాదు .... అక్కడోకటి అక్కడోటే, అరా పాకలు. మురికినీళ్ళ పడియలు. మురికి గుంటలమీద వెన్నెల పడి మెరుస్తున్నది. పాకలన్నీ ముడిచిన గొడుగుల్లా నిశ్శబ్దంగా ఉన్నాయి.

గుడిసెతలుపు తీసుకుని కనకం బయటి కొచ్చింది. "అలికిడేంటి" అంటూ. ఇప్త్రీ మడతల్లో కుప్పలా కూలిపడ్డ వ్యక్తిని "ఓ లమ్మో" నంటూ దగ్గిరిపా ఒచ్చి మోకాళ్ళమీద కూచొని చూసింది.

"సాంబశివంగోరూ!...."

కనకం బిత్తరపోయి దిక్కుదిక్కులు చూసింది. కనకం లాయరు భీమశంకరంగారి పనిమనిషి మంగ తాయారుకూతురు.

సాంబశివం కదిలాడు. కనకానికి కరచరణా లాడలేదు. చుట్టూరా సంద డింత పిసరు లేదు. అతనిస్థితి తెలుసుకున్న కనకానికి జాలేసింది. దప్పికతో గొంతుకార్చుకుపోయి పెదాలు తడువు కుంటున్నాడని తెలుసుకుంది.

సాంబశివం కొంచెం లేచి, కనకం మోకాళ్ళు పట్టుకున్నాడు.

"ఎవరూ శ్రీకృష్ణుడా! రక్షించు...కౌరవులు!.. కౌరవులు!!.... నన్ను నన్ను వస్త్రాపహరణం .... చంపేస్తారు .... అంటూ ఆమె కాళ్ళుపట్టుకుని లేవాలని చూశాడు. కనకం కుంచించుకుపోయి చీదరించుకుని విడిపించుకోబోయిందిగాని .. ....చివరికి ఓడిపోయింది.

కష్టంమీద, సాంబశివాన్ని గుడిసెలోకి ఈడ్చికెళ్ళి నులకమంచాన కుదేసి, కుండెడు నీళ్ళు మొహాన కొట్టి "ఇంకెవరూ చంపలేరు లే .... ఈరుడివి! నన్నొగ్గేయ్" మని చెమటలొత్తుకుని 'ఉస్సు' రంది.

# విడి విడని చిక్కులు

తెలివి తెలిసిన సాంబశివం కనకం ముందు తగం మనిషై పోయాడు. దానికేసి తల యెత్తి చూడలేకపోయాడు.

బాబూ! పరువున్న యింట పుటకవత్తి యిదేనా న్యాయం.' ఇంత దిక్కుమాలిన పనులు చేపోతే గోదార్లో పడి చావరాదూ. మా లచ్చమ్మ గారికి బాధేనా ఒదుల్తాది" అని మందలించింది కనకం.

"ఒదినెకు చెప్పకూ ...." బ్రతిమాలేడు సాంబశివం. "ఇవి కాళ్ళు" అన్నాడు ఆమె చేతులు పట్టుకుని.

మెత్తబడిపోయింది కనకం. పెదాలకొన వించి నవ్వేసి "ఎందుకు చెప్పను. నా ఇంటి మీద పడి చినబాబూ యాగీచేశారు ..... అని చెబుతా" నంది.

---

"మా ఆవిడ పేరుమీద ఈ వేళ భీమాపట్టా తీసుకున్నా నను కోండి. రేపావిడ చచ్చిపోతే నా కేమొస్తుందంటారు?"

"మరణశిక్ష!" భీమా కంపెనీ ఏజంటు రపీమని సమాధానం చెప్పాడు.

కృష్ణమూర్తి (మద్రాసు)

---

సాంబశివం బ్రతిమాలి బయటపడ్డాడు. నిజానికి ఒదినెతలంపు వచ్చిందిగనుకనే ఆ రాత్రి కనకం యవ్వనం శీలం రెండూకూడా దక్కేయి.

ఐతే ఆవేళ తప్పిన ఘటన మరికొంచెం రోజుల్లోనే మారిపోయి కథ వక్రమార్గంలో పడింది. కనకం యీ సైనం మంగతాయారుతోకూడా చెప్పలేదు. పైగా 'చినబాబు' బాగుపడ్డారని మహాలక్ష్మమ్మతో చెప్పిందికూడా.

## 9

మాతిదగ్గర సుభద్రమ్మ తడిబట్టతో వేరే చేదతో నీళ్ళు తోడుకుంటున్నది. అవతల గిలక మీదుగా చేదవేసి, రాజ్యలక్ష్మి నీళ్ళు తోడు కుంటున్నది.

"ఓసేవ్! కోడలుపిల్లా? కాస్త జాగర్తగా తోడుకోవే .... నీ చేద నా బాల్చీకి తగిలిందో మీ మావయ్య నా పీక పిసికేస్తారు ...." సుభద్రమ్మ రాజ్యలక్ష్మిని హెచ్చరించింది.

సుభద్రమ్మగారి భర్త వెంకట్రత్నం చండ శాసనుడు. అతగాడికి దేవతార్చన ఉంది. తడి గుడ్డతోనే పెళ్ళాం నీళ్ళు తేవాలి. మడిగా వండాలి. లేపోతే ఆయన నైవేద్యం పెట్టడు. ఒకవేళ అతగాడికి ఏమేనా అనుమానం వచ్చిందో అన్నం కూరలూ అన్నీ గుమ్మరిత్తి అమాంతం పెళ్ళాం నెత్తిన రుద్ది నానాతిట్లు తిట్టుకుంటూ కోర్టుకి వెళ్ళిపోతాడు.

సుభద్రమ్మకూడా నిప్పులు కడుక్కునే సంప్రదాయంలోనించి రాకపోయినా ఆచారం తెలియనిదిమాత్రం కాదు. అందుకనే మొదట్లో మొరాయించింది.

"మా ఇంట్లో ఈతడీ మడీ చాదస్తాలు లేవు" అని ఈసడించింది.

"అయితే అప్రాచ్యురాలా! అదేదో మీ ఇంట్లోనే తగలడు. నా ఇంట ఒక్క క్షణం ఉండొద్దు .... అసలు నిన్ను చేసుకున్నందుకు ప్రాయశ్చిత్తం చేసుకుంటానంటూ ఆమెను పుట్టింటికి తగిలేశాడు.

మొగుడు వద్దన్న ఆడకూతుర్ని గుండెలమీద కుంపటిలాగా పుట్టింటారు ఎన్నాళ్ళో భరించలే మన్నారు. అల్లుడి కాళ్ళా వేళ్ళా పడి నీ దేవతార్చనకు చాలిన ఆచారం దీనికి మప్పేమని వదలిపోయారు. ఇది యిలా ఒకసారిగాదు. సుభద్రమ్మ పదిపన్నెండేళ్ళ సంసార జీవితచరిత్రలోనూ ఐదారు పర్యాయాలు జరిగింది.

అందరూ తోడుకునే ఆ నూతిలో నీళ్ళు పనికొస్తాయిగాని, పలుగురూ వాడిన గిలకా చేదా పనికిరావు వెంకట్రత్నంగారి ఆచారానికి.

వెంకట్రత్నంగారి కీమధ్య సరసమ్మగారిమీద కూడా కోపంగా ఉంది. "వెధవముండ అన్న మాటేగాని ఈ సరసమ్మకూడా మతిపోయింది.అసలు బ్రాహ్మణదో, కిరస్తానదో తెలియని ఆ న డ వ గ ది వ ం తు ల మ్మ నెందుకు దింపిందీ లోగిలిలో ?" అని పెళ్ళాన్ని నిలదీసి అడుగుతాడాయన.

అతగాడికి నిర్మలమీదగల కసి. అది ఎందుకో తెలియదు. ఆలోచించడం ఆ వ్యక్తి నైజానికే విరుద్ధం.

అట్నుంచి నిర్మల బిందె తీసుకుని నీళ్ళకు వస్తూ ఉండటం చూసిన సుభద్రమ్మ కాళ్ళు ఒణికేయి.

భర్తగాని చూశాడో బిందెడునీళ్ళు నెత్తిన కుమ్మరిస్తాడు.

"ఆ వెధవముండతో మాటాడి దాంతో పూసుగుని రాసుగుని తెచ్చావుటే నా పూజకు నీళ్ళా" అని చిందులు తొక్కుతాడు.

నిర్మల వెనుక ఒక అనుభవం అయిందిగనుక సుభద్రమ్మని మాతిదగ్గరమాత్రం పలకరించదు.

అదివరకు నిర్మల ఆ లోగిలిలో వచ్చి చేరిన కొత్తలో "పిన్నిగారూ వంట యింకా అవలేదా ?" అనడిగింది. అటుతర్వాత దాని దుష్ఫలితం రాజ్యలక్ష్మిద్వారా విని నిర్మల ఏడిచేసిందికూడా. "ఛీ! అనవసరంగా నానించి పిల్లతల్లి జనాక ఆమెకు దెబ్బలా" అని బాధపడింది.

అందుకనే సుభద్రమ్మ వెళ్ళిపోయేకా ఇట్నుంచి నిర్మల వచ్చింది.

"నే పోస్తాలే అక్కా!" అంటూ రాజ్యలక్ష్మి తను చేదుకున్న నీళ్ళు ఆమె బిందెలో కుమ్మ

తిరించింది. కాని నిర్మల వెంటనే రాజ్యలక్ష్మిని వారించింది.

"వద్దమ్మా వద్దు .... చిన్నపిల్లవి. నేనే నీకు సాయంచేయాలి" అని చేద అందుకొనబోయింది.

ఇది ఎక్కణ్ణుంచి చూసిందో లలితాంబ పెంకు లెగిరిపోయేలా కేకలేసింది.

"ఒసేవ్! పాజీఖానా! పెత్తనా లవలేదూ .." మీ చిన్నాయన స్నానానికి ఇక్కణ్ణుంచమన్నారు."

రాజ్యలక్ష్మి బిందెనెత్తుకుని హడావుడిగా వెళ్లిపోయింది.

నిర్మల నాలుగు క్షణా లట్టే ఉండిపోయి నిట్టూర్చి నూతిలో చేదవేసింది.

## 10

ఆ లోగిలిలో నిర్మలమీద నిరసనభావం రకరకాలుగా ఉండేది. ఆ లోగిలిలో ఉన్న ఐదూ కుటుంబాలు. ఇంటిగలావిడ ఒక్కర్తే గనక ఆవిడమాటనరేసరి—ఏదోవిధంగా సంబంధాలుకలుపుకుని పిన్నిగారూ అంటే అత్తయ్యగారూ అని 'ఒదినే' అని ఇలా పిల్చుకుంటారు.

నిర్మలకూడా రాజ్యలక్ష్మి తనను అక్కయ్య అంటుందిగనుక ఆ వరసనేనా తతిమ్మావాళ్లని వారివరుసలతో పిలవాలని ప్రయత్నించింది కాని ఆపిల్ల కలుపుగోరుతనం ఫలించలేదు. పిన్నిగారూ అంటే లలితాంబ మొహం తిప్పుకొనేది. "అత్తయ్యా!" అంటే సుభద్రమ్మా రుసరుసమనేది.

నరసమ్మగారిమీద నిర్మల రోజూ తెచ్చి దేవుడికి పెట్టమని యిస్తున్న పూలు ప్రభావం చూపుతున్నాయి గాని, పూర్తి సదుద్దేశం కలిగించడానికి చాలినంతగా వాటి ప్రభావం ఇంకా రాలేదు.

'ఆడదన్నాక మగదిక్కు ఉండాలంటుంది' నిరంజనంగారి వెధవప్ప చెల్లెలు.

కాని ఒంటరిగా ఆడది తన ఆర్జన తాను చేసుకుని బ్రతకడం దోషం అని ఏ శాస్త్రం లోను లేదు. ఏ మతమూ ఈ సిద్ధాంతాన్ని బోధించకపోవచ్చునుగానీ లోకంలో కొన్ని నైతిక విలువల నైజం వేరు—

నరసమ్మగారి లోగిలిలోనివారికి ఒంటరిగా స్వార్జితంమీద బ్రతికే పడుచుపిల్ల నిర్మల జీవితం సత్యసమ్మతంగా తోచలేదు. దానికితోడు నిర్మల అమ్మా, నాన్నా, మొగుడూ మున్నగు వివరాలేవీ ఎవరితోనూ చెప్పకపోవడం అందరికీ కినుక కలిగించింది.

"అంత వా అన్నవారూ పుట్టేల్లూ లేకపోతే, ఉంచక్కా అత్తింటే యాడవలేకపోయిందీ. ఇలా రోడ్డుమీదపడి బ్రతికితే ఏం లాభం ? ఛీ ఛీ

# విడీ విడని చిక్కులు

సంచితార్థపు మాటతప్ప ఈజాతికి ఏమీ లాభం లేదు." ఇది ఆ లోగిలి మూడోవాటాలో ఉన్న వితంతు ప్రతినిధి మాణిక్యమ్మ అభిప్రాయం.

ఐతే ఆమె భావించినట్లు నిర్మల రోడ్డుమీద పడలేదు. మిడిల్‌స్కూల్లో ఆపిల్ల ఉద్యోగం చేస్తున్నది.

ఆపిల్ల క్లాసులో ఇరవైమంది ఆడపిల్లలున్నారు. ఫస్టుఫారం చదువుకుంటున్న పిల్లలు ఒకరిద్దరి మెళ్లో పుస్తెలుచూసి నిర్మల అప్పుడే పెళ్లయిందా ? అని విస్తుపోయింది కూడా.

"లేదండీ మాడమ్! .... మా ముత్తవ్వ చచ్చిపోతుందనీ నాకు పెళ్లి చేసేశారు ...." కల్పలత అనే అమ్మాయి చెప్పింది.

---

యుద్ధరంగంలో ఉన్న ఒక విలేఖరి తన పత్రికకు ఎప్పటికప్పుడు "వైర్‌లెస్" ద్వారా సమాచారం అందజేస్తున్నాడు. కొంత దూరంలో హఠాత్తుగా ఒక బాంబు ప్రేలింది. విలేఖరి 20గజాలదూరంలో పడ్డాడు. కొద్దిసేపు గడిచాక అతడు కళ్ళు తెరచి చూస్తే దట్టంగా పొగ కనిపించింది. "అరెరే! ఈ బాంబు ప్రేలినట్టు చెప్పలేకపోయానే" అతడు నాలుక కరుచుకున్నాడు.

రామారావు (నెల్లూరు)

---

"మరి మీ ఆయన ఏంచేస్తున్నారు ?" అన్నది నిర్మల.

ఆపిల్ల పరికిణీ, ఓణీ వేసుకుందేమో ఓణీ రొమ్ముమీదకి మరింత లాక్కొని "ఫిఫ్తుఫారం చదువుతున్నా రండి" గర్వంగా.

"మరి కల్పలతా! మీ ఆయన నీకు నచ్చినవాడేనా ?"

"ఛా! పోండి పంతులమ్మగారూ" కల్పలత సంరంభంగా తనే అక్కణ్ణుంచి పారిపోయింది.

గంటకొట్టాక నాలుగుక్షణా లలాగే ఉండిపోయిన నిర్మల ఉలిక్కిపడి, బరువుగా నిట్టూర్చి పుస్తకాలు సర్దుకుని బయటికి నడిచింది. ఆపిల్ల కుడిప్రక్కగా పరధ్యానంగా నడుస్తున్నదల్లా అదే బాట కెడంప్రక్కగా నడుస్తూన్న సూర్యాన్ని వెంటనే చూడలేదు. చూస్తూనే అటు వెళ్లింది.

సూర్యం ఆమెను దాటి అవసరమైన పనిఉన్నవాడిలా వెళ్లిపోబోయాడు. కాని నిర్మల "నమస్కారమండి" అన్నది పుస్తకాలతోనే చేతులు జోడించి.

సూర్యం నమస్కారం అందుకున్నాడు.

"మీరూ ఇంటికే వెళ్తున్నారా ?" అన్నా డేదో అడగాలి గనుక.

"కానండి .... నేను పనిచేసేది ఈ మిడిల్ స్కూల్లోనే." నిర్మల మరి ఐదారు క్షణాలు ఏమీ మాటాడలేదు. ఆమె అడగబోయి సంకోచిస్తున్నట్లు తోచినా సూర్యంకూడా ఏమీ అనలేదు. చివరికి కాళ్ల బళ్ల రొద తగ్గాక నిర్మలే తెగువచేసి "అమ్మమ్మగారు నన్ను ఇల్లు ఖాళీ చేయమన్నారు ...." అన్నది.

సూర్యం విన్నాడు.

"ఇప్పటికిప్పుడు మధ్యంతరంగా ఎక్కడికిపోను చెప్పండి ?"

సూర్యం ఒకసారి ఆమెను చూసి మళ్లీ మొహం తిప్పుకున్నాడు. ఏం మాటాడలేదు. ఆమె చిన్నబోయింది. సూర్యానికి సానుభూతి కలిగింది.

"ఫర్వాలేదండీ! మీకు మరో యిల్లు దొరికితేనే వెళ్లండి. లేకపోతే తొందరలేదు! అన్నాడు.

నిర్మల నోరువిప్పి అనలేదు గాని మనసారా అతనికి కృతజ్ఞత చూపించింది. నిశ్చింతగా నిట్టూర్చింది.

నిర్మలా, సూర్యం. గుమ్మం యెక్కి నడవ గుండా వెళుతూండగా నిరంజనంగారి వెధవ అప్ప చెల్లెలు ఎదురు వస్తూ,

"ఏం! బాబూ. యీవాళ ఆలస్యం అయిందీ? అనడిగింది.

సూర్యం మొహం చిట్లించి "అబ్బే లేదే" అన్నాడు.

"సరేలే బాబూ! క్షమించు .... ఏదో పెద్దదాన్ని అనేశాను ఉండబట్టక ...."

ముసుగు సర్దుకొంటూ వెళ్లిపోయిం దావిడ.

సూర్యానికి ఆవిడ మాటాడింది తెనుగుభాషేనని తెలిసింది కాని అర్థమవలేదు.

భుజా లెగరేసి వెళ్లిపోయేడు.

తిరిగి సూర్యం బామ్మ యిచ్చిన కాఫీ తాగి దుస్తులు మార్చుకుని షికారెడదామని ఊళ్లోకి బయలుదేరేసరికి నిర్మల ఒకచేత పుస్తకాలు పట్టుకొని తన గది తలుపు తాళం వేస్తున్నది.

సూర్యానికి ఆశ్చర్యం కలిగింది. మళ్లీ ఎక్కడికి పుస్తకాలు పట్టుకుని వెళుతుందీవిడ అని అనుమానం కలిగింది.

తనకెందుకు లెమ్మని బయట పడ్డాడు. శంకరంగా రింటికి వస్తానని మాట యిచ్చిన సంగతి జ్ఞాపకానికి వచ్చి కొత్తపేట కేసి దారి తీసేడు.

(సశేషం)



'దశావతారా'ల'లో ఒక దృశ్యం.

చిత్రసమీక్ష

# వింతకల్పనల "దశావతారాలు"

ఆ పెద్ద మనిషి హడావుడిగా పరుగెత్తుకు వచ్చాడు. "స్వామీ ప్రపంచమంతా తలక్రిందై పోతోంది. ఇంక మీరు వెంటనే వచ్చి ఎత్తాల్సిందే" అని ఓపక్క తంబూరా వాయించుకుంటూ మొరపెడుతున్నాడు.

"టట్! అదేం వీల్లేదు. ప్రపంచం తలక్రిందైనా మీదైనా సరే, నే నెత్తేదే లేదు. ఇంకా కొంత కాలం తర్వాత ఆలోచిద్దాం" ఒకచేయి తలగడాగా బెట్టుకొని శేషపాన్పుమీద పవళించిన ఓ పెద్ద.... మనిషి సెలవిచ్చారు. తానెంత సంగీతవిద్వాంసుడూ, మహాభక్తుడూ, లోకకళ్యాణ సంధాయకుడైతే మాత్రం, మొన్నటిదాకా విధీ విరామంలేకుండా తొమ్మిదవతారా లెత్తిన సాక్షాన్మహావిష్ణువుని పట్టుకుని, అలా అడిగేయటమే ?—ఈ సందర్భం అంతా ఇటీవల విడుదలైన ఒకానొక్క తర్జుమా 'చిత్రరాజం' లోది.

అదే, విశ్వశాంతివారి (కన్నడ నుంచి) తర్జుమా! 'దశావతారాలు.' భావానికి మెరుగులు దిద్దే భాష, భాషనే భాసింపచేసే రాగంతో, విశిష్ట వినూత్న కల్పనలతో తయారైన ఈ చిత్రం కథాక్రమం బెట్టిదనిన....

.... అనకముందేమీలేదు. అంతా శూన్యం, విలయం. వటపత్రశాయి ఆజ్ఞతో బ్రహ్మ లోకాలు, అష్టదిక్పాలకుల్ని, ప్రజాపతిని, దేవకన్యలను సృజించటం, దేవదానవసృష్టి. వాణివి ఒడిలో (నీగ్రోపిల్లలాగా) ఉన్న వేదాలను సోమకాసురుడు పాతాళంలో భద్రపరచగా మహావిష్ణువు మత్స్యావతార మెత్తి (ఇక్కడ మనలో మాట. ఆ మహావిష్ణువు దేవతలను రక్షింపబోయి మహార్ణవం నుంచి తెచ్చుకున్న శాపమే గాన్ని ఈ అవతారాలు లోక సంరక్షణార్థం కాదుట. కొనితెచ్చుకొన్న కర్మని తనధర్మంగా ఉపయోగించుకున్నాడు అంతే. ఆవిష్ణుచిత్తుడి కూతురు కూడా వెనక ఆమాటే అందిలెండి) వేదాలనుద్ధరించటం, సముద్రమథనంలో కేశవుడు కూర్మావతార మెత్తటం, హిరణ్యాక్షుడు (ఆధునిక) భూగోళాన్ని సముద్రంలో దాచగా రమాధవుడు వరాహరూపంలో ఉద్ధరించటం, నరహరిఅవతారంలో హిరణ్యకశిపవధ, బలికోసం వామనావతారమెత్తటం, భార్గవరామావతారంలో కార్తవీర్యార్జున నిగ్రహణం, దశరథరాముడుగా రావణసంహారం, కురు పాండవ యుద్ధసంధి—యుద్ధ విధాన ధౌరేయుడుగా కృష్ణావతారధారణం బలరామావతారం, అహింసా సిద్ధాంత ప్రతిపాదనకు బుద్ధావతారం ధరించటం—వెరసి తొమ్మిది యవతారములచరిత్ర ఏర్చి కూర్చిన నాటికా కదంబం. ఆ పదో అవతారం ఈ అణుయుగంసంగతి తెలిసేగాని ఎత్తవన్నాడాయె హరి!

మారటం మహాచెడ్డ పని, అయినా కాలం కర్మం మారుతూనే ఉంటాయ్. మనిషి, మనసూ మనలా మారుతూ ఉంటాయ్. అలాగే కథలు చిత్రించటంలో కూడా. మూలధర్మాలను మార్చనంతవరకు, పాత్రలను చేతికొచ్చినట్లు సాగులో దిద్దుకునే అధికారం కవికుంటుంది. సరిగా అలాంటి చిత్రణమే ఈ కథలో ఉంది. ఇందులో



రావణుడుగా రాజకుమార్.

వయోలా

పరిమళ




ఎస్సెన్సులు
మరియు
ఆహార
రంగులు

ఐస్‌క్రీమ్ సిరప్
ఎరేటెడ్ పానీయం
మిఠాయి మొదలైన వాటికి

వియోలా ఇండస్ట్రీస్, బొంబాయి



స్త్రీల ఆరోగ్య
సౌభాగ్యములకు

లోధ్ర

కేసరి కుటీరం
(ప్రైవేట్) లిమిటెడ్
రాయపేట, మద్రాసు-14

ఏజంట్లు:
సీతారామ జనరల్ స్టోర్సు (ఏజన్సీస్)
విజయవాడ . సికిందరాబాదు . మధుర . బరంపురం . బెంగుళూరు

ఊరగాయ పచ్చళ్లకు
అమూల్యమైన నూనెలు

అగ్‌మార్కు కలిగిన
ఎ.యస్. బ్రాండ్
చాయపప్పు
నూనె

AGMARKED
A.S. BRAND
PURE
GINGELLY OIL
HUSKED
A. SUBBANNA & Co
SAMALKOT

అగ్‌మార్కు కలిగిన
మేన్షన్ బ్రాండ్
నువ్వుల
నూనె

AGMARKED
MANSION
GINGELLY OIL
A. SUBBANNA & Co. SAMALKOT

★ ముక్కను మెత్తబడనియ్యదు.
★ బూజు పట్టనీయదు.
★ చాల కాలము నిలువ యుంచును
సీలనుగము నింపుదుము

Mfrs: అంబటి సుబ్బన్న & కో., సామర్లకోట.

ఏజంట్లు, స్టాకిస్టులు

విజయవాడ, గుంటూరు, బందరు, రేపల్లె, తెనాలి, బాపట్ల, చీరాల, వేటపాలెం, ఒంగోలు, మద్రాసు, హాస్పేట, బళ్ళారి, అనంతపురం, గుంతకల్లు, కర్నూలు, నంద్యాల విశాఖపట్నం, బరంపురం, కటక్, ఖుర్దా పూర్, కలకత్తా, జంషెడ్‌పూరు, సింద్రీ, ధన్‌బాద్, నాగపూర్ లలో మా యేజంట్లు, స్టాకిస్టులు గలరు.

ఆంధ్రప్రదేశ్ సోల్ రెప్రజెంటేటివ్:
శ్రీ జి. సుబ్బారావు, తెనాలి

డిపోలు:

1. డాక్టరు ఉళక్కి స్ట్రీటు, తెనాలి.
2. 3096 సుబ్రిక్ స్ట్రీటు, సికింద్రాబాదు.
3. 129/L5, రోడ్ నెం. 11, B. H. Area. ఖద్మా, జంషెడ్‌పూరు.

గమనిక: ప్రత్యేక సౌకర్యం: నేడు ప్రతి చోట చౌకగా లారీపార్సెలు సర్వీసు అందుబాటులో నున్నది. కావున పై పట్టణాలకు చేరువలో నున్నవారందరూ లారీ సర్వీసు ద్వారా మా సరకులను రవాణా చేయించుకో వచ్చును.

మీ కిష్టమైన నూనెలో నానబెట్టుడు

కాశ్మీర్-కుసుం

కేశములను పెరిగించును. అకాలనెరపును పోగొట్టును.

చేదుమ ఉపద్రవములకు

సాంటలక్స్
మలాము

చేదుమ అపాయములకు

"కోహినూర్" శ్రేష్ఠమైన ఊదువత్తులు & సువాసనలు & ఫ్లవర్ డస్ట్ పౌడర్లు

నంజన్‌గూడు వంధ్యశాల & అపూర్వ ఔషధములు

సోల్ ఏజంట్లు: యునైటెడ్ కెమికల్, మదరాసు, హైదరాబాద్, విజయవాడ

నంజన్‌గూడు ఔషధములకు ఒక టవునుకు ఒక స్టాకిస్టును ఆహ్వానించెదము.

మీ అందానికి మంచిదారి

మీ జీవిత విజయాలకు అందం అవుసరం. ఎండవేడికి యింకా యితరకారణాలవల్ల ముఖం క్రమేపి నల్లబడి, ముదిరూపువస్తుంది. గ్లోరియా అనే ద్రవముయొక్క అద్భుతసౌందర్య పోషకశక్తి మీ ముఖంలోని అసహ్యమయిన ముదిరూపును పోగొట్టి ఆకర్షణీయమయిన లేతదనాన్ని తెస్తుంది. మీ అందం దినాదినాభివృద్ధి అవడానికి నెలకు అర్ధమం కొన్నిసార్లు అయినా గ్లోరియా అనే సౌందర్యపోషక ద్రవాన్ని వాడండి. ముఖంమీద మొటిమలను వాటి మచ్చలను, ముడతలను, నమ్మకంగా పోగొట్టి ముఖాన్ని తెలుపుచేసి, కాంతిని, అందాన్ని తెచ్చును. మొదటి పూతకే మీకు ఆశ్చర్యాన్ని కలిగించే అందాన్నియిస్తుంది. ఒకసారి వాడి చూస్తే మీరెప్పుడూ విడువరు. అన్నిషాపులలో దొరకును



జనితా ప్రొడక్ట్సు - ఏలూరు. (ఆంధ్ర)

రూపా

# చిత్రసమీక్ష

రామ, కృష్ణావతారాల్లో మన ప్రాంతాల్లో పరిచయంలేని వింత కల్పనలు ఈ (కన్నడ) చిత్రంలో కన్పిస్తాయి. ముఖ్యంగా రావణపాత్రలో ఈ మార్పు ఉంది. రాముడు రణకంకణం కట్టేందుకుగాను, బ్రహ్మజ్ఞుడు, అశేష జపతపోనిధి, అమేయ బలసంపన్నుడు, నవకోటి శివపూజాదురంధరుడూ ఐన రావణుని రమ్మనన ఆ రావణుని అవమానించిన అం[illegible]ద ద్వారా మళ్లీ రాయబారం నడపడం, తన శత్రుత్వాన్ని అణగద్రొక్కి రావణుడు పద్బ్రాహ్మణ రూపంతో రాముని రణకంకణం కట్టటం — ఈ సన్నివేశం, రామ రావణ పాత్రల ఉన్నతి పెంపొందించటమే గాక, అభీష్టసిద్ధిరస్తు అని రావణుడు తన శత్రువును ఆశీర్వదించినప్పుడు ప్రేక్షకుని మనస్సు క్షణకాలం రావణునిపట్ల సానుభూతి పూర్ణమై పోతుంది. అలాగే సీతా, మండోదరీలు ఒకటే పాత్రను పూలు అంటు దేవీపూజ చేయటం కూడా ప్రేక్షకునకు వింత అనుభూతులు చూపుతుంది. ఆ రావణుడే రాముని చేతిలో మరణించినప్పుడు ప్రేక్షకులనుంచి వేడి నిట్టూర్పులే కలుగుతాయి. ఇలా ఒకే పాత్రలో భావద్వైవిధ్యాన్ని సీతా, మండోదరీలలో భావైక్యతను, మూలేతివృత్తానికి బాధకలగకుండా నిరూపించగల్గిన దర్శకుడు పి. జి. మోహన్ నిజంగా ప్రశంసనీయుడు.

రాధగా రాజశ్రీ, లీలావతీ, మండోదరీలుగా లీలావతి, హిరణ్యకశిప, రావణ, శిశుపాలురుగా రాజకుమార్, సీతగా ఆదోని లక్ష్మి ప్రశంసనీయంగా నటించారు.

'సముద్రాల' (జూ, సీ) ల సాహితీ రచనం సముద్రగంభీరం కాకపోయినా చాలాచోట్ల ముఖ్యంగా శృంగార సన్నివేశాలలో సెలయేటి తరగు మరగ అందెచిందువలే శ్రవణ సుఖదంగా సాగిపోయింది. సాహిత్యానికి తగ్గట్లు సామర్తి కూర్చిన సంగీతం కూడా హాయిగా ఉంది.

తర్జుమా విధానంలో చెప్పతగినంత అభివృద్ధి లేకపోయినా, శ్రద్ధమాత్రం స్పష్టంగా కన్పిస్తోంది. పాటలచిత్రీకరణం ముచ్చటగా ఉంది.

ఎంతైనా విశిష్టమైన కథాకల్పనం, కథకు తగ్గ మాటలూ, పాటలూ, పాటలకు తగ పసందైన సంగీతంగల ఈ చిత్రం భారీ తారాగణం లేకపోయినా అందరూ చూడదగ్గ ఈ చిత్రం నిర్మాత: యు. విశ్వేశ్వరరావు. ఈ చిత్రంలో ఉన్న ముద్ద గేవా కలరు ముసురులాంటికాలంలో లోకోద్ధరణకు బయల్దేరితే ఆ మహావిష్ణువు కల్క్యవతారం బదులు 'కలికి' అవతారం ఎత్తక తప్పదన్నది మాత్రం ఖాయం.

నాగరాజ్ ★



“దశావతారాలు” లో కన్నడనటి లీలావతి.



“సిరిసంపదలు”లో సావిత్రి, నాగేశ్వరరావు.

అశోకా శాండల్ వుడ్ ప్లాస్టిక్ టాల్కం,
ఆల్ పర్పస్ పౌడర్సు. వీటి ఉపయోగమువల్ల మీకు
వేసవిలో కలుగు చెమటగుల్లలు పొక్కులు వగైరాల
బాధలే వుండవు.

ASOKA
ALL PURPOSE SANDAL Powder

ASOKA Sandal

విజయా కెమికల్స్
మద్రాసు-7.


# హరివంశం

14-వ పేజీ తరువాయి

నని యు భావించుచున్నది. మీరు నాకు ...త్రు సదృశులు. నాయందు మీకు ఎట్టి విశ్వాసమున్నది?"

పౌండ్రకుడాగినాడు. సుదక్షిణ అతనిని తీక్ష్ణముగా చూచినది.

"స్వామి! తల్లిని తమరు ఏదో వలతో ఇరికించ చూచుచున్నారు" అన్నది.

"సుదక్షిణ! నీ ఆలోచన లట్లులుండును. నేను ఆమెకు బిడ్డను. వామాక్షి నాకు చెల్లెలు. దాని సుఖమును నేను ఆలోచించవలయునుగదా! ఆ బంగారువృగము పోయిన పోనిమ్ము! ఆచార్య మహానందునకు పిచ్చియెత్తి అట్లు చేసినారని యను కొందును. మరి నేను వామాక్షిసుఖమునెంచి యా మృగము నిచ్చితిని. అది పోయినది. ఇప్పుడు మరల దాని భవితవ్యమునుగూర్చి ఆలోచించవలదా! ఆలోచించితిని. తల్లీ! మీరు ఊఁ అనుడు, అంతయు శుభోదర్కమై పరిణమించును."

మహానందునిభార్య మాటలాడలేదు. ఆమె పౌండ్రకుని ముఖమువంకనే చూచుచుండెను. పౌండ్రకుడు మరల ఇట్లులనెను.

"తల్లీ! వామాక్షికి పెండ్లి ఈడు వచ్చినది. ఆచార్యమహానందులేమో ఇట్లులయినారు. ఆయనకు పిల్ల వివాహము విషయము పట్టునందురా! ఆ విషయమును నేను చూచెదను. తమకు సమ్మతమేనా!"

మహానందునిభార్య మాటాడలేదు.

"తల్లీ! తమరు 'ఊఁ' అన్నచో నన్నియు సిద్ధము చేతును."

సుదక్షిణ అన్నది.

"స్వామి! ఆమె వచ్చినది అందులకుకాదు."

పౌండ్రకు డామెవంక విచిత్రముగా చూచెను.

"సుదక్షిణే! నీవు తెలివిగలదానవు."

అత డట్లులు తన్ను సంబోధించగా, సుదక్షిణ అతనివంక విచిత్రముగా చూచినది. ఆమాట అన్నంతలో అతని కంఠస్వరము విచిత్రముగా మారిపోయినది. అతని మన స్సెప్పు డెట్లు పనిచేయుచుండెనో ఆమె కవగతమైనది. అంతలో ఆమె ఉద్విగ్నురాలైనది. "స్వామి! తాము వాసుదేవునిపై స్పర్థతో నందరిని తమ మాయావాగురలోనికి లాగుచున్నారు. వామాక్షి మిమ్మేమి చేసినది. వాసుదేవుడామెను సుదామున కెప్పుడో ఇచ్చివేసెను. ఇప్పుడు మీ ప్రయత్నమువలన నేమియగును. తల్లీ! తల్లీ! మీరు చెప్పుడు. వామాక్షిని సుదామున కిత్తుమని చెప్పుడు. మీ ప్రమేయమచ్చట లేదనిచెప్పుడు" అన్నది.

మహానందుని భార్య కిది యేమో అర్థముకాలేదు. ఆమె ఆ భర్తను, ఆ భార్యను విచిత్రముగా చూచినది. పౌండ్రకుడు మరల ఇట్లులనినాడు.

"తల్లీ! వామాక్షిని వాచాలునికిచ్చి పెండ్లి చేతును. ఇతడును బ్రాహ్మణుడు. రాజాశ్రయమున్నవాడు. బంగారు మృగము పోయిన పోనిండు. వామాక్షి ఈ వివాహమునకు తాము అంగీకరించుచోనట్టి బంగారుమృగములను పదునేనింటి నిత్తును. తాము 'ఊఁ' అనుడు. లేదో ఈ మృగమునుగూర్చి గూడ మహానందులవారు ఉత్తరవాదులు కావలసివత్తురు."

(సశేషం)




బాధగా అసహ్యంగా ఉండే
తామర నుంచి
బయటపడండి!

అది ఒక్కంతా వ్యాపించవచ్చు



తామర వుండేచోట అమృతాంజన్ వారి దెర్మల్ ఆయింట్ మెంట్ (తైలం)ని మర్దించి త్వరగా ఉపశమనం పొందండి. తామర భయంకరమైన అంటువ్యాధి. తామర వచ్చినవారు వుపయోగించే దువ్వెన, తుండుగుడ్డ, పక్కు మొదలైనవి విడిగా వుంచుకోవాలి. ఎక్కడైనా తామర వుందని తోస్తే వెంటనే అమృతాంజన్ వారి దెర్మల్ తైలాన్ని మర్దించండి.

అమృతాంజన్ లిమిటెడ్ వారి దెర్మల్ తైలాన్ని పాసిన కాళ్ళకూ, గజ్జి దురదలకూ కూడా వాడవచ్చు.



అమృతాంజన్ లిమిటెడ్ వారి
డెర్మల్ ఆయింట్‌మెంట్

అమృతాంజన్ లిమిటెడ్ 14/15, లజ్ చర్చి రోడ్డు, మద్రాసు-4
బొంబాయి-1, కలకత్తా-1, న్యూ ఢిల్లీ-1.

JWT/AM/D-1738

# మనము-మనరాష్ట్రం

12 వ పేజీ తరువాయి

సరిపెట్టుకోవచ్చుని అయాచితమైన ఉచిత సలహా ఒకటి పారేశారు. దీన్నిబట్టి కేంద్రం, ప్రణాళికా సంఘాల వైఖరి ఎలా ఉందో వేరుగా చెప్పనక్కర లేదు.

నాగార్జునసాగర్, తుంగభద్ర ఎగువకాల్వ రెండో దశలను ఆపితే మనకు చాలా నష్టం కలుగుతుంది. నాగార్జునసాగర్ రెండవదశలోగాని, కుడికాల్వక్రింద ఉండే ప్రాంతా లన్నింటికీ నీరు లభించదు. అట్లాగే ఏలూరుకాల్వ చివరఉండే కృష్ణాజిల్లా ప్రాంతాలన్నిటికీ నీరులభించేది కూడా ఆఖరుదశలోనే.అన్నింటికన్నా ముఖ్యమైన సిద్ధేశ్వరం పులిచింతల ప్రాజెక్టులు కూడా ఈ రెండవదశలోనివే. సిద్ధేశ్వరం రాయల సీమకు ప్రాణప్రదం. పులిచింతల కృష్ణాజిల్లా మెట్ట ప్రాంతాలకు జీవనాధారం. సిద్దేశ్వరంవల్ల కడప, కర్నూలు జిల్లాలలో 3 లక్షల 63 వేల ఎకరాలు సాగయ్యే వీలుండగా, పులిచింతలక్రింద తిరువూరు, నూజివీడు, గన్నవరం తాలూకాలలో 2 లక్షల ఎకరాలు సాగవుతుంది. రెండవదశ ఆగితే ఈ మెట్టభూములన్నీ శాశ్వతంగా మరుభూములుగా మిగిలిపొయ్యే ప్రమాదం ఉంది. ఇంతేగాక నాగార్జున సాగర్ జలవిద్యుత్ ఉత్పత్తికూడా ఈ రెండవ దశలో భాగమే. ఈ భాగం అమలయితే మూడు లక్షల కిలోవాట్ల విద్యుత్తు ఉత్పత్తికి అవకాశం ఉంది. పులిచింతల మూలంగా మరో 30 వేల కిలో వాట్ల విద్యుత్తు లభిస్తోంది. ఇక తుంగభద్ర ఎగువ కాల్వ రెండవదశ ఆపితే, ఈ కాల్వ మొత్తం 166 మైళ్ల నిడివి పూర్తికాక, పెన్నవరకూ నీరు రాకుండా ఆగిపోతుంది. ఈకాల్వ పెన్నలో కలిసిన ప్రదేశానికి 16 మైళ్ళ దిగువన పెన్నపై రెగ్యులేటర్‌కట్టి ఉత్తర, దక్షిణ కాల్వలను త్రవ్వి నీరు సప్లై చేయాలనే ప్లాను కూడా ఉంది; ఉత్తరపు కాల్వక్రింద గుంతకల్లు తాలూకా, దక్షిణపు కాల్వ అనంతపురం, తాడిపత్రి తాలూకాల భూములు సాగవుతాయి. ఆ కార్యక్రమమంతా దెబ్బ తినిపోతుంది. ఈవిధంగా ఈ కాల్వక్రింద ఆంధ్ర ప్రాంతంలో సంకల్పించిన 277 వేల ఎకరాలు పూర్తిగా సాగులోకి రాక పోవచ్చు. పైగా ఈకాల్వ మూలంగా ఉత్పత్తి చేయదలచిన 20 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తికార్యక్రమానికి కూడా విఘాత మేర్పడుతుంది.

గుల్హాతీసంఘం ఇంతటి ఘోర అన్యాయానికి ఒడిగట్టిన పరిస్థితిలో, నాగార్జునసాగర్, తుంగభద్ర రెండోదశలు ఏమైనాసరే వచ్చి తీరుతాయని ముఖ్యమంత్రి హామీ ఇవ్వడం సంతోషకరమే. కాని, ఏ ఆధారాన్ని చూచుకుని వీరు ఈ హామీ ఇచ్చారో తెలియదు; ఇప్పటికి మూడు ప్రణాళికల లోనూ చేర్చబడి, మిగులు క్రమములుగా వస్తున్న నాగార్జునసాగర్, తుంగభద్ర రెండో దశలకే ఎసరు పెడుతూఉంటే, ప్రణాళికలో ఇంతవరకూ చేర్చబడని పోచంపాడు, శ్రీశైలంకూడా వచ్చేస్తున్నాయని, శ్రీ సంజీవరెడ్డి, శ్రీ ఎ. సి. లు హామీ ఇవ్వడం నమ్మశక్యం గాకుండా ఉంది. ఒక వంక కేంద్రమంత్రులు గుల్హాతీసంఘం నివేదిక వచ్చేదాకా, కొత్త ప్రాజెక్టులే రావని పదే పదే చెబుతున్నారు. మొన్న ఏప్రిల్ 30 నే కేంద్ర ఇరిగేషన్ మంత్రి హాఫీజ్ మహ్మద్ "కృష్ణా—గోదావరి జలాల వివాదం తేలితేగాని, నాగార్జునసాగర్ జల విద్యుత్ పథకానికి, శ్రీశైలంపథకానికీ విదేశీద్రవ్యం మంజూరు కాబోదు; అట్లాగే ఆంధ్ర, ఒరిస్సాలమధ్య తగాదా పరిష్కారమైతేగాని, సీలేరుప్రాజెక్టు ప్రారంభం కాదు" అని మళ్లీ చెప్పారు. అయినా మన మంత్రులు హామీలు ఇవ్వడం మానలేదంటే, కేవలం ప్రజల్ని మభ్యపెట్టి పలుకుబడి నిలుపుకోవాలన్న తాపత్రయం తప్ప మరేమీ లేదు. ఇంతకుపూర్వంకూడా, అప్పటి ముఖ్యమంత్రి శ్రీ సంజీవయ్య, ఇరిగేషన్ మంత్రి అల్లూరి ఢిల్లీ వెళ్ళివచ్చినప్పుడల్లా——అక్కడ ఏం మాట్లాడేవారో ఏమో, పోచంపాడు, శ్రీశైలం రావడం ఖాయమేగాదు వచ్చేస్తున్నాయన్నట్లు చెప్పే వారు. సంవత్సరంపాటు అలా చెప్పారు. వారి హయాం మారి, కొత్తవారు వచ్చినా, హామీల అలవాటు తప్పలేదు.

పైగా ఇప్పుడు పరస్పర విరుద్ధమైన ప్రకటనలు అయోమయపు ఆలోచనలు కన్పిస్తున్నాయి. ఈ వివాదంపై కోర్టుకు వెళ్లాలని ఒకరోజు, అలా వెళ్లడం తగదని మరోరోజు చెబుతున్నారు. సుప్రీంకోర్టు న్యాయమూర్తి పరిష్కారానికి నివేదించవచ్చని సందిచ్చి, తీరా అవతలివారు ట్రిబ్యునల్‌కు పోదామంద మన్నప్పుడుగాని, తమ ఆలోచనల ప్రమాదం గ్రహించలేకపోతున్నారు. పోచంపాడు, శ్రీశైలం ఇస్తే చాలు. ఉన్ననీటితోనే కట్టుకుంటాం; అంటూ, మనవాదపటుత్వాన్ని బలహీనపరుస్తున్నారు. ఇదంతా గమనిస్తుంటే, అసలు సమస్య పూర్తిగా ఆకళింపు కాలేదా అనిపిస్తోంది.

ఈ వివాదంతో ప్రభుత్వ వైఖరి గురించి, ప్రజలకు పదేపదే చెప్పవలసిన పనిలేదు; హామీలుకూడా అనవసరం. కావలసినది వాక్చాతుర్యంకాదు. కార్యశూరత్వం. "ఇకనుంచి పత్రికలద్వారా బయటపడం; సభలో ఈసమస్యగురించి మాట్లాడం"అని శ్రీ సంజీవరెడ్డి చెప్పడం బాగుంది. గుల్హాతీసంఘం నివేదిక వచ్చేదాకా, (జూలై ఆఖరులో వస్తుందంటున్నారు) ఈ వివాదం సంగతి తేలదు. ఆ నివేదిక ఎలాగు మనకు వ్యతిరేకంగా ఉంటుందని అంతా నమ్ముతున్నారు. ఒకవేళ అంత వ్యతిరేకంగా ఉండకపోవచ్చుకాని ఉంటుందన్న ఊహతోనే ముందు కర్తవ్యాన్ని గురించి ఆలోచించాలి. తమ ఆలోచనలు ఒక నిర్దిష్టస్వరూపానికి వచ్చినతరువాత చెప్పాలి; వాటి బాగోగులను చర్చకు పెట్టాలి. అంతేకాని, రోజుకొక ప్రకటనచేసి, ప్రజల్ని తికమకపెట్టడం మంచిదికాదు. ★


## ఎలెక్ట్రిక్ & రేడియో గైడ్

ఇంటిలోనె ఎలెక్ట్రికల్ ఇంజనీరింగ్ పూర్తి కోర్సు రేడియో రిపేరింగ్ రేడియోమెకానిసం,ఇండ్ల వైరింగ్ నేర్చుకోండి. ఇంటిలోనే రు. 50 లకు ట్రాన్సిస్టర్ రేడియో తయారుచేయుటం నేర్చుకోండి. ఎలెక్ట్రిక్ & రేడియో పనులకు ఉత్తమగైడ్. (400 చిత్రపటములు) ధర రు. 8. వి.వి.పి. చార్జి రు. 2.

**14 భాషల మాస్టర్ :**

ఉపాధ్యాయుల సహాయము లేక ఇంటిలోనే చైనీస్, జపానిస్, అరవం, ఫ్రెంచి, రష్యన్ మొ॥ భాషలను నేర్చుకోండి. 14 భాషలు ధర రు. 6/- V.P.P. చార్జి రు.2. డ్రాయింగ్, పెయింటింగ్ రు 5-50. మోటార్ మెకానిక్ టీచర్ రు. 5-50. V.P.P. చార్జి రు. 1-50 అదనం.

Tagore Vigyan Mandir (A. 8)
Halka No. 13, ALIGARH

ఒక సీసా, అనేక చికిత్సలు!

SLOAN'S LINIMENT

FOR EXTERNAL USE for the relief of muscular congestion aches and

DIRECTIONS: Apply the liniment liberally with a soft flannel cloth

TRADE MARK

KILLS PAIN

Dr. Earl S. Sloan

Manufactured in India by MARTIN & HARRIS (PRIVATE) LTD., 1 B, Ashutosh Mukherjee Road, Calcutta 20.

Mark owned by STANDARD LABORATORIES INC.

కీళ్ల వాతము, వాతపునొప్పులు కండరవాపులూ, అందిం మూలంగా కలిగే బాధలకు. స్లోఅన్స్ లినిమెంట్ ఉపయోగించండి. స్లోఅన్స్ మీ నొప్పులను తక్షణం దూరంచేస్తుంది.

వార్నర్-లాంబర్ట్
ఫార్మస్యూటికల్ కంపెని
(పరిమితబాధ్యతలతో యు.ఎస్.ఎ.లో స్థాపితము)

TEL.

## తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!


# PHILLIPS ఫిలిప్స్ సైకిళ్ళు

## మీకై నిర్మితమైనవి

సొగసై కంటికి నదరైన ఫిలిప్స్ సైకిలు నేటి మీవంటి వుత్సాహవంతులైన యువకుల కొరకై నిర్మితమైనది. ఎట్టి మోటు వాడుకకైనను తట్టుకొన జాలునట్లుగా అవసరైన పదును చేయబడిన ఉక్కుతో దృఢముగా నిర్మింపబడినది.

డెబ్బై ఏండ్లుగా ప్రపంచ ఖ్యాతి నొందిన ఫిలిప్స్ సైకిళ్ళు, యిప్పుడు టి. ఐ. సైకిల్స్ వారి అత్యాధునికమైన కర్మాగారంలో, ఖచ్చితమైన పద్ధతులలో తయారుచేయబడుచున్నవి.




**టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా** అంబత్తూరు – మద్రాసు

TPT/TIC/PHI 1406

కాదూ) ఉండాలి. బిస్కట్లు, దండేలు అవి తియ్యక్కర్లేదుగాని ఆఖరి సీనుల్లో విలన్‌తో దెబ్బలాడి కొండమీదికో, నది ఒడ్డుకో అలా అలా వెళ్లి విలన్‌ని అందులో తోసెయ్యాలిగనక కోవాలు, మేవాలు (సొంతానివే అక్కర్లేదు) తినాలి. మఫ్లర్ మెడని చుట్టుకోవాలి. అన్నట్లు హీరో నెత్తిన టోపీ ఉండాలి. ("కౌబోయ్" దైతే మంచిదే లేదా రూపీ చీనీ ఏదో ఒకటి. ఆప్‌కీ ఫర్మాయిష్ హిందూస్తానీమాత్రం కాదు.) హీరోకి తండ్రిలాంటి పదార్థం సినిమా ప్రారంభ మయ్యేసరికి (చిత్రపటమై) గోడకి వేళ్లాడుతూ ఉంటుంది. వాళ్లమ్మ దానికి పువ్వులుపెట్టి "మీ కొడుకు నెప్పుడూ ప్రేమించువానిగా చేయండి" అంటూ మ్రొక్కుతూ ఉంటుంది. అలా ఉండగా హీరో ఆమెను అమాంతం ఎత్తుకుని, (కుస్తీలుపట్టే అలవాటు కాబోలు అని కిట్టనివాళ్లు అనుకుంటారు.) దింపి "అమ్మా! నే ప్రేమించా నంటాడు". దాంతో కథ ప్రారంభిస్తే చాలు. పాటల అంచీలమీదుగా మధ్య మధ్య విలన్ ప్లేన్ సిగరెట్ రింగులను (కొన్ని ఫ్రేములలో ప్రేక్షకులకు జ్ఞాపకార్థం చూపుతూ)

# హిట్టు సూత్రాలు

11–వ పేజీ తరువాయి

చూపిస్తూ హీరోయిన్ "ఛార్మ్" హీరో "పర్సన్" తో క్లయిమాక్సుకి వెళ్లిపోవచ్చును. అప్పుడా హీరోయినుతండ్రి సాధారణంగా లక్షాధికారి (కావాలంటే అందుకు దాఖలా నైట్ గవునూ ప్లస్ పైపూ చూడగలరు) విలన్‌కిచ్చి ఆ పిల్లని (కొన్నిచోట్ల మాలాసిన్హా అంత సన్నంగానూ, కామినీ కౌశల్ అంత యవ్వనంగానూ ఉండును.) పెళ్లిచేస్తానవడంతో యిక పాట ఉండదని ప్రేక్షకులు లేచిపోతారు. (హీరోయిన్ కూడా విలన్‌చేతిలో చిక్కిపోగా మిగిలిన హీరోతో లేచిపోవును.)

హీరోని 'బంగ్లీ' అన్నా 'బేవకూఫ్' అన్నా 'అవాడీ' అనుకున్నా, లేదూ "బోయ్ ఫ్రెండ్" "మిస్టర్ ఇండియా", "షంషేర్" అని ముఖస్తుతి చేసినా ఏమీ అనుకోడు. పైగా "మైనషేమే హూ", "మురేఘు జీనేదో" అంటాడు.



విజయగోపాల్ వారి "చిట్టితమ్ముడు"లో సూర్యకాంతం.

"మంచిమనసులు"లో జానకి, సావిత్రి



నవీన చిత్రవారి 'సవతికొడుకు'లో ఎన్. టి. రామారావు, జానకి.



“మంచిమనసులు”లో రంగారావు.

# హిట్టు సూత్రాలు

(అంటే నేను 'క్షైపు' లో ఉన్నాను. నన్నిలా నాలుగు డబ్బులు చేసుకుంటూ బ్రతకనివ్వండీ అని అర్థం.) 'ఇప్పు డప్పుడే “కథ” లోనికి పోను' అని తాత్పర్యం.

## నాయిక ముఖస్తుతి

ఇక హీరోయిను. సాధార్నంగా లండన్, బొంబాయిలు (హాలీవుడ్‌లో ఎమ్మే ప్యాసై వస్తే కొత్తగా ఉంటుందిట ? ఇంత పెద్ద రెవల్యూషన్‌తో ఓ హిందీబొమ్మ త్వరలో రాగలదని ఆశించవచ్చును) వెళ్ళి చదువుకుని వస్తుంది. (ఆమాట అబద్ధమైనా బార్బర్‌షాపుకి అవశ్యం వెళ్ళివస్తుంది. బాబ్‌డ్ హెయిర్రూ, లేదా గుర్రం తోకముడీ, నుదుటిమీద ముంగురులకు 'లెంగ్త్ కంట్రో' లు తప్పవుగనుక) “రాక్ అన్రోలు” ఔటాఫ్ ఫాషనైతే “లతా” వాయిస్‌తో సహా రాక్రోలుతో కలిపి భారతనాట్యం చేస్తానని చెప్పి కథాకళి ఆడేస్తుంది! చెలికత్తెలసాయంతో హీరో వెంటబడుతుంది. కారుంటే 'హారన్' బాణాలతో హీరోని ప్రణయకయ్యానికి పిలిచి (కుర్ర) కారురేసులాడి, ఓ మంచిపాట పాడి తన హృదయం పారేసుకుని హీరోహృదయం తీసుకుని పారిపోయి అలా అలా తిరిగి విలన్‌చేతిలో చిక్కపోతుంది. ఈలోగా హీరో దేశవాళీ మార్కు క్రైమ్ కథలన్నీ నెమరేసుకుని బోలెడు ఫీట్‌లు చేస్తాడు. “అసలీ చిత్రంలో కరుణరసం లేదూ” అని తప్పుపట్టేవారికి కన్నీళ్ళు తుడువాలని గ్లిసరిన్ (క)న్నీళ్ళు కారుస్తూ హీరోయిన్ రెండు పాటలు (తెలుగైతే నేపథ్యం తథ్యం. కాని హిందీలో హీరోయిన్ స్వయంగా పెదాలు కదుపును) పాడును.

అదీగాక లేటెస్టు ఫేషన్లు వాటికి తోడు కొత్త హీరోయిన్ సన్నంగా ఉండగానే చూద్దామని (మర్రొండు సినీమాలకి స్థూలంగా వచ్చును.) ప్రేక్షకులు తప్పకుండా వెళ్తారు. (నిర్మాతల కీవిషయం బాగా తెలును.)

మరి ఓసారి చూడాలికదా అనుకుని చూసి చప్పరించి పాటలు బాగున్నాయి పోదామని (మరోసారి వెళ్ళి వినాలి కదా) ప్రేక్షకుడు పిల్లైనన్ని సార్లు చూసి పాటలు పాడు”కోబోతే చాలు ! (దాంతోనే “హుర్రేయ్ ! ఫటాకా ఢాం ధూం... ఖటమల్ (నల్లి) ఖటమాండూ మంటూ డ్యాన్సు దానికదే వస్తుంది !) అదే పదివేలు (అడుగుల ఫ్లాటు) ఇక నీతీ నియమం ? ఇదేం కథా ? సినీమా గాని. రంగులు, హంగులూ, పాటలు, కోటల్ని దాటే మాటలూ ఉన్నాయి. మరోమాటూ చూడండని ఉపన్యాసాలిస్తూ “సినీమార్కులు” ఉపన్యాసాలిస్తూ వస్తారుకూడా గనక దానికంటే యిదే బాగు ?! ఔనా? ★



## పూవు మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ, మీ సరియైన దర్శనముగురించిన్నీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టు కార్డుపైన మీకు యిష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేది, వేళ వివరములున్నూ, మీ సరియైన చిరునామాయున్ను వెంటనే వ్రాసి పంపండి.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, మీరు కార్డు వ్రాసిన తేదీలగాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, ఏ వ్యవహారములో మీకు జయముకలుగునో, మీ ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్ద్రవ్యలాభము మొదలగు వానినిగురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు. 1-4-0 లకు మాత్రమే వి. పి. గా పంపగలము. (వి. పి. చార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహము లేవయినా వున్నయెడల శాంతిచేయు విధానంకూడా తెలుపగలము. వివరములు మా పూచీపైనపంపబడును. మేము పంపిన భోగట్టా మీకు తృప్తిగా నుండనియెడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించి చూడుడు. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

Pt. Dev Dutt Shastri, Raj Jyothishi (W. P.) JULLUNDUR CITY.



## తుషార్ వంటింట్లో వుంటే ఇంట్లో అంతా ఆరోగ్యమే

తన కుటుంబంలోనివారి ఆరోగ్యం వారు తినే ఆహారంపై ఎక్కువగా ఆధారపడుతుందని వివేకి అయిన ప్రతి తల్లికి తెలుసు. వంట చేయుటకు సరైనది తుషార్ – ఏ, డి, విటమినులతో ప్రశస్తి కెక్కిన వనస్పతి అని కూడా ఆమెకు తెలుసు.






# తుషార్

ఏ, డి, విటమినులుగల వనస్పతి

తుంగభద్ర ఇండస్ట్రీస్ లి., కర్నూలు

ASP/TLP


# అందుకోలేని ఆతిథ్యం

31వ పేజీ తరువాయి

మంచి. అంతేకాదు. మీరు రైల్లో టికెట్ లేకుండా ప్రయాణం చేశారు!"

మురళి ఆశ్చర్యంగా ఆమెను చూచాడు.

"మురళీగారూ! పరిస్థితుల ప్రోద్బలంవల్ల మీ రబద్ధమాడారు కాదనను. కానీ పరిసరాల్లోని వ్యక్తులమనస్తత్వాలు మంచివైనప్పుడు ఆ అబద్ధం వల్ల వారి మనస్సులు నొప్పించినవాళ్ళయ్యారు. కావాలని ఆతిథ్యం కోరితే కాదనేవా ళ్ళిక్కడెవ్వరూ లేరు. అది గుర్తిస్తే సంతోషం" అని అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది.

మురళి ఆలోచిస్తూ కూర్చున్నాడు. అతనికళ్ళకు అస్పష్టమైన దృశ్యం మసగ్గా అగుపించింది.

*　　*　　*

అది ఒక పాతకొంప. చుట్టూ దరిద్రదేవత విక టాట్టహాసం చేస్తోంది. మలేరియాకోగానికి ఆ స్థలం పుట్టిల్లు. మలేరియా విలయతాండవానికి ఆ యింట్లో అప్పటికి రెండు ప్రాణాలు రాలిపోయాయి. ఇంక మిగిలింది ఒక ఎండుకట్టె, ఒక బండరాయి.

"అమ్మా! అయ్యా!!" మూలుగుతోంది డొక్క ఎముకలగూడు. గూట్లో దీపం సత్యాగ్రహం చేస్తానని బెదిరిస్తోంది. మంచానికి రెండడుగుల దూరంలో, మోకాళ్ళల్లో తలదూర్చుకు కూర్చున్నాడు ఒక పదిహేనేళ్ళ బాలుడు. "అమ్మా! అయ్యా!! ...... బాబూ మురళీ!" పిల్చింది అస్థిపంజరం. బాలుడు లేచి మంచం సమీపించాడు. " బాబూ....నా....జీ....వి....క....ది....లి....పో "

గూట్లో దీపం గుప్పుమంది. మురళి ఎముకలగూడు మీదపడి, "అమ్మా! నువ్వు పోవద్దే....నన్నూ తీసుకుపోవే...." అని ఏడుస్తున్నాడు. గుడిశలో చీకటి కమ్ముకుపోయింది. బాలుడు సొమ్మసిల్లి పోయాడు.

పోలీసుల ఈలలు, మనుష్యుల కేకలు, బ్యాటరీ లైట్ల కాంతితో ఆ ప్రాంతంలోని చీకటిదేవత నల్లనిముసుగు కొంతవరకూ తొలగింది. "ధబ్" ఏదో వస్తువు గుమ్మంలోనుంచి దొర్లుకువచ్చింది. ఎవరో పరుగెత్తారు. సొమ్మసిల్లిన బాలుడు తేరుకుని ప్రక్కగా వచ్చిపడ్డ ఒక గుండ్రని వస్తువును చీకట్లో తడిమిచూడసాగాడు. అది ఒకకారు ట్యూబు. దాన్నిండా నీరులాంటి ఏదో ద్రవం పోయబడుంది.

"రాస్కెల్! ఈ గుడిశలోనే ఉంటాడు వెతకండి!" అందొక గంభీరకంఠం. నాలుగు ఇనుప బూట్లకాళ్ళు లోనికి ప్రవేశించాయి. ఆ కాళ్ళ తాలూకు వ్యక్తుల చేతుల్లోని బ్యాటరీలైట్ల కాంతి ఆ బాలుడిమీదా, ట్యూబుమీదా ప్రసరించబడింది. "వెధవా! మా కళ్ళల్లోనే దుమ్ముకొడతావుకదూ?" అంటూ, బయటకు లాక్కొచ్చారు. వీధిదీపప్పు

కాంతిలో సోలీసుల్నీ, ఇన్‌స్పెక్టర్నీ చూచి గజగజ వణుకుతూ బావురుమన్నాడు ఆ బాలుడు.

కోర్టులో అంత చిన్నతనంలోనే 'నాటుసారా' వ్యాపారం చేస్తున్నందుకు, ఆ బాలుణ్ణి సక్రమమైన పద్ధతిలో పెట్టేటందుకు, అయిదు సంవత్సరాలు "బాలుర క్రమశిక్షణశాల"కు పంపమని న్యాయాధిపతి తీర్పునిచ్చారు. ఆ సమయంలో అతనికి 'నా' అన్న వాళ్ళెవరూ లేకపోయినా, 'మామ' అనబడే ఒక వేలువిడిచిన మేనమామ ఉన్నాడు. అతనూ కోర్టుకు హాజరయ్యాడు. అతని అంతర్థం ఆ బాలుడు జైలుకువెడితే అతని ఇల్లు ఆక్రమించాలని.

* * *

పదిగంటలకు స్నానానికి నూతిదగ్గరకు బయల్దేరిన మురళిని కొన్ని మాటలు నిలిపివేశాయి.

"ఏమండీ వదినగారూ! ఈ సంవత్సరం రాధ పెళ్ళి చెయ్యరా?" అందొక గొంతు.

"చెయ్యాలనే ఉంది వదినగారూ! మంచి సంబంధంగూడా చూదాం" అన్నది మరొక గొంతు.

"అరె ఎప్పుడూ? ఎక్కడా?"

"ఇక్కడే! అబ్బాయిపేరు మురళి, విశాఖపట్నం. అమ్మాయి కూడా నచ్చుకునేట్టే ఉంది."

"ఆస్తిపాస్తులు"

"ఆ, వాటిదేముంది. మనకుండేదేదో మనకుండనే ఉంది. ఆస్తిపాస్తుల విషయం ఎత్తానంటే మావారు మండిపడతారు. కుర్రాడు బుద్ధిమంతుడు, యోగ్యుడూ అయితే చాలు. ఇవాళో, రేపో వారిచేత అన్నీ మాట్లాడించేస్తాము."

ఇంక వినలేక మురళి గబగబా నూతిదగ్గరకు వెళ్ళిపోయాడు. స్నానం చేస్తున్నంతసేపూ అతన్ని అనేక రకాల ప్రశ్నలు చుట్టుముట్టాయి. "తనెవరు, తన అంతస్తేమిటి, తను రాధకు అర్హుడేనా, తను ఆ ఇంటికి ఏవిధంగా అతిధిగా వచ్చాడో తెలిస్తే వీళ్ళంతా పూర్వంలాగా ఆదరిస్తారా?" మెల్లగా గత స్మృతుల్లోకి జారిపోయాడు.

ఆరోజుతో అయిదు సంవత్సరాలు పూర్తయ్యాయి. జైలునుంచి వచ్చి, "మామ" అనబడే మేనమామవద్దకువచ్చి, ఆశ్రయిస్తే, ఒక అయిదు కాగితం, రెండు జతల బట్టలు, తిరిగి గుమ్మం తొక్కొద్దన్న తాకీదు ముట్టాయి.

అది మొదలూ వాళ్ళనూ, వాళ్ళనూ ఆశ్రయించేవాడు. ఉన్నచోట నిలుగునుపుడే రైలెక్కేవాడు. ఇదీ అతని చరిత్ర.

మధ్యాహ్నం అంతా విశ్రాంతి తీసుకుంటున్నారు. రాధ క్రితంరోజుటిప్పు కనిపించనేలేదు. కుంటి కుర్చీలో కూర్చుని, ఆలోచిస్తున్నాడు మురళి.

గుమ్మంముందు చప్పుడైంది. రాధ అతనిబట్టలు మడతల్లోతెచ్చి బల్లమీదుంచి వెళ్ళిపోయింది. వాటిని చూస్తూ, మురళి ఒక నిర్ణయానికి వచ్చి, "స్టోర్" రూం గుమ్మంముందు నిలబడి చుట్టూ చూచాడు. పందిరిస్తంభాన్ని పట్టుకు గిరగిరా తిరుగుతున్నాడొక కుర్రాడు. మురళి పిల్చాడు. కుర్రా డొచ్చాడు.

"నీ పేరు?"

"చంద్రం"

"నాకొక పెన్సిల్ కావాలి తెచ్చిస్తావా?"

కుర్రాడు నిమిషంలో తెచ్చిచ్చాడు. చుట్టూ వెదికి ఒక తెల్లకాగితం సంపాదించాడు మురళి.

సాయంత్రం కొందరు చల్లగాలికి ఊరిబయటకు షికారు బయల్దేరారు. మురళి పాంట్సు, షర్టు తొడుక్కుని, విప్పినవి మడతల్తో బల్లమీదుంచి ఒక కాగితంమడత వాటిమీదుంచి బయటకు వచ్చాడు. రాధ దూరంగా ఎవర్తోనో మాట్లాడుతోంది. క్షణం ఆమెను చూచి, గబగబా షికారుకు వెళ్ళేబట్టు వెనగ్గా నడవసాగాడు.

మురళి వెళ్ళిన మరో పదిహేను నిమిషాలకు రాధ ఆ రూం కొచ్చింది. క్రితంరోజు మురళి ధరించిన బట్టలు, వాటిమీద ఒక కాగితంమడతా చూచి ఆత్రుతగా కాగితా న్నందుకుంది.

"గౌరవనీయులైన రాజబాబు, రాధాదేవిగార్లకు,

మీ ఆతిధ్యం జన్మలో మరువరానిది. ఈసరికి రాధాదేవిగారు నా నిజచరిత్ర చాలా గ్రహించి ఉంటారు. ఒకరోజు మీ ఆతిధ్యం అందుకోవటం నా పూర్వపుణ్యఫలం. మీలాంటివారి నీడనైనా తాకే అర్హతలేనివాణ్ణి, నేను మీకు చెప్పిందంతా అబద్ధం. నా చరిత్ర సూక్ష్మంగా ఇందులో పొందుపరుస్తున్నాను......ఆవిధంగా రైలునుంచీ దిగిపోయాను. అప్పటికి నాల్గురోజులైంది అన్నంతిని. ఊళ్ళోకి వస్తే ఇక్కడెదో పెళ్ళి జరుగుతుందనితెల్సి, అర్థించటానికి వచ్చాను. రాజబాబుగారికి నా గతచరిత్ర చెప్పాలనుకున్నాను, కానీ వారు వినేస్థితిలోలేరు. అందుకే అబద్ధమాడాను. నేను చేసిన ఈపనికి చింతిస్తున్నాను. మీవి పవిత్రమైన హృదయాలు. అందుకే మీ చెంత నిలబడలేకపోయాను. మీ ఆతిధ్యాన్ని సంపూర్తిగా పొందలేకపోయాను. ఇహనుంచీ నిజాయితీగా కాలం గడపటానికి ప్రయత్నిస్తాను. ఆ నిజాయితీని కాలం కలిగించనివాడు యేంచేస్తానో......ఇహ వ్రాయలేను.

ఇట్లు,
మురళి"

రాధ ఉత్తరం చదివి, దీర్ఘంగా నిట్టూర్చింది. రాజబాబుకు అప్పటికి కొంత తీరిక చిక్కింది. చకచకా "స్టోర్" రూంలోకివస్తూ, రాధని, ఆమె చేతిలోని కాగితాన్నిచూచి, కాగితాన్నందుకుని గబగబా చదివి, "అరే, ఇదేమిటి? కథలోలాగావచ్చి, కలలోలాగా వెళ్ళిపోయాడు! ఉత్త పిరికివాళ్ళాగున్నాడే?" అంటూ నోరుతెర్చుకు నిలబడిపోయాడు.

* * *

సాయంత్రం ఆరుగంటలకు మద్రాసుపోయే పాసింజరుబండిలో ఒకానొక మూడవతరగతి కిటికీప్రక్కగా కూర్చుని, ఆ చిన్న స్టేషన్నీ, వచ్చే పోయే వాళ్ళనూ చూస్తున్నాడు మురళి. "కూ" మని కూతపెడుతూ, మద్రాస్‌వైపుకు సాగింది రైలుబండి. క్రమంగా ఆ స్టేషనూ, దూరంగా కనిపించే గ్రామం మరీ దూరం కాసాగింది. ★


పండిత
డి. గోపాలాచార్యులవారి
జీవామృతం
ఆరోగ్యానికి బలానికి
ఆయుర్వేదాశ్రమం
(ప్రైవేటు) లిమిటెడ్
మదరాసు-17

డాక్టర్ వృత్తి చేయండి!
ఇంటిలో విరామంగా కూర్చొని వుండేవ్వాను, పోస్టల్ ట్యూషన్ ద్వారా, హోమియోపతి చదువుకొని, గవర్నమెంటురిజిస్టర్డు కాలేజీద్వారా డిప్లొమా పొందండి. ప్రాస్పెక్టస్ ఉచితము. వివరములకు వెంటనే వ్రాయండి.
INDIAN
HOMOEOPATHIC
COLLEGE
(APW) JULLUNDUR CITY

శ్రీ బాలాంజనేయ ప్రశ్న
సంతానము, రోగములు, గ్రహబాధలు, వివాహం, పారిపోయిన పశువులు, మనుష్యులయొక్క ఆచూకీ, దొంగిలించిన సొమ్ము, వీడిపోయిన భార్య మొదలగు కోరిన 5 ప్రశ్నలకు వెంటనే వ్రాసి పంపగలము. రూ 2 ఎం.ఓ. చేయండి. నెలలవారీగా 12 నెలలకు 1 సంవత్సరం జాతకము రూ 2. పూర్తి పేరు, జాబు వ్రాసిన టైము తెలిపిన చాలును.
హనుమాన్ జ్యోతిషాలయము,
10వ లేను, అరండల్ పేట, గుంటూరు 2.

మంచి పుస్తకాలు
జీవిత రహస్యాలు:- మీ దాంపత్యసుఖానికి అనేక కామ సూత్రాలు :-...... రూ. 3-50
యువతి - స్త్రీలను గురించి అనేక కుతూహల విషయాలు...... రూ 3-50
సంతానము.- గర్భనిరోధానికి 60 నవీన సులభ మార్గాలు...... రూ 3 50
ఉమ్మడి రహస్యాలు:- వ్యాపారంలో లక్షలు సంపాదించే అనేక కొత్తదారులు. రూ 6-00
ఉద్యోగదర్శిని:- మనదేశంలోని అన్నిరకాల ఉద్యోగాలు, అర్హతలు, పొందే మార్గాలు. రూ 3-00
ఆత్మజ్ఞానము:- శరీరానంతరం ఆత్మను గురించిన నవీన శాస్త్ర పరిశోధనలు. రూ 2-50
పోష్టు ఖర్చులు చితం క్రింది ఎడ్రస్సుకు వ్రాస్తే వి పి పోస్టుద్వారా మీయింటికి పంపబడును
దేశసేవ ప్రచురణలు, ఏలూరు, ఆంధ్ర

## కుష్టు సమస్త మహా వ్యాధులకు

బొల్లి మొదట నెలలో 40% నివారణ!!! 10% నివారణ!!

మా లెప్సిన్ అమోఘ ఔషధము!!!

వివరములకు గ్రంధే రఘురామ గుప్త

అమర జ్యోతి ప్రొడక్ట్సు మార్కాపురం కర్నూలు జిల్లా

## RATNAM'S N-OIL

( శైత్యోపచారకము )

అంగదరములు బలహీనత చెంది, చిన్న దనతో తిరిగి యథాప్రకారం అయి పూర్తి సౌఖ్య మనుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి గలది. 1 సీసా రూ. 10 లు వి. పి. 1-4-0 కావలసినవారు ముందుగా 1-4-0 పంపేది. ఇందులో స్పెషల్ రకం అర్జంటుగుణమునకు రూ. 25-0-0 లు.

డాక్టర్. రత్నం సన్స్, (Estd 1904)
మలక పేటబిల్డింగ్స్, అజంపూరా మార్కెట్ దగ్గర, హైదరాబాద్-24 (ఆంధ్రప్రదేశ్)






నిజం, ఈ క్రొత్త సబ్బు చాలా బాగుగా శుభ్రపరుస్తుంది ఆతేడా నేను కనిపెట్టేను.

అది ఏ ఇతర సబ్బులకంటె చాలా కాలము నిలవుంటుంది, అంతకంటె ఇంకేమి కావాలి.






జ్ఞాపకముంచకోండి, అది ఝలక్. నీకుమరి ఎక్కువ హామీ ఏమిటనగా, దానిని బజార్లమ అమ్మకము చేయుచున్న వారు మార్గదర్శక సంస్థ. గోద్రెజ్ సబ్బులలో ఉత్తమ నామము.

ZA. 3×3-62 TEL (7" x 3")

# గళ్లనుడికట్టు - 100

## అడ్డం

1. పడవా? పోనీ పొట్ట చేసి నీటిమీద ప్రయాణం చెయ్యి!
3. జంట!
5. మాముదివం మధ్య మనస్సు.
6. స్వప్నము తలక్రిందులు!
8. గౌరవం విడిచి కొట్టులో ఉన్నది!
9. ఓర్పుగా ?
11. రోడ్డుమీదది తిరగబడింది.
13. గౌరవములా?
16. సర్పము.
17. శక్తి ఉత్సవము.
19. ఇది ఒకప్పుడు సింహాసనంమీద ఉన్నదిట!
21. మృగము.
24. స్ఫటికలో కొంతభాగం మారినా అదే.
26. ఒక దినుసు వస్త్రము.
27. దిక్కుల చివరలు!
30. —వ్రాత అంటారు.
32. తోక సిగలో వగ!
34. అరోజా ఒక ప్రదేశం.
35. వ్రాతకి సంబంధించినది చిలిపిదే!
37. దివానికి ఏడురెట్లు.
38. గుమ్మము.
39. కవాటము.

## 99-వ గళ్ల నుడికట్టుకు జవాబు





## నిలువు

1. ఒకటికి సున్నా చేర్చండి!
2. జాలరివద్ద ఉంటుంది.
3. బంధము.
4. వందవేలు.
5. జ్ఞానశక్తి లేనప్పుడు ఇది ఉందంటారు. ఇక్కడ కలగాపులగం.
7. లోహముతో పనిచేయువాడు.
8. భక్త విభీషణుని విభుంటుపు! బెదరడము వెతకండి!
10. మత్తు కలిగించేది!
12. ఈ వార్తలు కావాలంటారు.
13. రమలో తిరిగేది తలక్రిందులయింది!
14. యజ్ఞం.
15. తెల్లనిపానీయం తలక్రిందులు.
16. వర్ణశాల.
18. మీగడ—.
20. అప్పటి దుస్తరములలో కప్పుకునే వస్త్రము!
21. సోపానము.
22. ముసలితనమే!
23. ఈ చెట్టు నీటిమీద తేలటమా ?
24. ఎన్నో.
25. వ్రాతగాడు!
26. గడ్డి—
28. బుట్టనిండా! (ఆశఅంటారు!)
29. వృద్ధ?
31. దుంకన (—"స్నైటువా" అని ఒక పాత నాటకం పాట!)
33. జుట్టు!
34. —రాయి అంటారు.
36. పిక్కటలలో తండ్రి.
37. ఉబ్బు!



ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రకటనలు మీ వ్యాపారాభి వృద్ధికి తోడ్పడుతాయి. వివరాలకు: ఎడ్వర్ టయిజ్ మెంట్ మేనేజర్ కి వ్రాయండి.

నెర్విటాల్

నరముల బలహీనతకునూ, రక్తపోటుకునూ రామ బాణము. అనుభవయుక్తముగా చేయబడినది.

8 ఔ. సీసా 5-75, పోస్టేజి 1-75.

ఇండియన్ మెడిసన్ హౌస్,

విజయవాడ-2.



అలంకారానికి!

శారదా (రిజిష్టర్డు) ఆభరణములు

బంగారు కవరింగ్ చేయబడిన మాశారదా నగలు ధరించి ఆనందించండి

శారదాగోల్డుకవరింగ్ వర్క్సు (రిజిష్టర్డు)

చిలకలపూడిపోష్టు మచిలీపట్నం (ఆంధ్ర)






సర్వ గర్భాశయ వ్యాధులను పోగొట్టి, ఆరోగ్యముగా సంతాన మును కలుగ జేయును. అన్ని షాపుల్లో దొరకును. సీసా 2-8-0

కృష్ణా లేబరేటరీ బెజవాడ


# న్యూఢిల్లీ లేఖ

6-వ పేజీ తరువాయి

ఉన్నారంటారా? కూడూ, గుడ్డా చవగ్గా లభింప జేయమని ప్రజలు మమ్మల్ని ఇక్కడకు పంపుతున్నారు. కాని, మేము వారికి ఇస్తున్నదేమిటి? ఆదేశాలేకదా!''

ఢిల్లీ నగర పాలకసంఘం మాజీ అధ్యక్షుడు శ్రీ శ్యామ్‌నాథ్‌కు మరోవిధంగా ఆశాభంగం కలిగింది. తమ కుటుంబానికి ''ఢిల్లీలోని ప్రముఖ ముస్లిం కుటుంబాలతో సన్నిహిత సంబంధాలు ఉన్నప్పటికీ, తమ ముద్రణాలయంలో ఖురాన్ అచ్చు అవుతున్నప్పటికీ, ముస్లిం ఓటర్లు తమకు అన్యాయం చేశారని ఆయన భావించారు.

నియోజకవర్గంలోఉన్న మొత్తం 33 వేల మంది ముస్లిం ఓటర్లలో 24 వేలమంది తమతో పోటీ చేసిన ముస్లిం అభ్యర్థికి ఓట్లు వేశారని శ్రీ శ్యామ్‌నాథ్ వెల్లడించారు. ఈ అభ్యర్థిని జన సంఘం నిల్పిందనీ, అతడికి కావలసిన డబ్బూ దస్కం కూడా ఆ పార్టీయే సమకూర్చిపెట్టిందనీ కూడా ఆయన వివరించారు. శ్రీ శ్యామ్‌నాథ్ ఏదో గొప్ప రహస్యాన్ని కనుగొన్నారని అనుకో నవసరంలేదు. ఇంతకుమునుపు శ్రీ నెహ్రూ ఈ రహస్యాన్ని కని పెట్టి కాశ్మీర్‌లో జనవాక్యం తెలుసుకోవాలనే వాదాన్ని ఉపసంహరించుకున్నారు. ముస్లిం అభ్యర్థి ఎవరూ లేకపోతే, శ్రీ శ్యామ్‌నాథ్‌కు ముస్లిం ఓట్లన్నీ వచ్చేవనటంలో సందేహంలేదు. తమ అభ్యర్థికి ఆర్థికసహాయం చేసినవారెవరు అన్న విషయంతో ముస్లిం ఓటర్లకు నిమిత్తంలేదు. ఆ డబ్బు జన సంఘం ఇచ్చినా, కాంగ్రెసుపార్టీ ఇచ్చినా వారికి ఒక్కటే. జనసంఘం బలపరచిన ముస్లిం అభ్యర్థి కనక గెలిచిఉన్నట్లయితే, లోక్‌సభలో అతడు ఆ పార్టీ సభ్యులతో కలసి కూర్చునేవాడేనా? అంటే అను మానమే. ఏది ముస్లింలకు ప్రయోజనకరం అని అతడు అనుకుంటాడో దానికే అతడు ఓటు వేసేవాడు.

* * *

చరిత్రప్రసిద్ధమైన బుద్ధగయ ఆలయాన్ని గూర్చి, దాని పరిసర భవనాలనుగూర్చి పార్లమెంటులో ఒక ప్రశ్న వచ్చింది. ఈ నిర్మాణాలు, మరమ్మతులులేక శిథిలావస్థలోఉన్నవనీ, ఆలయ నిర్వహణమండలి ఈ సందర్భంలో ఆందోళన వెల్లడించిందనీ తెల్పుతూ, ప్రభుత్వం వీటి విషయం ఏమి చేయ దలచిందని ప్రశ్నించారు. ఈ ప్రశ్నకు సాంస్కృతిక వ్యవహారాలమంత్రి సమాధానం చెబుతూ, బుద్ధగయ ఆలయం భద్రపరచవలసిన కట్టడాల జాబితాలో లేదనీ, ప్రభుత్వానికి వీటి సంగతి తెలియదనీ వివరించారు.

ఢిల్లీలోఉన్న జుమ్మా మసీద్ కూడా భద్రపరచ వలసిన కట్టడాల జాబితాలో చేరింది కాదు. అయినా, దాని మరమ్మతులకని సాంస్కృతిక వ్యవహారాలశాఖ మంచినీళ్లప్రాయంగా డబ్బు ఖర్చుపెడుతోంది. ఒక వంక బుద్ధుని స్మారకచిహ్నం నెలకొల్పేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. న్యూఢిల్లీలో 'బుద్ధవి ఉద్యానవనం' వెలిసింది. వేరొకవంక బుద్ధగయ ఆలయానికి మరమ్మతులు జరుగవలసి ఉన్నాయని కూడా మంత్రిగారికి తెలియదు! ఈ మంత్రివర్యుల కుతుబ్‌మీనార్ సమీపంలో ఒక మసీద్ మొదటి అంతస్తు పునర్నిర్మింపచేశారు. హిందూకట్టడాలే పట్ల అశ్రద్ధచూపి, ముస్లిం కట్టడాల పునరుద్ధరణకు ప్రజల సొమ్ము వినియోగిస్తున్నందువల్లనే కావచ్చు శ్రీ కబీర్‌కు ఇప్పుడు కాబినెట్‌హోదా లభించింది!

* * *

వ్యవసాయ, మత్స్య పారిశ్రామికరంగాలలో జపాన్ సాధించిన సాంకేతిక పరిజ్ఞానాన్ని భారత దేశానికి లభింపజేసే విషయమై, జపాన్—భారత ప్రభుత్వాలమధ్య ఇటీవల రెండు ఒప్పందాలు కుదిరాయి.

జపాన్‌లో సగటున ఎకరానికిపండే వరిపంట మనదేశంలో పండేపంటకు నాలుగురెట్లు ఉంటుంది. ప్రపంచంమొత్తంమీద ఆ దేశంలో పట్టేన్ని చేపలు మరేదేశంలోనూ పట్టరు. వాటిని భద్రపరిచే నిపుణత కూడా అక్కడ అభివృద్ధి చెందినంతగా మరొక చోట అభివృద్ధి చెందలేదు.

ఇప్పుడు మనం కుదుర్చుకున్న ఒక ఒప్పందాన్ని అనుసరించి, నాడియా (పశ్చిమబెంగాల్) సంబల్‌పూర్ (ఒరిస్సా), షెహాబాద్ (బీహార్), సూరత్ (గుజరాత్) పట్టణాల సమీపంలో నాలుగు ప్రదర్శన క్షేత్రాలు ఏర్పాటవుతాయి. వీటిని నిర్వహించేందుకు పదహారుగురు జపాని నిపుణులు వస్తారు. వీరు తమవెంట మొత్తం రు. 4½ లక్షలు విలువచేసే 90 రకాల వ్యవసాయ పరికరాలు తెస్తారు. వీరికి కావలసిన భూమి, వసతిసదుపాయాలు, నిర్వహణఖర్చులు భారతప్రభుత్వం సమకూరుస్తుంది. కనీసం మూడేళ్లు ఈ నిపుణులు మనదేశంలో ఉంటారు.

భారతదేశంలో ఈ క్షేత్రాలను జపాన్ ఇంతకు మునుపు ఎన్నడూ నిర్వహించలేదు.

అయితే కొంతకాలంగా నలుగురు జపాని నిపుణులు సహారన్‌పూర్‌వద్ద ఇలాంటి ప్రయోగాత్మకక్షేత్రాన్నే ఒకటి నిర్వహిస్తున్నారు. వీరు సాధిస్తున్న ఫలితాలు మనదేశంలో ఉన్న వ్యవసాయ నిపుణుల దృష్టిని ఆకర్షిస్తున్నాయి.

రెండవ ఒప్పందం ప్రకారం జపాన్ ప్రభుత్వం మనదేశానికి ఏడుగురుమత్స్య పారిశ్రామిక నిపుణులను పంపుతుంది. మైసూరు రాష్ట్రంలోని మంగుళూరువద్ద నెలకొల్పదలచిన మత్స్య పారిశ్రామిక శిక్షణ కేంద్రంలో వీరు పని చేస్తారు. శిక్షణకేంద్రం ఉపయోగార్థం 6 లక్షల 60 వేలు విలువ చేసే 90 రకాల యంత్ర పరికరాలనుకూడా జపాన్ ప్రభుత్వం అందజేస్తుంది. భారతప్రభుత్వం ఈ నిపుణులకు వసతి సదుపాయాలు కల్పించి, శిక్షణ కేంద్రం నిర్వహణఖర్చులు భరిస్తుంది.

జపాన్ నిపుణులు మనదేశానికి రావటమేకాక, మన నిపుణులకు జపాన్‌లో సాంకేతికశిక్షణకూడా లభిస్తుంది. భవననిర్మాణం పూర్తిఅయిన వెంటనే శిక్షణకేంద్రం పని ప్రారంభిస్తుంది. వివిధ రాష్ట్రాల నుంచి ప్రతిభావంతులైన యువకులను ఈ కేంద్రానికి పంపుతారు. జపాని నిపుణులు వచ్చిన తరువాత భారతీయ అధికారులతో సంప్రదించి, శిక్షణ కార్యక్రమానికి సంబంధించిన వివరాలు రూపొందిస్తారు. 



## కాలేజీ బస్సులు

మనవాళ్లు కాలేజీలు అనేకము కడుతున్నారుగాని, వాటితోపాటు సదుపాయాలు కూడా ఎక్కువ చేయాలి అని మాత్రము మర్చిపోతున్నారు. కాంటీన్ సదుపాయాలే అనుకుంటే వాటికంటే ఘోరముగా ఉంటున్నాయి బస్సు, రవాణా సదుపాయాలు. కనుక గవర్నమెంటువారు కొత్తగా కాలేజీలు ఏర్పాటుచేసినట్లే ప్రతిచోటా "కాలేజీబస్సు" అంటు ఏర్పాటు చేయాలి. దూరమునుంచి వచ్చేవారికి కాలేజీబస్సు అంటూ ఒకటి ఉంటే చాలా సదుపాయముగాఉంటుంది. విద్యార్థులుఅయితే సైకిళ్ళమీద వస్తారు. దూరమైతే వాళ్లకి సైకిళ్లమీదరావటము కష్టముగాఉంటుంది. విద్యార్థినులు అయితే వారు రోజూ రిక్షా మీద, రావటము మరీ కష్టముగా ఉంటుంది. అసలు ఇప్పుడు కళాశాలలలో విద్యార్థినులు చేరడానికే వెనకాడుతున్నారు. అటువంటప్పుడు వారికి కాలేజీకి పోవటానికి సదుపాయాలు లేకుంటే అసలు చేరరు.

విద్యార్థులను కాలేజీలో చేర్పటానికి ఫీజు, పుస్తకాలకన్న రిక్షా ఛార్జీలు ఎక్కువఅవుతాయి. మధ్యరకం కుటుంబాలకు ఈ ఖర్చు భరించటము బాధగాఉంది. ఇప్పుడు మా ఊరిలో ఒక స్త్రీలకళాశాలకూడా పెడుతున్నారు. అది ఊరికి కనీసము 5, 6 మైళ్లు దూరములో వుంటుంది. అక్కడనుంచి రిక్షాలో వెళ్లాలంటే కనీసము రిక్షావాడికి రూపాయి, రూపాయిన్నర వెళ్లటానికి ఇవ్వాలి. రాను పోను 2, 3 రూపాయలు అంటే ఎవ్వరైనా తను పిల్లలను చేర్పించటానికి భయపడతారు. అందువలన గవర్నమెంటువారు కాలేజీ బస్సు అని ఏర్పాటుచేస్తే మా ఊళ్లో లయోలాకాలేజి, పాలిటెక్నిక్, స్త్రీలకళాశాల, గవర్నమెంటు కాలేజీల వాళ్లందరికీ ఎంతో సదుపాయముగా ఉంటుంది. సీజను టికట్లు అమ్మితే అందరూ తప్పకుండా కొంటారు. విద్యార్థులకు, విద్యార్థినులకు రెండుబస్సులు ఏర్పాటుచేస్తే బాగుంటుంది. ఏకాలేజివాళ్లు ఎవరికివాళ్లు ఏర్పాటుచేసుకోవడము కష్టము గనుక గవర్నమెంటువారు విజయవాడ, గుంటూరువంటి పెద్దపెద్ద పట్టణాలలో అయినా ఏర్పాటుచేస్తే విద్యార్థులకు ఎంతో సదుపాయముగా వుంటుంది. విద్యార్థులే భావిపౌరులు, దేశమును ముందుకు తీసుకుపోయేవారు అంటారుగాని ఇటువంటి సదుపాయములు మర్చిపోతున్నారు. కనుక గవర్నమెంటువారు ఆ భావిపౌరుల కొరకు "కాలేజీ బస్సులను" తప్పకుండా ఏర్పాటు చేయిస్తే బాగుంటుంది.

"రవి"
(విజయవాడ). ★



శ్రీ గిడుతూరి లక్ష్మీనారాయణ (బొంబాయి) కొయ్యతో రూపొందించిన శిల్పం "టార్సో". ఈఏడు లలితకళాఅకాడమీ ఢిల్లీలో నిర్వహించిన జాతీయచిత్రప్రదర్శనంలో దీనిని ప్రదర్శించారు.

## రోగక్షయం

వైద్యుడు ఆ వచ్చిన పెద్ద మనిషికి ఇరవై అడుగులు దూరంగా వెళ్ళి "ఈ గడియారం టిక్ టిక్ మీకు వినిపిస్తోందా?" అని అడిగాడు.

పెద్దమనిషి కళ్ళు రెండూ మూసుకుని క్షణంసేపు ఆగి "ఆ! బాగానే వినిపిస్తోంది." అని సమాధానం చెప్పాడు.

## పౌష్టిక ఫలం

వైద్యుడు శాపిగా. అతడి దగ్గరకువచ్చి "చూడండి! మీకు చెవుడు లేదుగాని, వినిపించు కోరు! అంతే" కొంటెగా నవ్వుతూ అన్నాడు.

ఎస్. జానకి (అనంతపూర్)

## రచనలో నేర్పు

తగు మాత్రం కీర్తి సంపాదించిన ఒక రచయితను తాము తీయబోయే సినిమాకు కథ రాయమని ఒక పెద్ద నిర్మాత కోరాడు. నాలుగురోజుల తరువాత రచయిత కథ రాసుకు వెళ్లాడు. నిర్మాత ఆ కథను చదివి, తన సెక్రెటరీని పిలిచి "ముందు నాకో తలనొప్పి మాత్ర తెప్పించి, ఈ పెద్దమనిషిని పంపేసెయ్యి. సినిమా క్షవరమైపోయేట్లు కథ వ్రాయడంలో ఇతడు నేర్పరిలా ఉన్నాడు" అని గుక్కతిప్పకోకుండా చెప్పాడు!

కామేశ్వరరావు (కాకినాడ)

★


రత్నం బాల్ పెన్ను - రీఫిల్సు -

జర్మనీలో శిక్షణపొందిన మా ఇంజనీరు ఆధ్వర్యమున నాణ్యంగా తయారు కాబడినవి.




మద్రాసులో ఫ్యాక్టరీ స్థాపించబడినది

కె.వి.రత్నం & సన్సు, రత్నం బాల్ పెన్ వర్క్సు, రాజమండ్రి (A P)

అన్నిరకముల ఫౌంటెన్ పెన్స్ రిపేర్సు సంతృప్తికరముగా చేయబడును.

ఓం : తత్ : సత్ :



సుఖ జీవిత సేవ

"సిద్ధ ఔషధ మహిమ"

సిద్ధుల సాటిలేని మహిమకు ఒక తార్కాణము

కె. టి. కృష్ణమూర్తి ఆచ్చారిగారి

"మేల్ మాయిల్ మందు"

(Regd.)

దీర్ఘకాల చర్మ రోగములకు ఉత్తమ నివారిణి

నల్లరంగు, ఎఱ్ఱరంగు పొడలు, దద్దులు, పోట్లు, గజ్జి, (చర్మ సంబంధము) పొడలు గల చోట్లలో తిమ్మర్లు, సూదితో పొడిచినప్పుడు నొప్పి లేకుండుట, నిప్పుపడి బొబ్బలు గలిగిన తెలియకుండుట, దుర్ నీరు సర్వ అవయవములందు వ్యాపించి, రక్తములో కలిసి మత్తు కలుగజేయుట, (నరముల సంబంధము) చేతి వేళ్లు ముడుచుకొనుట, బొబ్బలు లేచుట, ముక్కు బంధనములు, పాదమునందు పల్లపు పుండ్లు ఏర్పడుట, కాలు చేతులు వేళ్ళు తగ్గుట, ముక్కు పొట్ట పడుట, చూచుటకు విసుగు పుట్టించు రణములు (అస్థి సంబంధము) వీటికి ఉత్తమ నివారిణి.

1 మండలం నూనె, లేహ్యము 8 oz శ్రీ పరమాత్మస్నాన తైలం తపాల ఖర్చులతో రు. 12.

పూర్తి వివరములకు వ్రాయండి :

సిద్ధ డాక్టర్ K. T. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు,

5/22, మేల్ మాయిల్ P.O. (N. A. Dt.)



Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street Madras-1. Chief Editor: S. Sambhu Prasad.



**విహారయాత్ర**

ఫొటో : ఎస్. వెంకన్న (ఖర్గపూర్)

# రాగిణి సౌందర్య రహస్యం...

## 'మనోహర చర్మసౌందర్యమునకు అనువైనది లక్స్'

తారల చర్మ సౌందర్యం ప్రకాశింపు చుండగా లక్స్‌యొక్క రహస్యం మరుగు పరచ శక్యమా? రాగిణి కేసి చూడండి! అది స్పష్టంగా లక్స్‌వల్ల కలిగిన చర్మ సౌందర్యం ... స్వచ్ఛం, మృదులం, మనోహరం. మరి మీ సౌందర్యమో? లక్స్‌వాడితే ... దాని సౌమ్యమైన నురగ వల్ల పెంపొందే మీ రూప లావణ్యం అపురూప సుందరం. లక్స్‌వాడితే.... సర్వవ్యాప్తమైన దాని దివ్య పరిమళం ప్రత్యక్షంగా మీ అంద చందాలను విస్తరింప జేస్తుంది. లక్స్ వాడండి ... వానవెల్లి రంగులలో మీ చిత్త మొచ్చింది ఏదైనా ఎన్నుకోవచ్చు ... ఆ! మీ ప్రియమైన తెలుపులో కూడా వున్నది. మీ సౌందర్యమునకు కూడా అనువైనది లక్స్ టాయిలెట్ సబ్బు.

సినిమా తారలకు సౌందర్యమునిచ్చే శుద్ధమైన, సౌమ్యమగు సబ్బు.




**నాకు నచ్చిన సబ్బుకు, మెచ్చిన రంగులు!'** అన్నది సొగసైన సినీమాతార **రాగిణి.**

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

LTS.112-X52 TL